# తెనుగు – ఇంగ్లీషు నిఘంటువు

రచయిత:
విలియం బ్రౌన్

వెల రూ. 5-0-0.

సంస్కృతి ప్రచురణ
(44)

సంస్కృతి ప్రచురణ - 44.

వెల ఐదు రూపాయలు.

ప్రథమ ముద్రణ

1818.

ద్వితీయ ముద్రణ - సంస్కృతి ప్రచురణలలో 1953.

ప్రకాశకులు:

కల్చరల్ బుక్స్ లిమిటెడ్,

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.



ముద్రాపకులు:

స్వతంత్ర ప్రెస్,

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

# మా మాట

ఇది 1937-38 నాటి మాట. చదువుకుంటూన్న మిత్రుని పిల్లలకు కావలసిన 'తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు' కోసం ఊరల్లా వెతికాను. కాని యెక్కడా దొరకదన్నారు. "1926 లోనో యేమో వావిళ్ళవారు శంకర నారాయణగారి 'తెనుగు-ఇంగ్లీషు నిఘంటువు' ప్రచురించారు. ప్రతులు అయిపోయాయి. మరల వావిళ్ళవారు ముద్రింపించలేదు. మరే 'తెలుగు-ఇంగ్లీషు డిక్షనరీ' బజారులో లేదు" అన్నారు, ఒక రిద్దరు గ్రంథ విక్రేతలు.

పోనీ పాతప్రతి యేదైనా దొరుకుతుందేమోనని పాత పుస్తకాల అంగళ్లు వెతుకుతూవుంటే ఆదియప్పనాయకన్ వీధిలో ఒక పాత పుస్తకాల దుకాణదారుడు (అరవ సోదరుడు) "నా వద్ద 'తెనుగు-ఇంగ్లీషు ఒకాబులరీ' వుంది. కాని మీరా ధర యిచ్చుకోలేరు," అన్నాడు. "ధర యెంతేమిటి?" అంటే, "పాతిక రూపాయలు" అన్నాడు. ఆ రోజుల్లో పాతిక రూపాయలంటే ఒక ఎం. ఏ., ఎల్. టి., గారి పదిహేనురోజుల జీతమన్నమాట. అదృష్టవశాత్తు జేబులో 'పాతిక రూపాయ లుండడంవల్ల "యింత ధర?" అని అనిపించినా, సాహసించి పుస్తకం చూపమన్నాను. భద్రంగా దస్త్రంలో చుట్టి వుంచిన పుస్తకాన్ని లోపలినుంచి తెచ్చి చూపాడాయన. పుస్తకం తెరవగానే మొదటి పుటలో కనబడ్డ ప్రచురణ సంవత్సరం 1818 చూచి ముగ్ధుణ్ణి అయిపోయాను. 1848 లో ముద్రింపించిన "కాకోల్కకం" ప్రతిని నెల్లూరు జిల్లా, కొత్తూరు వాస్తవ్యులు, కీర్తిశేషులు శ్రీ గునుపాటి యేనాది రెడ్డిగారు యెన్నడో యిచ్చారు. 1818 లో తెనుగుముద్రణ వున్నదనిగూడా నాకు తెలియదు. అందుచేత '1818' నన్నెక్కువగా ఆకర్షించింది. పుస్తకం పేరు 'ఎ ఒకాబులరి ఆఫ్ ది జెంటు ఇంగ్లీషు లాంగ్వేజ్' అని వున్నది. అప్పట్లో 'జెంటూ' అన్న పదాని కర్థమేంటోకూడా తెలియదు. కాని 120 సంవత్సరాలనాటి పుస్తకం దొరికింది గదా అన్న సంతోషంతో కొన్నాను.

ఇంటికెళ్ళి తాపీగా చదివి చూచాను. చాల ఉపయోగకారి అని తోచింది. అందుచేత పిల్లల చేతబడకుండా నేనే భద్రపరిచి వుంచాను.

మా ఇంటికొచ్చిన మిత్రులకు చూపి పునర్ముద్రణనుగురించి వారి అభిప్రాయాన్ని అడుగుతూ వుంటేవాణ్ణి. శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు, పండితారాధ్యుల నాగేశ్వరరావు, నాళ్ల వెంకటేశ్వరరావు, విద్వాన్ విశ్వం, పందిరి మల్లిఖార్జునరావుగార్ల వంటి మిత్రులు పునర్ముద్రణవల్ల ఉపయోగముంటుం దన్నారు.

సంవత్సరంక్రితం పాఠ్య పుస్తకాలను ఉన్నత పాఠశాలలలో పెట్టించుకునే ప్రయత్నంలో పుల్లంపేటకు వెళ్ళాను. అక్కడి ఉన్నత పాఠశాల తెలుగు పండితులు శ్రీ ఇ. వి. క. శర్మగారు తమవద్ద 1848 లో ముద్రింపబడిన 'ఆంధ్ర దీపిక' అన్న నిఘంటువు (తెనుగు-తెనుగు) వున్నదనీ, మేము పునర్ముద్రించేట్టయితే యిస్తామనీ అన్నారు. వారి సూచనవల్లనే చేతనున్న యీ 'జెంటు నిఘంటువు'ను మేము పునర్ముద్రింప పూనుకున్నాం. వారు పంపిన వెంటనే 'ఆంధ్ర దీపిక'ను గూడ పునర్ముద్రింప ప్రయత్నిస్తాం. పాఠక మహాశయులవద్ద 'ఆంధ్ర దీపిక' వున్న మాకు పంప ప్రార్థన.

నెల్లూరుజిల్లా, కోట గ్రామ వాస్తవ్యులు, మా చిన్నాయనగారైన శ్రీ గాలి సీతారామయ్యగారు యీ ప్రయత్నంలో మాకు ఉపయోగకారిగా నుండుటకు తమ వద్దనున్న బ్రౌణ్యాం రెండు సంపుటాలను— తెనుగు-ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెనుగు నిఘంటువులను —పంపారు. ప్రూఫులు చదవడంలో, వేళాపాళా లేకుండా మే మెప్పుడు ప్రూఫులు పంపినా, వెంట వెంటనే సరిచూచి పంపారు మిత్రులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు. మే మీ నిఘంటువును ప్రచురిస్తున్నామని, దీని తొలిపలుకు వ్రాయుట కుపయోగపడు పుస్తకాలేవైనా తమవద్ద నున్నవి పంపమంటే వెంటనే శ్రీ పాతూరి నాగభూషణంగారు 'తెనుఁగు నుడిదండలు' అను రచనను, యింకా పుస్తకరూపాన వారి ప్రెస్సునుండి వెలువడకముందే, పంపారు.

మేము కోరగానే మా వేడుకోలును పాటించి శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారు 'పరిచయ వాక్యాలు' (నిఘంటు రచనా పరిణామము) వ్రాసి యిచ్చారు.

మాతృకలోని నాలుగు పుటలు ఆంధ్ర పాఠక మహాశయులవద్ద దొరుకుతవేమో అని మేము లేఖ రూపాన వ్రాసిన ప్రార్థనను ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ నిర్వాహకులు ప్రచురించారు.

వీ రందరికీ మా కృతజ్ఞతాపూర్వక వందనాలు. పెట్టుబడి పెట్టలేక,

యీ నిఘంటువు యేపాటి పాఠకుల మన్ననను పొందగలదో? వూహించ లేక కొద్ది ప్రతులుమాత్రమే ప్రచురించాం. ఇందు దోషములున్న పాఠకులు మా కెరింగింప ప్రార్థన. పునర్ముద్రణమున చక్క బెట్టుకోగలం. మా యీ ప్రయత్నానికి ప్రోత్సాహ మివ్వమని ఆంధ్ర ప్రజలను ప్రార్థిస్తున్నాం. త్వరలోనే 'ఆంధ్ర దీపిక' ను ప్రచురించే భాగ్యం పాఠకులు మాకు ఒనగూరుస్తారని నమ్మకం.

మద్రాసు.                                                    విధేయుడు,
24-2-53.                                          కొత్తపల్లి సుబ్బరామయ్య.

# ఇందులోని కొన్ని సూచనలు



*adj.* — adjective.
*adv.* — adverb.
*conj.* — conjunction.
*int.* — interjection.
Item. — రూపాంతరము : పర్యాయ పదము.
N. B. — note well.
*par.* — participle.
pl. — plural.
*pre.* — preposition.
*pro.* — pronoun.
*sub.* — subject.
*v. a.* — verb - adverb.
vide. — చూడు.
*v. n.* — verb - noun.
*v. p.* — verb - participle.

# నిఘంటు రచనా పరిణామము

భారతదేశ నిఘంటు చరిత్రలో వాస్తవముగా విశిష్టరూపమును బొందినవి రెండే దశలు: 1. పద్యరూపకోశముల దశ; 2. పాశ్చాత్య వైజ్ఞానిక సంసర్గము కలిగిన తర్వాత అకారాదిక్రమమున నేర్పడిన నిఘంటువుల దశ. పద్యరూపమున నున్నయెడల కంఠస్థము చేయడానికి అనుకూలముగా ఉండగలదనే ఉద్దేశముతో సంస్కృతభాషలో అమరము మొదలయిన కోశములు 192 పుట్టినవి. కాని, అందులో 80 మాత్రమే గ్రంథరూపమును పొందినవి. మిగిలినవి నామమాత్రావశిష్టము లయినవి. వ్యాఖ్యాతలు తమ రచనలలో కొన్నిటిని పేర్కొన్నారే కాని నేటి కవి కనబడలేదు. కొన్నిచోట్ల ఆ కోశములనుండి వ్యాఖ్యాత లెత్తిచూపిన శ్లోక చరణభాగాలనుబట్టి ఆ కోశముల స్వరూపమూహించుకొనవచ్చును. శబ్ద సముదాయమును పద్యరూపములో నిమిడ్చి రచించే పద్ధతి సంస్కృతభాషకున్ను, దాని ననుసరించుటచేత తెలుగు భాషకున్ను ఉన్నట్లు ప్రపంచములో మరి యేదేశమందున్ను, మరి యే భాషకున్ను లేదు.

సంస్కృతభాషలో వెల్వడిన నిఘంటువులందు మొట్టమొదట పేర్కొనవలసినది వైదిక నిఘంటువు. దీనికి యాస్కుడు నిరుక్తమను పేర ఒక వ్యాఖ్యానము రచించెను. ఇది కేవలము వైదికభాషకే సంబంధించినది. పిమ్మట సంస్కృతభాషకుగల చాలా కోశములలో సమానార్థకములైన పదములు స్వర్గ, భూమి, పాతాళాదివర్గములక్రిందను, అనేకార్థములుగల పదములు ప్రత్యేకముగా మరియొక ప్రకరణమునందును కనబడుతున్నవి. ఇందులో ఏ పదమెక్కడనున్నదో సులువుగా తెలిసికొనుటకు ఏదైనా ఒక అకారాది వర్ణక్రమమునుబట్టి పదముల నేర్పరచవలెనన్న ఆశయము పాశ్చాత్య వైజ్ఞానిక సంపర్గము కలుగకమునుపే మన దేశములో పుట్టినట్లు మన సంస్కృతాంధ్ర నిఘంటువులే విశదపరచగలవు. సంత్కృతములో 'అమరకోశము' ప్రఖ్యాతమైన ప్రాచీనకోశము. దానిలోగల లోపములను పూర్తిచేసే ఉద్దేశముతో 13-వ శతాబ్దములో పురుషోత్తమదేవు అనే కళింగదేశ రాజు 'త్రికాండశేషః' అనే పేర నొక కోశమును పద్యరూపముననే రచించినాడు. ఈ రెండింటిలోను

మొదటి రెండు కాండలందును విషయానుక్రమణమున్ను, తృతీయకాండలో అకారాదిశబ్ద నిరూపణమున్ను కలవు. అమరసింహుడు విడిచిన పదములను ఎత్తుకొని పురుషోత్తమదేవు అర్క మొదలుకొని స్నేహ శబ్దము వరకున్ను గల శబ్దములకు నానార్థములను వివరించినాడు. 14 వ శతాబ్దములో 'దేశి నామ మాలా' (రత్నావళీ) అనే పేర్లతో ప్రాకృత నిఘంటువును రచించిన హేమ చంద్రుడు "అథ అకారాదయోవ్యాక్షరాః శబ్దాః సంగృహ్యంతే" అని అజ్జః ( = అద్యః) అనే శబ్దము మొదలుకొని హేరంబ శబ్దమువరకునుగల ప్రాకృత శబ్దములను పేర్కొన్నాడు. ఈ హేమచంద్రుడే 'అనేకార్థ సంగ్రహమ'నే సంస్కృత శబ్దకోశములో మూడు విధములయిన క్రమములను పాటించినాడు: 1. అక్షరసంఖ్యనుబట్టి ఏకస్వర శబ్దాః ద్విస్వర శబ్దాః,...ఈ విధముగా ఒకటి మొదలు ఆరు అక్షరములవరకున్నుగల శబ్దములను ఆరు తరగతులుగా ఏర్పరచి నాడు. 2. ఏకాక్షర శబ్దములలో అకారాదిక్రమము పాటించి, రెండు, మూడు, నాలు, గై, దారు వర్ణములగల పదములను అంతమందుగల అక్షరములనుబట్టి ద్విస్వర కాంతాః...అని ఈ విధముగా కాంతములనుండి హాంతములవరకున్ను క్రమము పాటించి శబ్దములను పేర్కొన్నాడు. 3. ఇక ఒక్కొక్క వర్గ ములో—అనగా ద్విస్వరనాంతములు, పంచస్వరమాంతములు, షట్ స్వర వాంత ములు...ఈ విధముగా ఏర్పడిన వర్గములలో—అకారాదిగా శబ్దములను పేర్కొన్నాడు. 'మేదినీ' అనే కోశముకూడా చాలా ప్రసిద్ధిపొందినది. అందులో కూడా పైని వివరించిన మూడు విధములయిన క్రమములున్ను పాటించడమయి నది. అయితే, అందులో చిన్న భేదము లేకపోలేదు. హేమచంద్రుడు మొట్ట మొదట అక్షరసంఖ్యనుబట్టి వర్గము లేర్పరచి అందులో తక్కిన రెండు లక్ష ణములున్ను పాటించి విభాగము లేర్పరచినాడు. 'మేదిని'లో మొట్టమొదట అంత్యాక్షర క్రమమునుబట్టి వర్గము లేర్పరచి, అందులో తక్కిన రెండు లక్ష ణములున్ను పాటించి విభాగము లేర్పరచినాడు. 12 వ శతాబ్దాంతములో కులో త్తుంగ చోడదేవుని కుమారుడైన రాజరాజ చోళదేవుని ఆదరమున కేశవస్వామి రచించిన 'నానార్థార్ణవ సంక్షేపమ'నే నిఘంటువులో మొట్టమొదట ఒకటి మొదలు ఆరువరకున్ను అక్షర సంఖ్యనుబట్టి ఆరు కాండములక్రింద శబ్దములను వివరించి, ప్రతి కాండములోనుగల శబ్దములను స్త్రీ, పుం, నపుంసక, వాచ్య లింగ, నానా లింగములక్రిందను అంతర్భాగముల నేర్పరచి ప్రతి భాగములోను గల శబ్దములను అకారాదిగా వివరించబడియున్నది.

పైని వివరించిన కోశము లన్నిటను కూడను ప్రతి చిన్న వర్గమందున్ను

గల పదములను అకారాదిగా పేర్కొనవలెనన్న ఆశయ ముండెననుట స్పష్టము.

మన తెలుగుకోశములలో 1619-37 నడుమ వెలసిన 'చౌడప్ప సీసపద్యములకోశము' మొదలుకొని ఈ 20-వ శతాబ్దిలో అమలాపురపు సన్యాసి కవి రచించిన 'సర్వాంధ్రసార సంగ్రహము'వరకున్ను అనేక కోశములు పద్యరూపముననే వెల్వడినవి. అందులో గణపవరపు వేంకటకవి రచించిన 'వేంకటేశాంధ్రము', పైడిపాటి లక్ష్మణకవి ప్రణీతమైన 'ఆంధ్రనామ సంగ్రహము', 'ఆంధ్ర రత్నాకరము', అడిదము సూరకవి కల్పితమైన 'ఆంధ్ర నామశేషము', కస్తూరిరంగకవి రచించిన 'సాంబ నిఘంటువు', ముదురుపాటి వేంకటకవి రచించిన 'ఆంధ్ర భాషార్ణవము' ముఖ్యమైనవి. సంస్కృత కోశములవలెనే అన్నీ పద్యరూపమున నున్నవేకాని, సంస్కృతకోశములు పాటించిన అక్షర క్రమ నియమము ఎక్కడా కనబడదు. ఆంధ్ర భాషార్ణవములో అవ్యయవర్గమందును, క్రియావర్గమందును అకారాదిక్రమము ననుసరించే ప్రయత్నము జరిగినది; కాని, సమానార్థములైన పదములు చేర్చవలసివచ్చుటచేత ఆ క్రమము నిలువలేదు.

ఇవికాక కొన్ని లక్షణ గ్రంథాలలో శకటరేఫ, సాధురేఫ వివేకార్థము కనబరచిన శబ్దముల పట్టికలు పద్యరూపముననే ఉన్నవి. అందులో అకారాది వర్ణక్రమము పాటింపబడినది. అప్పకవీయములో "అచ్చులమీదను హల్లుల మీదను గలుగు రేఫ లకారములు వచింతు"నని రెండు పెద్ద సీసమాలికలు రచితములయినవి. అకారాదిక్రమము శబ్దముల మొదటి వర్ణమునుబట్టి చేయలేదు. ఉద్దిష్ట రేఫ వర్ణమునకు ముందున్న హల్వర్ణమునుబట్టి చేయడమయినది. గిరగిర, వేగిరపడు, జేగురుకొండ, గురుపాండు మొదలయిన శబ్దములలో రేఫాక్షరమునకు ముందుగల గి, గు మొదలయిన వర్ణములనుబట్టి అకారాది వర్ణక్రమము కలదని గ్రహించవలెను.

కూచిమంచి తిమ్మకవి రచించిన 'సర్వలక్షణసార సంగ్రహము'లో తృతీయాశ్వాసమున రేఫద్వయ నిర్ణయమును తెలియజేసే పద్యము లనేకముగా గలవు. అందులో "అరియుప్పన మరి సింజని" మొదలుగా "సారెలును పెళ్ళిసారె వేసారుటయును। సారెలును, సూరులును నేరు సైరణయును। సరవి సోరణ గండ్లును శౌరుకాంగ। బరగునివి యొల్లరేఫ లంబర శిరోజ" అని రేఫలుగల పదములు అకారాది శబ్దక్రమమున కనబడుతున్నవి.

అకారాది క్రమమును మన దేశమందలి కోశకర్తలు గ్రహించకపోలేదు. కాని, పద్యరూపమునగాక నేటి నిఘంటువులలో ఉన్నట్లు పట్టికల రూపమున నుడివండలను ప్రదర్శించవలెనన్న ఆశయముమాత్రము పాశ్చాత్య వైజ్ఞానిక

సంసర్గమువలననే కలిగినదని చెప్పక తప్పదు.

పాశ్చాత్య దేశాలలోనైనా నిఘంటు నిర్మాణ ప్రయత్నము 15-వ శతాబ్దమునకు పూర్వము జరుగలేదు. మన దేశములో మొన్న మొన్నటివరకున్ను తెలుగు మొదలయిన దేశభాషలయెడల పండితులకు ఆదరము తక్కువయి సంస్కృత భాషయెడల ఆదరము ఎక్కువగా నుండినట్లే, ఇంగ్లండులో 16-వ శతాబ్దమువరకున్ను ఆంగ్లభాషయెడల ఆదరము తక్కువగాను లాటిన్ భాషయెడల ఆదర మెక్కువగాను ఉండేది. అందుచేత లాటిన్ పదములను అకారాదిగా పేర్కొని, ఆ పదములను ఇంగ్లీష్ పదములతో అర్థవివరణము చేస్తూ రచించిన నిఘంటువులే ముందుగా వెల్వడినవి. 1440-1499 నడుమ ఆంగ్లభాషా పదములకు లాటిన్ భాషా పదములను తెలియజేసే ఉద్దేశముతో 'ఆంగ్ల-లాటిన్ నిఘంటు' ప్రయత్నము జరిగినది. 1658 లో జాన్ మిల్టన్ మేనల్లుడైన ఎడ్వర్డ్ ఫిలిప్స్ 'న్యూ వర్ల్డ్ ఆఫ్ ఇంగ్లీష్ వర్డ్జు' అనే పేరను అన్యదేశ్యములై వచ్చిన ఆంగ్ల భాషాపదముల నిఘంటువును రచించినాడు. 1780 నాటికిగాని నేటి రూపమున కనబడు నిఘంటు నిర్మాణము సాగలేదు. ఫ్రాన్స్ దేశములో 'ఫ్రెంచి నిఘంటువు' అంతకు కొద్దిగా ముందుగానే రచితమయినది. 1672-1740 నడుమను ఎడిసన్, స్విఫ్ట్ మొదలయిన ఆంగ్లభాషా పండితులు, మన దేశమందలి పండితులవలెనే, భాషా పారిశుద్ధ్యము వ్యాకరణము వల్లను, కోశమువల్లను భద్రముగానుండునన్న ఉద్దేశముతో నిఘంటు ప్రయత్నము తలపెట్టినారు. తత్ఫలితముగా ప్రఖ్యాత పండితుడయిన జాన్సను శబ్దశుద్ధి పాటిస్తూ 'ఆంగ్ల భాషా నిఘంటువు'ను 18-వ శతాబ్దములో రచించినాడు. సమగ్రమైన ఆంగ్ల భాషా నిఘంటువులలో ఇదే మొదటిది. ఇది మరల మరల సవరింపవలసిన అగత్యములేకుండ కలకాలము నిలిచియుండగల ప్రామాణిక నిఘంటువు అనే అభిప్రాయము జాన్సనుకే కాక ఆనాటి ఇతర పండితులకున్ను ఉండేది.

ఐతే దేశభాషలు జీవముగలవి. ఆ భాషలను మాటలాడే జనుల విజ్ఞానముతోను, సంస్కృతితోను అవికూడా మారుతూ ఉండడము సహజము అనే వివేకము కలిగిన తర్వాత ముప్పది నలుబది సంవత్సరముల కొకసారి వ్యాకరణమున్ను, నిఘంటువున్ను క్రొత్తగా వచ్చిన శబ్దములను, మారిపోయిన శబ్దార్థ రూపములను పాటించి సవరణ పొందవలసి ఉంటుందన్న విషయము విజ్ఞులు గ్రహించినారు.

ఇంగ్లండునుండి మన దేశమునకు వచ్చినవారిలో మన దేశభాషలయెడ

లను, వ్యాకరణములయెడలను ఆదరముగలవారు కొంద ఱుండిరి.. మన తెలుగుభాషయెడల ఆదరముగలవారిలో విలియమ్ బ్రౌన్, ఏ. డి. కాంబెల్, సీ. పీ. బ్రౌన్, ఆర్డెన్, ఏ. గాలెటీ మొదలయినవారు ముఖ్యులు.

ఇప్పుడు కల్చరల్ బుక్స్ లిమిటెడ్ అనే పేరను సాంస్కృతిక విద్యా విషయిక గ్రంథ ప్రకాశకులు ముద్రించి, ప్రకటించిన ఈ నిఘంటువును విలియమ్ బ్రౌన్ 1807 లో ప్రకటించెను. ఇతని నిఘంటువు వెల్వడిన తర్వాతనే కాంబెల్ 1810 ప్రాంతమున మరియొక తెలుగు-ఇంగ్లీషు నిఘంటువును ప్రకటించెను. పిమ్మట 1852-54 నడుమ ఈ ఇద్దరికంటెను ఎక్కువ విద్యార్థకుడును, ఎక్కువగా తెలుగుభాషలో కృషిచేసిన పెద్ద పండితుడును అయిన సీ. పీ. బ్రౌన్ పెక్కుమంది పండితుల సాహాయ్యముతో పెద్ద నిఘంటువులు రెండు 'ఇంగ్లీష్-తెలుగు', 'తెలుగు-ఇంగ్లీష్' నిఘంటువులు ప్రకటించినాడు.

విలియమ్ బ్రౌన్ ప్రకటించిన తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు సీ. పీ. బ్రౌన్ నిఘంటువుకంటె చాలా చిన్నదే అయినను, అకారాది వర్ణక్రమమున వెల్వడిన 'తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు'లలో ఇదే మొదటిది గనుకను, కాంబెల్, సీ. పీ. బ్రౌన్ నిఘంటువులకు మార్గదర్శకముగా నుండెను గనుకను, ఇందులో ఉపయోగసరణి ఎక్కువ స్పష్టముగా తెలియజేయడమయినది గనుకను, దీని ప్రతులు ఎక్కడనోకాని సాధారణముగా దొరుకుటలేదు గనుకను దీని నిప్పుడు మరల ముద్రించి, ప్రకటించుటవలన తెలుగుభాష ఎట్లు పరిణమిస్తూఉన్నదో తెలిసికొనగోరువారికి గొప్ప మేలుకలిగినదని చెప్పవలెను.

ఈ నిఘంటువున్ను కాంబెల్ నిఘంటువున్ను ప్రకటితములయిన తర్వాతను సీ. పీ. బ్రౌన్ నిఘంటువు ప్రకటితముకాక పూర్వమునను, 1848 లో మామిడి వెంకయ్య రచించిన 'ఆంధ్ర దీపిక' ముద్రితమయినది. 1848 లో ముద్రితమైనా ఇది 1816 లోనే రచితమైనట్లు తెలియవచ్చినది. ఏదైనా విలియమ్ బ్రౌన్ ప్రకటించిన ఈ నిఘంటువు తర్వాతనే 'ఆంధ్ర దీపిక' రచితమైనది. ఇతను మునుపటి కోశములవలె పద్యరూపమునగాక, అకారాదిగా ప్రాచీన ప్రబంధములనుండి పదములనుచేర్చి తెలుగుభాషలోనే అర్థ వివరణములను గావించి నూతన ఫక్కిని నిఘంటువును రచించెను. సీ. పీ. బ్రౌన్ ప్రకటించిన 'తెలుగు-ఇంగ్లీష్' నిఘంటువునకు విలియమ్ బ్రౌన్ రచించిన ఈ నిఘంటువు మార్గదర్శకమైనట్లే, శబ్దరత్నాకరాది తెలుగు-తెలుగు నిఘంటువులకు 'ఆంధ్ర దీపిక' మార్గదర్శకమైనది కనుక దీనినికూడా ఈ సంస్కృతి ప్రచురణలవారు, మరల ముద్రించుట మంచిదని నా యభిప్రాయము.

విలియమ్ బ్రౌన్ ప్రకటించిన ఈ నిఘంటువు ఆనాటి తెలుగుదేశములో వ్యవహారమందుండిన శబ్దములను తెలుగుభాషలో కృషి చేసి తెలిసికోగోరినవారికి ఉద్దేశించి రచితమయినట్లు కనబడుతున్నది. ఇందులో కేవలము గ్రంథములందే కాని వ్యవహారమందు లేని పదములు నాకు కనబడలేదు. వ్యవహారమందుండిన పదములన్నీ కలవా? అనే ప్రశ్నకు సమాధానము చెప్పటము కష్టము. ఈ గ్రంథములోగల పదములన్నీ నాలుగువేలకంటె తక్కువగానే ఉన్నవి. ఇందులో తెలుగువారు సాధారణముగా ఇంటా బయటా వాడుకచేసే పదములే కాక కోర్టులలోను, కచ్చేరీలలోను వ్యవహారరీతిగా వాడుకొనే పదములుకూడా ఉన్నవి. అందులో కుంపిణీ, వారంటు, రిజిష్ట్రారు, ఫీజు, సమ్మన్సు, కంప్లెయింటు, అప్పెలాంట్ మొదలయిన ఆంగ్లభాషా పదములున్ను, మహాన్సాలు, మారీఫత్తు, యిజారా, యిజాఫా, ఫారీఖత్తు, వసూలు మొదలుగా పార్శీతురుష్కజాతులవారినుండి రివిన్యూ సంబంధముగావచ్చిన పదములున్ను, తెలుగుదేశమందు నిత్య వ్యవహారమందుండేవి కనుకనే ఇందులో చేర్చుకొనుట జరిగినది. ఈ నిఘంటువులో అ, ఆ లతోగల పదముల తర్వాత కకారములోగల పదములే కనబడుటవలన తక్కిన అచ్చులతోగల పదములు లేనట్లు తోచును. కాని, ఇవి హల్వర్ణములతో కూడియున్నవి. ఇ, ఈ, ఎ, ఏ లతో నుండవలసిన పదములు యి, యీ, యె, యే లతోను ఉ, ఊ, ఒ, ఓ లతో నుండవలసిన పదములు వు, వూ, వొ, వో లతోను ఋకారముతో నుండవలసిన ఋషి మొదలయినవి రుకారముతోను ఆయా స్థలములందున్నవి. ఇవి తెలుగువారి ఆనాటి ఉచ్చారణమునుబట్టి ఆ విధమున కనబరచడము జరిగినది.

ఆయా శబ్దములకుగల అర్థ వివరణము ఇంగ్లీష్ భాషలో లెస్సగా విశదపరచడమయినది. అంతేకాక ఆ పదముల ప్రయోగము ఉదాహరణములతో విశదీకరించడముకూడా జరిగినది. (చూ. మార్గం... పెండ్లి, పట్టు మొ.)

ఈ నిఘంటువు ఆంగ్లభాష తెలిసిన ఆంధ్రేతరులకు, తెలుగువారికి, విద్యార్థులకు, ఆంధ్రభాషా పరిణామము తెలుసుకోగోరిన భాషా పరిశోధకులకు ఎక్కువగా ఉపయుక్తమయిన గ్రంథము.

దీనికి పీఠిక వ్రాయవలసినదని కోరి నన్ను గౌరవించిన, ఈ గ్రంథ ప్రకాశకులకు నేను చాలా కృతజ్ఞుడను. ఈ గ్రంథము పునర్ముద్రితమైనందుకు తగిన సద్వినియోగముకూడా పొందుగాక!

మద్రాసు-5.　　　　　　　　　　గి॥ వేం॥ సీతాపతి.

23-2-1953.

A

# VOCABULARY

OF

## GENTOO AND ENGLISH,

**Composed of Words in Current Use, and Illustrated by Examples**

APPLICABLE TO THE

## FAMILIAR SPEECH AND WRITINGS,

OF THE

MIDDLE ORDERS AND MORE ELEVATED RANKS

OF THE

## MODERN GENTOO PEOPLE,


**BY A SENIOR MERCHANT,**

ON THE MADRAS ESTABLISHMENT MANY YEARS RESIDENT IN THE

*NORTHERN CIRCARS.*



*MADRAS:*





PRINTED BY CONSTANTINE SAMPIE, AT THE COMMERCIAL PRESS.

1818.

# P R E F A C E

——:(o):——

HE present Volume comprehending a part of the Work originally proposed for publication, under the title of a Grammar and Vocabulary of the Gentoo Language, is now offered to the Public in a detached and insulated form. It comprises a selection of words, with the English Translation of them, remarkable only for the familiar and approved use of them in the conversation and diction of the people, amongst whom the Gentoo Language of the present day is current. Why a separation and double use has been made of the work, and how it has happened to be so exceedingly tardy in making it's appearance, a very few words will explain. The other observations which the present occasion calls for, will not take up much of the Reader's time in perusing, nor will the time so bestowed, it is hoped, appear to have been fruitlessly induced.

At the period, when in the midst of my labours for bringing the work forward in print, I had reached the conclusion of the sheets comprehending the Grammar only, a rival work issued from another Press; also purporting to be a Gentoo Grammar. Unwilling that a predilection, often as hastily formed as it is too often erroneous, should be adopted in favour of that production, the resolution of making the two Works appear together compelled me to separate my Grammar (which possessed the stamp of priority over the other work by about seven years) from its

natural and avowed attachment to the Vocabulary. There was at least so much of principle in the violence committed by this separation, that it was dictated by a conscientious opinion of advancing the interests of the service by the measure, which had been an object of my avowed attention from the earliest period of the undertaking. A portion of self-pride, I am free to confess, intermingled it's influence in the decision; and, if there was any thing of wounded feeling in the sensation, it arose from the reflection of seeing a work spring up so like my own in what it professed, and so unlike it in all the essential materials of which it was constructed.

In regard to the other question, I have to explain, that, called away from Madras upon official duties which prevented a daily revisal of the Press, the necessity of having the proof sheets transmitted to a distance for correction, may sufficiently account for the great deviation from the promised period of publication. Had I remained in Madras, there is no doubt the publication would have appeared in August last, as promised. I fear this explanation brings on another of a more delicate and important nature, as regarding the errors in print, which this mode of examining the proof sheets may unfortunately have caused. All I can say on this head is, to hope from the attention uniformly and assiduously bestowed on this part of my duty towards the public, as far as circumstances would admit, that the errors which may have crept in will neither be too numerous to give offence, nor yet so material as to call for censure.

Of the remaining points regarding the construction of the essential parts of the Vocabulary, I need make but a

cursory mention; because, so much has already been said in my Preface to the Grammar, on every needful point connected with the Language as to render all observations in this place superfluous. In the Preface, the construction of the Grammar and the principle on which it has been framed, are fully laid open; and it is only necessary to say here, that the Vocabulary is formed on exactly the same model. The one professes to teach the Language spoken and written at the present day; the other, in like manner, displays the words and expressions and familiar phrases inherent in the Language most commonly in present use. It has also embraced those words of the Sanskrit or of any other Language, decidedly adopted and brought into use by habitual choice, either in speech or in writing: for it was recommended to the Learner in the Preface to the Grammar, that "he make frequent reference to the Vocabulary, in which few Sanskrit words of undoubted use and currency have been omitted."

It must be confessed, that those who fastidiously delight in an abstract consideration of words, for ever pausing in order to determine whether it be an adopted or an original word from any particular Language, will be disappointed in their search for the distinctions throughout the pages of the Vocabulary, to set them right. No indicative S. or P. or E. is to be met with at the side of any words in the Vocabulary, to enable the leisure and lax attention of the Gentoo proficient to satisfy his curiosity, whether the word be Sanskrit, Persian or English; whether it be an adoption or a derivation. On this head I have said something in my former Preface, in the two second paragrahs of the fourteenth page. I could not find room

for these initials and at the same time place the Substantive word in a prominent situation, so as easily to be discerned from the explanations of it which immediately followed. I conceived of the two points, the latter to be the most material; and the initial letters were discarded.

Many words are of Persian or other derivation and adoption, greatly corrupted in the mode of speaking and writing them in the Gentoos, which, perfectly unimportant when referred to their original rank in any particular foreign Language, are essentially requisite to be introduced and highly proper to be known in their Gentoo form. They are used in all writings, and in all Revenue transactions, as explanatory of particular branches of the Revenue, or as phrases of a polite or political signification. Some might also be referred to in this respect, as adopted from our own Language, though these have not, until of late years, been so generally brought into use. They are now, however, coming into daily practice; and there cannot be a doubt, as our Indian Empire extends itself or as it increases in importance and stability, and as our policy may lead us to encourage the measure, these adoptions from our own Language will daily become more prevalent and more habitual. In this latter branch (I mean, the selection of words from the English) the Vocabulary will be found rather sparing; because, having in contemplation the framing of a counterpart work, to be a *Vocabulary* of *English* into *Gentoos*, it necessarily must compel me to introduce in that work a very great variety of words of this description, from the impossibility of finding Native Gentoo words to express an adequate and corresponding meaning.

In regard to quantity, I freely admit, that the aim of the Vocabulary never imagined more than such a selection of words, as would contribute readily to assist the assiduity of the student in acquiring a competent knowledge of the Language. It was never meant to be so entire a collection as the strict rules of a Dictionary may demand; in which there ought perhaps not to be a single word omitted, of which the Language is susceptible. I lament that time, no less than the original plan of the work, did not permit me to do more. I lament that it should have compelled me to discard many very useful and highly important words of the language, both in science and in the arts and manufactures, as well as in the Commercial branches of the Hindoo people which, though principally drawn from foreign sources, are adoptions which have now become the ingrafted and legitimate terms and acceptations of the Gentoo Language. I am not, however without some resource in this dilemma, if I can within any reasonable period after the present publication, contrive to bring forward the Volume in contemplation of English into Gentoos. It is obvious, that in all those specific omissions to which I now advert, the Native Translation of every useful and every refined term, and every familiar phrase and expression in the English, may have its denoted meaning annexed to it in that work. By this means, the defect of brevity and the lack of expressive and significant terms, if observable in the present work, will be remedied in the most effectual and most satisfactory manner.

With a view to qualify the nature of that brevity which has been noticed as a defect in this Volume, it may be proper to develop so much of the plan as relates

to this subject. Under any particular word such as I distinguish as a *primary* word, others will frequently be introduced as *collateral* words, which will afterwards be wholly omitted in any other place. For example, under the primary word గంధం *Gundhum*, understood for a pleasant smell, will be found దుర్గంధం *Doorgundhum*, bad smell. Now the word దుర్గంధం being here introduced in a compound sense, will probably not be found in any place of the Vocabulary as a primary word. In this manner, a great variety of words will be found in the body of the work, which should be searched for according to the rule now pointed out; and perhaps, the brevity apparent on a first sight, will be found, on a closer inspection, to possess a very ample and effectual corrective.

It may also be remarked, that there is a vast number of words and technical terms, though perhaps not introduced as primary or leading words, which are to be found scattered over the Vocabulary, in the variety of examples introduced to shew the way in which any principal or primary word should be used. The great assistance which these examples will afford, to those who may be doubtful of the application of any particular word, will induce a perpetual reference to them; and by that reference new words will occasionally develop themselves and become casually known, which may perhaps not have found their rank in the general scale of principal words. Since the Gentoo literature is so deficient, that scarce any approved author can be named from whom to draw any appropriate quotation, and in the modern state of the Language not a single one, it has followed as a necessary expedient to introduce sentences on matters most familiar in common

life. There is an advantage to be derived from this alternative, I think, much superior in a work of the nature here professed; which does not pretend to a vain and fallacious attempt to teach the Language as a study, with a view to understand the writings in poetry or history. This I apprehend, would become rather an unavailable research and an idle attempt; for, with every assiduity and talent devoted to the object, will any one seriously tell me, that the result would repay his labour or justify the inconvenience of mis-spent time! But, to instruct the scholar in the current acceptation of the Language, in all it's decisive and peculiar changes, both as the *Caapoo* and the *Dhorra* speaks it at this day, that is to say, both the *Vulgar* and the *Polished* uses of it amongst the moderns; these are the great and justifiable advantages to be anticipated from a work of the nature now offered to the service.

It occurs to me to mention in this place, that in whatever local information of Castes, of the manners and habits of the native Gentoos, of the religious ceremonies of the Hindoos, in short of all such casual information as the opportunity of introducing the subject has given rise to, the particulars have been collected from the best and most authentic authorities in my power to obtain; they are also recorded in the fairest and most unbiassed colours in my power to describe. Though nothing very elaborate has been offered on these topics, there is something of interest attached to it; and, as opinion will frequently waver on abstruse enquiries, and the reader may feel a doubt in fixing his judgment, I have thought it might be satisfactory under such an impression, to give him a solemn assurance, that the information displayed in this work on matters of this nature,

was not the casual production of indifferent communication, gathered without further pains, and meant merely to fill the space intended for it. On the contrary, every article of this description has been carefully examined, stands corroborated by the most impartial testimony of its truth and propriety, and will bear the test of the strictest scrutiny.

In the arrangement of the Initial Letters under which the words of the Vocabulary are classed, I have chosen the order of the Gentoo Alphabet, as most suitable to the genius of the work. Very few of the Letters have been rejected, as the native Alphabet stands displayed in the Grammar which has preceded the Vocabulary. The Letters preserved for the purposes, are as follows; అ ఆ క ఖ గ ఘ చ జ ఝ ట ఠ డ త థ ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ క్ష making altogether thirty in number; which excludes the number of Six Letters, inserted in the Alphabet, incapable of being made leading letters at the head of any of the columns. I lament being compelled in this place to mention, that with all the precaution and care possible, there has been no attainable mode devised that could overcome the defective type with which many of the Letters have been impressed. Those letters in particular which require the *attachment* or *detachment* of the symbolic Vowel, to render their signification noted and understood, are miserably imperfect. It is proper therefore to guard the Student against a too hasty perusal of the words, in which the following letters are comprised; Viz. న స ప వ ష హ *na*; *sa*; *pa*; *va*; *sha*; *ha*.

The distinction in these letters has already been sufficiently adverted to in the Grammar, even as it regards

words in which they occur in their perfect state; when, in the unfortunate predicament which they labour under from a defective type, they assume a false appearance in the manner of applying the distinguishing mark of the Vowel, it would be unpardonable not to draw the attention of the Reader to the circumstance. After the eye is become habituated to the letter, however, the distinction will by degrees be conceived without difficulty; and, after all, we cannot be altogether unmindful of the peculiar cast of the Language itself, which, in the manner of writing it and particularly in the broken and current hand rejects almost entirely the symbolical marks of the Vowels. It is indeed to be lamented, that for the express purpose of shewing the different modes of writing and of explaining more minutely this peculiarity of the Language, we are totally destitute of types to produce the examples, in the manner of most philological works. In progression of time and as attention to the subject becomes more earnest and more warmly applied, this defect may probably be supplied. For there cannot be a doubt of it's use, fully as much as the display made in the different Characters of the Niskhi, the Talik, and the Shekest of the Persian writing.

There is but one remaining observation to make, but it is one of peculiar Interest, and with that, I leave the Reader in possession of the Volume, as it is now offered for his inspection. This communication regards the sound of some of the letters, which cannot in any other way be taught, than by some such method as has been here adopted.

The letters so formed are the చ the జ and the ఱ the two former of which admit of two changes in their sound,

and the latter of three. These various distinctions, with a view to perspicuity, have been placed in a separate Index below, and will admit of an easy reference from the Vocabulary.

By observing, for example, in the Vocabulary the word చల్లడం to *sprinkle*, having the initial *b* over it; I refer to the Index below and I observe the చ to be pronounced *tsa*; consequently the word చల్లడం will sound *tsalladum*. On the contrary; if I turn to the word చరపడం to *spoil* or *corrupt*, I find the చ has an initial *a* placed over it, which on reference to the Index is made to sound *cha*. The word must therefore be sounded *charrapadum*. It is needless to remark, that to pronounce either of these words differently, that is to say, to pronounce the one *tsarrapadum* and the other *challadum*, would be as ridiculous, as if we were in English to call it *sheese*, instead of *cheese*; or *shop*, instead, of *chop*. The same importance in the sound is attached to the two other letters వ and జ as particularly pointed out in regard to all of them in the Grammar.

# INDEX OF TELUGU LETTERS CHANGEABLE IN THEIR PRONUNCIATION.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | sounds | *cha* | - in | చక్రం | *chackrum*, a wheel. |
| చ | sounds | *tsa* | - in | చన్ను | *tsannoo*, the breast. |
| జ | sounds | *dja* | - in | జవాది | *djavaady*, civet. |
| జ | sounds | *za* | - in | జబ్బ | *zabba*, the arm. |
| వ | sounds | *va* | - in | వయస్సు | *vyassoo*, age. |
| వ | sounds | *wa* | - in | వత్తి | *wattee*, a wick. |
| వు | sounds | *oo* | - in | వుండడం | *oondadum*, to be. |

*William Brown.*

అక్క *sub.* అక్క|అక్కలు. Elder Sister. vide అప్ప.

అక్కట *int.* Alas! It is also expressed by అయ్యో!

అక్కడ *adv.* There. అక్కడచూడు Look *there.* అక్కడినుంచి From *there* or *thence.* అక్కడినుంచి వచ్చినాను I came from *thence.* When అక్కడ is joined to a word terminating in *ee*, it is written అక్కడి such as అక్కడి గుడి The Pagoda of *that place.* అచ్చోటు; అవల.

అక్కర *sub.* అక్కర|అక్కరలు. Need; necessity; want; occasion. అక్కరలేదు No *need;* no *occasion.* It is generally used in the same sense, as *by no means.* నాకు అక్కరలేదు I *by no means* want it. vide అగత్యం. అపేక్ష; ప్రయోజనము.

అగత్యం *sub.* అగత్యపు|అగత్యాలు. Necessity; need; want. యీ వస్తువులతో నాకు అగత్యంలేదు I have no *need* of these things. vide నిమిత్తం. ఆవశ్యం.

అగత్యమైన *adv.* Necessary; needful. యిది అందరికీ చాలా అగత్యమైన పని This is a very *useful* business for every body.

అగపడడం *v.n.* అగపడుతూ|అగపడి. To observe; to appear; to seem. అతనికి అక్కడ అగపడ్డారు కారు He did not *discover* them there; that is, they did not appear to him there. అతను చెప్పిన మాటలలో అలాగున అగపడలేదు It did not *appear* so from what he said. కనపడడం Item.

అగపరచడం *v. a.* అగపరుస్తూ|అగపరిచి. To make appear; to disclose; to develop. ఆలెక్క అతనికి అగపరిచినాను I made the particulars of that account *appear* to him. యిప్పుడు నీకు చెప్పినమాట యెవరికీ అగపరచవద్దు You must not *disclose* to any one, what I have now told you.

అగ్గి *sub.* అగ్గి|అగ్గులు. Fire. vide నిప్పు. అగ్ని.

అగ్నిహోత్రం *sub.* అగ్నిహోత్రపు|అగ్నిహోత్రాలు. Fire. vide అగ్గి.

అచ్చ *adj.* Pure; clear; unadulterated. అచ్చ వెండి *Pure* silver. అచ్చ బియ్యం *Unmixed* rice. అచ్చ తెనుగు *Pure* Telugu.

అచ్చు *sub.* అచ్చు|అచ్చులు. A stamp; a mark; impression. అక్షరాల

అచ్చు An *impression* of letters. బెల్లపుఅచ్చు These are thick pieces of clammy sugar, or jaggery (as it is termed in India) with Images stamped upon them, like the Gingerbread cakes in England. ముద్ర: శుద్ధము: *v.* దండగను యిచ్చు.

అర్జి *sub.* అర్జి।అర్జిలు. A Petition; usually termed *Arzee.* అర్జుదాఖ్హు Item.

అటకాయించడం *v.a.* అటకాయిస్తూ।అటకాయించి. To hinder; to stop.

అటకావు *sub.* అటకావు।అటకావులు. Hindrance; prevention; stop. అటకావుచెయ్యడం. To *hinder* or *prevent.* మనుష్యులను ఆ తోటకు వెళ్ళకుండా అటకావుచేస్తాడు He *prevents* people from going into that garden.

అట్లా *adv.* So; thus. అట్లాగు Item. అట్లాచెయ్యి Do *so.* అట్లా చెప్పండి Speak in *that manner.*

అటు *adv.* That way; in that direction. అటుగా Item. అటువెళ్ళినాడు He went in *that direction.* అటువంటి *Such* a *one.* అటువంటిమనిషి *such* a *sort* of person. The word అప్పువంటి is frequently used in the same sense. అటుతరువాత *After that; then; since* then.

అడకత్తు *sub.* అడకత్తు।అడకత్తులు. The name given to an instrument used for breaking the betel nut, something in the shape of nut-crackers, with two sharp edges near the joint.

అడగడం *v. a.* అడుగుతూ।అడిగి. To ask; to require; to demand. నిన్ను యేమైనా అడిగినాడా? Did he *ask* you for any thing? అక్కడికివెళ్ళి అడుగు You may go there and *ask.* నా బాకీ నిమిత్తం అడిగినాను I *demanded* the payment of my balance.

అడ్డగించడం *v. a.* అడ్డగిస్తూ।అడ్డగించి. To oppose; to cause hindrance. అడ్డగించుకోవడం Item.

అడ్డబాస *sub.* అడ్డబాస।అడ్డబాసలు. A *Trinket* worn by Hindu women between the nostrils. vide బులాకి.

అడ్డం *sub.* అడ్డం।అడ్డాలు. An obstacle; or any thing opposed to you. అడ్డంరావడం To *oppose; to front.* అడ్డంపడడం or వుండడం To

be *opposed.* అతను నామాటకు అడ్డం వచ్చినాడు He came and *took up* my words. నేను వెళ్లుతూ వుండగా దారిలోకి అడ్డంవచ్చి నన్ను కొట్టినారు As I was going along, they *came up to* me and beat me. అక్కడికి వెళ్ళడానకు గోడ అడ్డం వున్నది To go to that place, a wall *is in my way.*

అడ్డి *sub.* అడ్డి । అడ్డిలు. A deposit. vide అరువు.

అడివి *sub.* అడివి । అడవులు. Wild, uncultivated country, covered with bushes, commonly called *jungle.* అడివిలో నుంచి మహాచెడ్డ పెద్దపులి వచ్చినది A mischievous royal tiger has come out of the *jungle.* అడివి పంది A wild hog. అడివి దేశం A *wild* or *jungly* country.

అడుక్కోవడం *v. a.* అడుక్కుంటూ। అడుక్కుని. To beg; to supplicate. యీ బిచ్చపువాళ్ళు శానా అడుక్కుంటున్నారు These beggars are very persevering in *begging.*

అడుగు *sub.* అడుగు। అడుగులు. A foot measure. ఆ యేనుగ పది అడుగుల పొడుగు వున్నది That elephant is ten *feet* high. This word also means the *bottom* or *under part* of any thing. బల్ల అడుగు The *bottom* of a table: that is, *below* or *under* a table. పాలకీ అడుగున ఒక పామును చూచినాను I saw a snake *under* the palanquin.

అణగడం *v. n.* అణుగుతూ। అణిగి. To be pressed down; to subside. బట్టలు పెట్టెలో అణగడం Clothes to be *pressed* down in a trunk. అతని కోపం అణిగినది His anger has *subsided.*

అణచడం *v. a.* అణుస్తూ। అణిచి. To press or cause to subside.

అణుకువ *sub.* అణుకువ। అణుకువలు. Humbleness; humility. ఆ మనిషి అణుకువ That man's humility.

అతకడం *v. a.* అతుకుతూ। అతికి. To join; to paste; to glue.

అతడు *pro.* అతడి । వారు. He. vide అతను.

అతను *pro.* అతని । వారు. He. అతను వచ్చినాడు *He* came. అతనికి యిప్పించు Give it to *that man.*

అత్త *sub.* అత్త। అత్తలు. Mother-in-law. అత్తవారి యిల్లు The *mother-*

*in-law's* house. This is the house to which a woman can go, and to no other, after marriage to remain any time. The privilege is therefore very frequently indulged in.

అత్తరు *sub.* అత్తరు। అత్తర్లు. Essence, better known by the name of *Uttar* in India. It is generally produced from roses, and other flowers, from sandal-wood, or from strong herbs. గులాబీ అత్తరు *Uttar* of roses. చందన్ అత్తరు *Uttar* of sandal.

అతి *adv.* Very; exceedingly. అతి విస్తారం *very much.* అతి జాగ్రత *exceedingly* careful. అతి త్వరగా *as* quick *as possible.* అతి తీపి *exceedingly* sweet. So, for many other words అతి favours a sort of comparative degree, to give an increased power to the word to which it is attached, in the same way as *much* is used to express an increased excellence in some words in the English.

అతుకు *sub.* అతుకు। అతుకులు. A joint; also, any repair or piece put in. బల్ల అతుకు The *joint* of a table. ఆ తప్పేలాకు శానా అతుకులు వున్నవి That brass pot is full of *patches.* అతుకు పెట్టడం or అతికించడం to *repair*; to *patch*; to *join.* This word is only applicable to wood, or to metals.

అర్థం *sub.* అర్థపు। అర్థాలు. Meaning; explanation. అర్థం Ready money. ఆ మాటకు అర్థం చెప్పండి Tell me the *meaning* of that word. ఖజానాలో అర్థం యేమాలేదు There is no *ready money* in the treasury. అర్థవంతుడు A *moneyed* man.

అద్దడం *v. a.* అద్దుతూ। అద్ది. To dye; to colour; to stain. నా పాగాకు కుసుంబారంగు అద్దినాడు He has *dyed* my turban of the coosumba colour, that is, red. అద్దించడం To cause *to dye.*

అద్దం *sub.* అద్దపు। అద్దాలు. A looking glass. అద్దం కళాయి పోయినందున కళాయిచేశేవాడికి బాగుచెయ్యమని యిచ్చినాను The quick silver having come off the *Looking Glass*, I have sent it to the maker to repair. It means any glass through which you see, or such as light appears through, as in a lantern.

అదరడం *v. a.* అదురుతూ। అదిరి. To start; to shake. ఫిరంగి ధ్వనిచాతను గోడ అదిరినది The report of the gun made the wall *shake*. నేను పిడుగుధ్వనిచాతను అదిరిపడ్డాను The noise of the thunderbolt made me *start* and tumble down. Some write it అదురడం.

అదృష్టం *sub.* అదృష్టపు। అదృష్టాలు. Lot; fortune. నా అదృష్టం ఆలాగున వున్నది Such is my *lot*. అతనిది యెప్పటికీ మంచి అదృష్టం *Good fortune* always attends him. దురదృష్టం *Bad fortune*, also, *misfortune*. అదృష్టవంతుడు A *fortunate* man. దురదృష్టవంతుడు An *unfortunate* man.

అది *pro.* That. అది means also, *that is*. అవి *those*. అది మంచిదికాదు *That* is not proper. అవి బాగా వున్నవి *Those* are good things.

అద్దె *sub.* అద్దె। అద్దెలు. Renting or letting; also, hire. అద్దెయిల్లు A *rented* house. అద్దెకు యివ్వడం To *let* to any body. అద్దెకు పుచ్చుకోవడం To *take lodgings*. యెద్దు అద్దె Bullock *hire*.

అర్ధ *sub.* అర్ధ। అర్ధలు. The half. అర్ధరూపాయి *Half* a rupee. అర్ధసేరు *Half* a seer. రెండు అర్ధలు వకటి Two *halves* make one whole. This word is used only to articles of consumption, that admit of measurement, such as money or grain.

అధికం *sub.* అధికపు। అధికాలు. Superabundance; more than sufficient. యిదివరకు నాకు వున్న సొమ్ము చాలును, యిక అధికం అక్కర లేదు The money that I have got at present is quite sufficient, I wish for no *superfluity*.

అధికారం *sub.* అధికారపు। అధికారాలు. Government; authority. చీఫుల, కౌంసలేర్ల వారి అధికారపు దినములలో నేను యీ వూళ్లో లేను I was not in this town during the *authority* of the chiefs and councils. అధికారి or అధికారస్థుడు The person invested with the *authority* and *power*.

అధైర్యం *sub.* అధైర్యపు। అధైర్యాలు. Cowardice; want of spirit.

అన్న *sub.* అన్న। అన్నలు. An elder brother. అన్నకుమారుడు A brother's son: a nephew.

అనడం *v. a.* అంటూ। అని. To speak; to say; to mention. This

verb is the most generally used of any in the language, but particularly the participle past, viz. అని *said*, and అంట from అంటారు rather is the manner of phraseology than for any particular necessity; or, it may be supposed to stand for—"*it is said;*" "*it is supposed;*" "*they say.*" వచ్చినాడని *'t's said*, he is come. వెళ్ళినాడని *they say*, he went. చెప్పినామని *having so* said. యిక్కడికి వచ్చినానని తెలిసి నా మీద కోపం చేసినాడు *having heard say* I had come here, he was angry with me. నీవు అన్న మాటలు బొత్తిగా అబద్ధం The words *spoken* by you, are all of them falsehoods. వచ్చినారట They say, they are come.

అన్నం *sub.* అన్నపు| అన్నాలు. This word properly means *rice* or any other *grain*, boiled and prepared for eating, such being the principal part of an Indian's meal. Hence the word అన్నం has acquired the name of *victuals*, in which sense it is generally understood. అన్నం తిన్నావా? Have you eaten your *victuals*? అన్నం యింకా వుడకలేదు The *rice* is not yet boiled. అన్నవస్త్రాలు *Victuals* and *clothes.* అన్నం వండడం To boil *rice* or dress *victuals.* అన్నం పెట్టడం To give *victuals* or to *support*. N. B. This word is frequently called వణ్ణం.

అనాసపండు *sub.* అనాసపంటి | అనాసపండ్లు. The pine-apple.

అన్ని *adj.* All (applied to things). అన్ని వస్తువులు *All* the things. అన్ని పుస్తకాలు *All* the books. అన్నివిధాల By *all means*; in *all* respects.

అనుకూలం *sub.* అనుకూలపు| అనుకూలాలు. Agreement; consent; convenience. నీకు అనుకూలం అయితే వస్తాను If you give your *consent*, I will come. అతనికి నాకూ యేమీ అనుకూలం లేదు There is no *agreement* whatever between him and me.

అనుకూలించడం *v. a.* అనుకూలిస్తా | అనుకూలించి. To be agreed; to consent.

అనుకోవడం *v. n.* అనుకుంటూ।అనుకుని. To reflect; to report upon, or represent. యీమాటలు బజారులో అనుకుంటూవున్నారు These accounts are *reported* in the bazaar. నేను అట్లాగు అనుకున్నాను It was in that way I *considered* it.

అనుగ్రహం *sub.* అనుగ్రహపు।అనుగ్రహాలు. Favour; kindness. vide దయ.

అనుభవం *sub.* అనుభవపు।అనుభవాలు. Enjoyment; fruition.

అనుభవించడం *v. a.* అనుభవిస్తూ।అనుభవించి. To enjoy; to reap the fruits of any thing. ఆ దొరసొమ్ము చాలా అనుభవించినాను I have *enjoyed* a great deal of that gentleman's money. కష్టం అనుభవించడం To *suffer* distress. సుఖం అనుభవించడం To *enjoy* comfort.

అనుమానం *sub.* అనుమానపు।అనుమానాలు. Suspicion. యీపని చేసినాడని అతనిమీద అనుమానపడ్డాను My *suspicion* fell upon that man, that he had done this business. అనుమానపడడం To *suspect*, with మీద added to it. సందేహం.

అనేక *adj.* Many; plenty. This word is a Sanskrit compound of *not* and *one* and is variously applied. అనేకమంది A *great number* of people. అనేకపశువులు తోటలోకి వచ్చినవి A *great number* of cattle have come into the garden. అతను అనేక విధాల చెప్పినాడు He spoke in *all manner* of ways.

అంకుశం *sub.* అంకుశపు।అంకుశాలు. The instrument used by elephant drivers to guide with. It is formed like a short harpoon, about two feet long, held by the driver, who sits across the elephant's neck, with the point of it downward on the head of the animal. It has a hook placed near the point, by which the ears of the beast are pulled back, to make him stop or to keep him steady.

అంకె *sub.* అంకె।అంకెలు. A figure in reckoning. అంకెలు వెయ్యడం To write *figures*. అంకెలు గుణించడం To multiply *figures*. అంకెలు కూడడం To cast up *figures*. అంకెలు భాగారించడం To abstract *figures*. అంకెలు పాలుపుచ్చడం To divide *figures*.

అంకెం *sub.* అంకెపు|అంకెలు. A stirrup. పల్లానికి అంకెంలు లేనందున రెండుమూడు రోజాలనుంచి గుర్రాన్ని సవారి కాలేదు I have not been on horseback for two or three days, my saddle being without *stirrups.* N. B. This word also means the half of a bullock load, that is, what is on one side. ఆ గోనెలో వక అంకెపుధాన్యం నీవు పుచ్చుకొని వక అంకెపుధాన్యం నాకియ్యి Take *one half of the bullock load* for yourself and give me the *other half* of that grain. అంకెవన్నెదు; అంకవన్నె.

అంగరకా *sub.* అంగరకా|అంగరకాలు. A name given to the sort of vesture worn by the Indians, something in the shape of jackets with long skirts, tied to the body with strings in front, at the neck and below the breast. చొక్కాయి.

అంగిలి *sub.* అంగిటి|అంగిళ్ళు. The palate. అంగిట్లో వెయ్యడం To *gulp down,* in the manner physic is generally swallowed. Perhaps this word means the top of the throat, or what is technically called the *uvula.* లోకుత్తుక.

అంగి *sub.* అంగి|అంగీలు. The long gown generally worn by dubashes, or natives at Madras, but very seldom to be seen amongst the Telugus to the northward.

అంగుళం *sub.* అంగుళపు|అంగుళాలు. An inch; also a finger. ఆ కర్ర ముప్పై అంగుళాల పొడుగువున్నది That piece of wood is thirty *inches* long. నా అంగుళాలమీదను వుంగరాలులేవు There are no rings upon my *fingers.* ఆఱుయవబీజముల ప్రమాణము.

అంగూరుచెట్టు *sub.* అంగూరుచెట్టు|అంగూరుచెట్లు. The Vine: the plant that bears grapes. అంగూరుపండ్లు Grapes. అంగూరు తీగె The tendrils of the *vine.* అంగూరు ఆకు The *vine* leaf. హైదరాబాదునుంచి మంచి గొప్ప అంగూరుపండ్లు బజారిలోకి వచ్చినవి Some very fine large *grapes* have come into the bazaar from Hyderabad.

అంచనా *sub.* అంచనా|అంచనాలు. An estimate; an appraisement, (called *anchana* in Telugu) is adopted from the Persian

అంచనాదారుడు an *Anchanadar*. అంచనా లెక్కలు The *anchana* accounts. N. B. *Anchanadars* are persons employed in revenue to estimate the quantity of a field of grain, about the time when it is nearly fit for cutting, on which estimate the amount of the revenue is frequently calculated. అంచనా చూడడం To *form* an *appraisement*. మతింపు.

అంచు *sub.* అంచు।అంచులు. A border; an edge; a fringe. బట్టఅంచు The *border* of a cloth. బల్లఅంచు The *edge* of a table. అంచు వెయ్యడం To make or place a *border*. పచ్చఅంచు A green *border*. N. B. పచ్చ also means yellow. కొర; తుద.

అంచె *sub.* అంచె।అంచెలు. A relay. అంచెవుంచడం To *relay* or *post*. యిక్కడనుంచి చెన్నపట్నం వెళ్ళడానకు అక్కడక్కడ మజిలీలలో అంచెలు వుంచినాడు He has posted palanquin boys at the different *stages*, to go from hence to Madras. అంచియ.

అంటడం *v. a.* అంటుతూ।అంటి. To touch; to anoint. తల అంటడం To anoint the head. యెవరిని అయినా అంటడం To touch any person. తాకడం; ముట్టడం.

అంటించడం *v. a.* అంటిస్తూ।అంటించి. To paste; To glue, that is, to join papers. ఆ పుస్తకంలో కాకితాలు అంటించినాడు He has *pasted* the papers in that book. కట్టడం; తగిలించడం.

అండ *sub.* అండ।అండలు. Protection. గోడ అండ A *prop* to a wall. vide ప్రాపకం. దాపు; ఆశ్రయము; ఆసర.

అంత *adv.* So far; so much. మీరు అంతమట్టుకు వ్రాయవలెను You must write *so far*, that is, all to a *certain limit*. నేను అంత దూరం వెళ్ళను I will not go *all that distance*. అంతపరియంతం In the *meantime*. అంతపరియంతం యిక్కడవుండు *In the meantime*, you stay here. అంతపరియంతం వెళ్ళు Go, *as far as* that. అంతమాత్రం So *much* only. అంతలో *Meantime*.

అంతట *adv.* There upon; meantime; every where. మేము మాట్లాడుతూవుండగా అంతట అతను వచ్చినాడు Whilst we were speaking, *meantime* in he came. అతన్ని చెడ్డమాటలు ఆడి

అంతట వచ్చి కొట్టినారు They were abusing him and *there upon* came and beat him. యీ సంగతి అంతటా చెప్పుకుంటూ వున్నారు This circumstance is spoken of *every where*. N. B. In this sense, it may be written అంతటా. అనంతరము.

అంతటనుంచి *adv*. From that time or thence forward. అంతట నుంచి అతనితో మాట్లాడడం చాలించినాను From *thence forward* I forbore to have any talk (intercourse) with him.

అంతస్తు *sub*. అంతస్తు।అంతస్తులు. A story, or A storey; division of a house. కింది అంతస్తు The lower *storey*. మీది అంతస్తు The upper *storey*. ఆ యింటికి మూడునాలుగు అంతస్తులు వున్నవి That house has three or four *storeys* or stories. తారతమ్యము.

అంతఃపురం *sub*. అంతఃపురపు।అంతఃపురాలు. The inner apartments, that is those occupied by the women. రాణులుండేతావు.

అంతా *adv*. All; the whole; entirely. ఆ మనుష్యులంతా వచ్చినారు The *whole* of the people have come.

అందడం *v. n*. అందుతూ।అంది. To reach; to stretch; to extend; to hold out. చెట్టుమీదినుంచి బట్ట తియ్యడానకు చెయ్యి అందినది The hand was *stretched* out to take down a cloth from the tree.

అందం *sub*. అందపు।అందాలు. Beauty; comeliness. ఆ ఆడదాని అందం మహా బాగావున్నదని విన్నాను I have heard that woman's *beauty* greatly celebrated. అందపు చెక్కిళ్ళు *beautiful* cheeks.

అందమైన *adj*. Handsome; beautiful. ఆ గుర్రం మహా అందమైనది అని నాకు తోచినది I conceive that to be a most *beautiful* horse.

అందరు *sub*. అందరి (No plural). The whole; totality; every person included; it applies only to people. అందరికీ యిప్పించు Give it to *the whole* of them. అందరిని పిలిపించు Call *the whole* or *All* of them.

అందాకా *adv*. Until then; so far. అందాకా వెళ్ళు Go *so far*. నేను మళ్ళీ వస్తాను; అందాకా యిక్కడవుండు I shall return again; *until then*, stay here. అందనుకా Item. అంతమట్టుకు.

అందు *adv*. Inside; within; also figuratively understood for

కాదు *adv.* Not; no. అది నావల్ల కాదు I cannot do it. అవునా, కాదా? Yes or no?

కాని *adv.* Although; but; however. అతనితో యీమాటలుమాత్రమే చెప్పినాను కాని మరి వేరుమాటలు చెప్పలేదు I *only* spoke to him these words, and *no more.* నేను పోక కాని అది జరగదు *Unless* I go it cannot be done. కాని Also means a *valuation* of moneys, four of which go to an anna. ముక్కాని Three *kanees* or *three quarters* of an anna. This word also means *bad, base, worthless.*

కాంతి *sub.* కాంతి। కాంతులు. Brightness; brilliancy. కాంతిగల *bright; brilliant.* యీ వజ్రం మహా కాంతి కలిగివున్నది This diamond possesses uncommon *brilliancy.* యితని ముఖం మహా కాంతి కలిగివున్నది This person has got a very *clear* countenance. కాంతి కలగడం or కలిగి వుండడం To possess *brilliancy.*

కాపు *sub.* కాపు। కాపులు. A village man or cultivator. In another sense, a justification and also a watching. అతణ్ని చేనివద్ద కాపు వుంచినాను I have employed him *to watch* the crop. అతనికి మేము కాపుచేసినాము I have *afforded* him my *protection.* నీ కాపుయేమో నీవే విచారించుకోవలసినది It is your business to consider of your own *justification.* కాపాడడం To *watch*; to *take care.* కాపు వుండడం Item. పెద్దకాపు A *head inhabitant* or *cultivator.* కాపు కరణాలు The *inhabitants* and curnums. N. B. This word is also applied to the meaning of *heat* and *fruitfullness.* ఆ పాలుకాపు తక్కువ అయినది That milk is not sufficiently *warm.* యీ సంవత్సరం మా మిడితోటలు కాపు కలదా? Have the mango gardens *produced sufficiently* this year.

కాపురం *sub.* కాపురం। కాపురాలు. Residence. కాపురస్థలం Place of *residence.* నివాసం: సంసారం.

కాబట్టి *adv.* Therefore; consequently. కాబట్టి అలాగుచేయ

*Therefore* act in that manner. యీవేళ వర్షం వచ్చినది కాబట్టి రేపటిదినం బాగా వుండవచ్చును There has been rain to day, *consequently* to-morrow my be a fine day.

కాబోలును *adv.* Perhaps; probably. ఆరాజా అక్కడికి వచ్చినాడు కాబోలును That Rajah *probably* has arrived there. అతను ఆలాగు చేసినాడు కాబోలును *Perhaps* he might have done so.

కాం *adj.* A revenue term implying *private* or *own*. కాం లెక్క Private accounts, which are generally kept by curnums of villages, in *private*, besides the set of accounts usually referred to in public.

కాయ *sub.* కాయ। కాయలు. A nut; any fruit or vegetable in an unripe state. కొబ్బరికాయ The *coconut*. యీ చెట్టున అన్ని కాయలేకాని పండ్లులేవు This tree has produced *fruit*, but has not yet got ripe fruit. తలకాయ The head. కూరకాయలు *Vegetables*. This is applied only to such vegetables as produce a head like fruit. Figuratively చంప కాయ A slap of the face. మొట్టికాయ A knock on the head with the fist. This word is used in many senses, as a possessive couplative. పిల్లకాయ A boy.

కాయకం *sub.* కాయకపు। కాయకములు. Profession; business. నా కులం కాయకం యేమంటే కలంకారీపని My *profession* is to make up painted goods.

కాయడం *v. a.* కాస్తూ। కాచి. To warm; to heat. vide కాచడం.

కాయం *sub.* కాయం। కాయములు. This word is taken from the Persian and means a *fixed residence* or *appointed place*. కాయం చెయ్యడం To *confirm*; to *establish*; to *constitute*.

కారడం *v. n.* కారుతూ। కారి. To flow; to run out. గాయంలోనుంచి రక్తం కారుతూవున్నది The blood is *flowing* from the wound. కూజాకు చిల్లిపడి నీళ్ళు కారుతూవున్నవి The juglet has got a crack and the water is *running from* it.

కారణం *sub.* కారణపు। కారణములు. Cause; reason; purpose. మీరు

యే కారణంచాత యిక్కడికి వచ్చినారు? What is the *reason* of your coming here? యీ కుట్రలకు యితనే కారణం He is the *cause* of these intrigues.

కార్యం *sub.* కార్యపు|కార్యములు. Purport; business. నా కార్యం యింకా అయినదికాదు My *business* is not yet accomplished. మీరు వచ్చిన కార్యం యేమి? Tell me the *purport* of your coming.

కారు *sub.* కారు|కారులు. Pincers; tongs. కంసాలికి నిప్పులోనుంచి మూస తియ్యడానకు కారువున్నది The silver-smith has his *tongs* to take the crucible off the fire.

కారుడ్యం *sub.* కారుడ్యపు|కారుడ్యాలు. Ridicule; facetiousness. కారుడ్యం ఆడడం To ridicule; laugh at or play upon.

కారు యింగువ *sub.* కారు యింగువ. (No plural.) Asafoetida.

కాల్చడం *v. a.* కాలుస్తూ|కాల్చి. To burn. ఫితూరీకోర్లు యిండ్లు కాల్చినారు The plunderers have *set fire to* the houses.

కాలడం *v. n.* కాలుతూ|కాలి. To burn; to be on fire. యిండ్లు కాలుతూవున్నవి The houses are *burning*.

కాలం *sub.* కాలపు|కాలాలు or కాలములు. Season; time of the year. వర్షా కాలం Rainy *season*. యెండా కాలం Hot *season*.

కాలు *sub.* కాలి|కాళ్లు. A leg; a claw. పిట్ట కాలు A bird's *claw* or *foot*. కాళ్లు నొత్తడం To *shampoo*: an Eastern custom of pressing the limbs with the hands to revive the circulation of the blood. మీకాలు The *upper part* of the foot.

కాలువ *sub.* కాలువ|కాలువలు. A water channel; a canal.

కావడం *v. n.* అవుతూ|అయి. To accomplish; to fulfil; to finish; to be; to be done. ఆపని కావడానకు చాలాదినములు పట్టుతున్నవి It has take up a great many days before that business can be *finished*. కావచ్చును It may be *accomplished*. ఆపని అయినది. That business is *done*. యీ పని అయినతరవాత తిరిగి వస్తాను I will come again, after this business is *done*.

కావలసివుండడం *v. a.* కావలసివుంటూ|కావలసివుండి. To want; to

require. vide కావలియుడం.

కావలి *sub.* కావలి|కావళ్ళు. A watch; a protection. vide కాపు.

కావలియుడం *v. a.* కావలుస్తూ|కావలిసి. To want; to require. నీకు యెంత కావలుస్తుంది? How much do you *want?*

కావిడి *sub.* కావిడి|కావిళ్ళు. A *cowedy.* A light flat stick placed on the shoulders of coolies, with ropes hanging from each end, in which baggage is carried. కూలివాండ్లు సామాను నిమిత్తం తమ కావిళ్లు తెచ్చినారు The coolies have brought their *cowedies* for the baggage.

కాష్ఠం *sub.* కాష్ఠపు|కాష్ఠములు. The Sanskrit name for wood: by the Telugus, is commonly applied to the wood used for burning dead bodies. ఆవూరి నాయడు పోయినాడు గనక అతణ్ని కాష్ఠంకట్టి తీసుకునిపోయినారు The head man of that village being dead, the *funeral pile* is prepared for him and they have taken him away.

కాస్త *adj.* A little; not much. కాస్త నిప్పియియ్య Give me a *little* fire. అక్కడ కాస్త పనివున్నది I have *a little* business there. This word is frequently called కూస్త.

కాసంత *adj.* A little. కూసంత Item. vide కాస్త.

కాసీవాడు *sub.* కాసీవాని|కాసీవాండ్లు. A stone-cutter; a brick-layer. The stone-cutter will often do both works; but the brick-layer cannot cut in stone. కాసీపని *Brick-layer's* or *stone-cutter's* work. This word ought properly to be written కాసెవాడు.

కాసు *sub.* కాసు|కాసులు. A cash; an imaginary coin, eight of which, according to Telugus reckoning, go to one dub.

## కి

కిటికి *sub.* కిటికి|కిటికీలు. A window.

కిటుకు *sub.* కిటుకు|కిటుకులు. An artifice. అతను చేసిన కిటుకు మీ తెలి

ఐడిలో వచ్చినదికాదు You have not obtained a proper knowledge of his *artifice.*

కిన్నెర *sub.* కిన్నెర|కిన్నెరలు. This is an instrument with cat-gut strings, played on with a bow, is of the dimensions of a dancing master's kit, but louder in its tone, from having a projecting belly to expand the sound. It is played upon by Moor people only.

కింద *adv.* Below; under. బల్ల కింద *Below* the table. నాకింద యితను వున్నాడు This man acts *under* me. కిందా మీదా *One over the other; tops* and *bottoms.* ఝెట్టీలు పట్లు పట్టుకుని కిందామీదా పడ్డారు The wrestlers having taken their grips tumbled down *one over the other.*

కిందట *adv.* Formerly. కిందట అతను యిక్కడినుంచి వూరికి వెళ్ళియుండెను He has gone away from hence *formerly* to another village.

కిఫాయతు *sub.* కిఫాయతు|కిఫాయతులు. Benefit; advantage: profit. యీ బేరంలో మనకు చాలా కిఫాయతు వచ్చినది I have got a very handsome *profit* in this bargain.

కిమ్మతు *sub.* కిమ్మతు|కిమ్మతులు. Price; valuation. ఆ గుర్రపు కిమ్మతు యెంత? What is the *price* of that horse?

కిరణం *sub.* కిరణపు|కిరణములు: కిరణాలు. Ray. సూర్య కిరణాలు The *rays* of the sun.

కిరీటం *sub.* కిరీటపు|కిరీటములు. A crown. రాజ కిరీటం The *crown* of a king.

కిస్తీ *sub.* కిస్తీ|కిస్తీలు. A revenue term called *kist* and means an instalment.

## కీ

కీడు *sub.* కీడు|కీళ్ళు. An evil; a misfortune. అతనికి చాలా కీడు సంభవించినది A great *misfortune* has befallen him.

కీర్తన *sub.* కీర్తన|కీర్తనలు. A song. దేవుడిమీద కీర్తన పాడుతూవున్నారు They are singing *a song* made upon the deity.

కీర్తి *sub.* కీర్తి|కీర్తులు. Renown; reputation. అతనికీర్తి ప్రపంచం అంతటా విస్తరించినది His *reputation* has spread over the whole world.

కీలు *sub.* కీలు|కీళ్ళు. A joint; pitch, commonly called *dammar* in India. చేతి కీళ్ళు The *joints* of the hand. కాలి కీళ్ళు The *joints* of the leg. పెట్టె కీళ్ళు The *hinges* of a box. వాడ కీలు Ship *tar* or *pitch*.

# కు

కు *pre.* To. This preposition changes to కి when connected with a word which has the termination in *ee*. నాకు యివ్వు Give it *to* me. అతనికి యివ్వవలెను Let it be given *to him*. వీరికి *To these*. వారికి *To those*.

కుక్క *sub.* కుక్క|కుక్కలు. A dog. ఆడకుక్క A bitch.

కుక్కగొడుగు *sub.* కుక్కగొడుగు|కుక్కగొడుగులు. A mushroom. యీ వర్షముకు కుక్కగొడుగులు చాలా మొలిచినవి This fall of rain has produced a great quantity of *mushrooms*. vide పుట్టకొక్కు.

కుక్కడం *v. a.* కుక్కుతూ|కుక్కి. To fill up or make full. పెట్టెలో బట్టలు కుక్కడం To fill a trunk with clothes.

కుచ్చు *sub.* కుచ్చు|కుచ్చులు. A tassel. పాలకీ కుచ్చులు Palanquin tassels.

కుట్ర *sub.* కుట్ర|కుట్రలు. An intrigue.

కుట్టడం *v. a.* కుట్టుతూ|కుట్టి. To sew; to sting. తేలు కుట్టడం To be *stung* by a scorpion. పాము కుట్టడం To be *stung* by a snake. జెర్రి కుట్టడం To be *stung* by a centipede. బట్టలు కుట్టడం To *sew* clothes.

కుట్టు *sub.* కుట్టు|కుట్లు. A sewing; a needlework. యీ అంగరకా కుట్టు

బాగా వున్నదికాదు The *needlework* in this jacket is not well done. కడుపు కుట్టు A *pain* in the belly.

కుటుంబం *sub.* కుటుంబపు|కుటుంబములు. Family. మా కుటుంబం యిక్కడ వున్నది కాని మా అన్నగారి కుటుంబం మరివకవూళ్లో వున్నది My *family* is here, but my brother's *family* is in another village.

కుడి *adj.* Right. కుడిపక్క *Right* side. కుడిచెయ్యి *Right* hand.

కుడుచుకోవడం *v. a.* కుడుచుకుంటూ|కుడుచుకుని. To suck. చిన్నవాడు పాలు కుడుచుకుంటూవున్నాడు The child is *sucking* milk.

కుదపడం *v. a.* కుదుపుతూ|కుదిపి. To shake. బోయీలు చాలా కుదుపుతూవున్నారు The palanquin boys *shake* very much.

కుదరడం *v. n.* కుదురుతూ|కుదిరి. To recover from sickness; to be restored; to be settled or arranged. తమ అనుగ్రహంచాత మాపని కుదిరినది By your favour my business has been *settled.* నావళ్ళు కుదిరినది My health is *restored.*

కుదరచడం *v. a.* కుదురుస్తూ|కుదిరిచి. To cure. వైద్యుడు నావళ్ళు కుదిరిచినాడు The doctor has *cured* me.

కుదుపు *sub.* కుదుపు|కుదుపులు. A shaking. యీవేళ గాడీలో కూర్చుండడంచాత నాకు చాలా కుదుపు తగిలినది I got a good *shaking,* riding in a hackery to-day.

కుదువ *sub.* కుదువ|కుదువలు. Mortgage. కుదువపెట్టడం To *mortgage;* to *pawn.* అతను యిల్లు కుదువపెట్టి బదులు పుచ్చుకున్నాడు He procured a loan by *mortgaging* his house. అతను నగలు కుదువ పెట్టినాడు He *pawned* his jewels.

కునికిపాటు *sub.* కునికిపాటు|కునికిపాట్లు. Drowsiness; sleepiness. అతను కూర్చుండి కొంతసేపు కునికిపాట్లుపడి తరువాత తన గదిలోకి పరుండ పోయినాడు After sitting down and *dozing* for some time, he retired to his room to sleep.

కునుకు *sub.* కునుకు|కునుకులు. Sleepiness. అతనికి కునుకు పట్టినది He fell *asleep.* It means a *slight sleep.*

కుంకుడు కాయ *sub.* కుంకుడుకాయ|కుంకుడుకాయలు. The soap-nut,

produced from a tree, the growth of India. This nut forms a strong lather when mixed with water, and is used in this state by the Indians to wash their hair. It is also used in India for washing horses, or other animals with. కుంకుడుకాయలో పలుకు The inside of the *kunkurookaya* nut seeds.

కుంకుడు చెట్టు *sub.* కుంకుడుచెట్టు|కుంకుడుచెట్లు. Soap-nut tree.

కుంగడం *v. n.* కుంగుతూ|కుంగి. To sink; to depress. పునాదిలో ఘట్టి బలంలేదు గనక ఆ యింటి స్తంభం కుంగినది The foundation not being sufficiently firm, the pillar of that house has *sunk.* ఆ మనిషి వుద్యోగంలేక కుంగి వున్నాడు That man is *depressed* for want of employment.

కుంచడం *v. a.* కుంచుతూ|కుంచి. To reduce; to decrease. జీతం కుంచడం To *reduce* wages. దస్తు కుంచడం To *diminish* the revenue.

కుంచం *sub.* కుంచపు|కుంచములు. A measure equal to eight seers or sixteen pounds.

కుంట *sub.* కుంట|కుంటలు. A small tank or pond; the name of a land measure. సరస్సు: పల్లము: చెఱువు.

కుంటడం *v. n.* కుంటుతూ|కుంటి. To limp; to walk lamely.

కుంటి *adj.* Lame; limping. కుంటివాడు or మనిషి A *lame* man; one who limps. కుంటితనం *Lameness.* కుంటి మాటలు ఆడడం To speak *lame* or *trifling* words.

కుండ *sub.* కుండ|కుండలు. A pot; an earthen vessel.

కుండు *sub.* కుండు|కుండ్లు. A cistern. కోటలో వున్న మనుష్యులకు మంచి నీళ్ళ నిమిత్తం బందరు దార్లో కుండ్లు కట్టించినారు They have constructed *cisterns* of good water on the road side, for the use of the people in the Fort.

కుంద *sub.* కుంద|కుందలు. A pillar. ఆ యింటికుందలు మహా పెద్దవి The *pillars* of that house are very large. N. B. This word is only current in the higher parts of the Circars.

కుంటకం *sub.* కుంటకపు|కుంటకములు. Impediment; hindrance.

కుప్ప *sub.* కుప్ప|కుప్పలు. A heap. జొన్నకుప్ప A *heap* of maize. మంటికుప్ప A *heap* of dirt. రాళ్ళకుప్ప A *heap* of stones. కుప్ప వెయ్యడం To *heap*; to *pile up*.

కుమ్మడం *v. a.* కుమ్ముతూ|కుమ్మి. To butt like a ram; to toss or strike with the horns like a bull.

కుమ్మరి *sub.* కుమ్మరి|కుమ్మర్లు. A pot-maker or potter. కుమ్మరి వాడు Item. కుమ్మరి కులం *pot-maker* caste.

కుమ్మరించడం *v. a.* కుమ్మరిస్తూ|కుమ్మరించి. To empty; to discharge. సంచీలో రూపాయీలు అన్నీ బల్లమీద కుమ్మరించు *Empty* all those rupees from the bag upon the table.

కుమార్తె *sub.* కుమార్తె|కుమార్తెలు. A daughter.

కుమారుడు *sub.* కుమారుడి|కుమాళ్ళు. A son.

కుంపటి *sub.* కుంపటి|కుంపట్లు. A chafing-dish. చలి కాచుకునే నిమిత్తం కుంపటి తీసుకురా Bring the *chafing-dish* to warm us against the cold. కుంపటిలో నిప్పులు తీసుకురా Fill the *chafing-dish* with fire and bring it here.

కుంబీ *sub.* కుంబీ|కుంబీలు. Bleaching. కుంబీ చెయ్యడం To bleach. ఆబట్ట కుంబీ బాగాలేదు That cloth is not well *bleached*.

కుయ్యడం *v. n.* కూస్తూ|కూసి. To bark or bray; to call and sing. కుక్క కూస్తూవున్నది The dog *barks*. గాడిద కూస్తూవున్నది The ass *brays*. పిట్ట కూస్తూవున్నది The bird *sings* or *whistles*. కోడిపుంజు కూస్తూవున్నది The cock *crows*.

కురచ *adj*. Short; diminutive. కురచ మనిషి A *short* man. కురచ దూలం A *short* beam. కురచ చెయ్యడం To ***diminish***; to ***shorten***. కురచగా In a ***short*** manner. అతను వారందరికన్న మహా కురచగా వుంటాడు He is by far the ***shortest*** of them all.

కుర్ర *adj*. Infantile; youthful. కుర్రడు or కుర్రవాడు Infant or a very young boy. కుర్రది Female infant.

కురవడం *v. n.* కురుస్తూ|కురిసి. To rain. వాన కురవడం Item. Figuratively it is used as follows. ఆ బంట్రోతు వరహాల నిమిత్తం వచ్చి

నప్పుడు నిప్పులు కురిపిస్తాడు That peon *is* in a *great hurry* when he comes to demand money.

కుర్చీ *sub.* కుర్చీని|కుర్చీలు. A chair.

కురుపు *sub.* కురుపు|కురుపులు. A boil. నెత్తురు కురుపులు or సెగ కురుపులు Small *boils*, produced by the heat or bad state of the blood.

కురూపం *sub.* కురూపపు|కురూపములు. Ugliness. ఆ మనిషియొక్క కురూపం యెంత అని చెప్పను? How can I well describe the *ugliness* of that man?

* కులకడం *v. n.* కులుకుతూ|కులికి. To rejoice; to gladden. ఉద్యోగం దొరికినందుచాత మహా కులుకుతూవున్నాడు He rejoices extremely because he has got an employ.

కులం *sub.* కులపు|కులములు. Caste. నీ కులం యేమి? What is your *caste*? This word is applied both to the four principal tribes or *castes* of Hindus, as well as to each particular profession. The four principal castes are the *Brahmins* called బ్రాహ్మణ కులం. The *Kshatriyas* రాచ కులం. The *Vaisyas* కోమటి కులం. The *Sudras* శూద్ర కులం. The inferior castes are those of professions, such as మంగల కులం The barber *caste*; చాకల కులం The washerman *caste*, &c.

కులస్థుడు *sub.* కులస్థుని|కులస్థులు. A person of the same caste with yourself, for the male gender. నా కులస్థులు అంతా యిక్కడి నుంచి వెళ్ళిపోయినారు My own *caste people* have all left the place. కులస్థురాలు Of the same caste, for a woman.

కులస్థురాలు *sub.* కులస్థురాలి|కులస్థురాండ్లు. One of the same caste, as relating to women. The word కులస్థులు is common to both sexes, as being in the plural.

కుసుంబా *sub.* కుసుంబా|కుసుంబాలు. A tree or shrub, the flower of which produces a beautiful red die.

కుళ్ళగించడం *v. a.* కుళ్ళగించుతూ|కుళ్ళగించి. To dig, as applied to a garden.

కుళ్ళడం *v. n.* కుళ్ళుతూ|కుళ్ళి. To decay; to grow rotten. అరటి

పండ్లు కుళ్ళిపోయినవి The plantains are *rotten*.

కుళాయా *sub*. కుళాయా|కుళాయాలు. A cap, worn by the Indians. vide టోపి.

కుళ్ళు *adj*. Rotten. కుళ్ళు నీళ్ళు. *Putrefied* water. కుళ్ళు పండ్లు *Decayed*. fruit.

## కూ

కూక *sub*. కూక|కూకలు. A noise. కూకలు పెట్టడం or వెయ్యడం To make a *noise*. అక్కడ కూకలు పెట్టకు Do not make a *noise* there!

కూజా *sub*. కూజా|కూజాలు. A jar; the name of the earthen ware commonly called *jugglet*, in which water is kept for drinking.

కూడడం *v. a*. కూడుతూ|కూడి. To assemble; to join together; to sum up figures. గుంపు కూడినది There *assembled* a crowd. కోర్టు కూడినది The court is *assembled* or *met*. అంకెలు కూడడం To *reckon up* figures.

కూడని *adj*. Bad; base; worthless.

కూడా *pre*. With; accompanying. అతనితో కూడావచ్చినాను I came *along with* him.

కూడు *sub*. కూటి|కూళ్ళు. Victuals. This term is generally used by common people. The more polished term is అన్నం.

కూత *sub*. కూత|కూతలు. A barking; a braying; the call of a bird. పిట్టకూత The *whistling* or *singing* of a bird. పెట్టకూత A hen's *cackling*. vide కుయ్యడం.

కూర *sub*. కూర|కూరలు. Garden greens. తోటకూర *Spinage* or *spinach* or *small greens*. పెరుకూర A *long* kind of *greens*.

కూరగాయ. *sub*. కూరగాయ|కూరగాయలు. Vegetables of all descriptions go by this name.

కూరడం *v. a*. కూరుతూ|కూరి. To load; to fill. ఆ తుపాకి కూరి తీసు

కూరిరా *Load* that firelock and bring. ఆ గోతులలో మన్నూ రాళ్లన్నూ కూరు *Fill* those holes with earth and stones.

కూర్చడం *v. a.* కూర్చుతూ। కూర్చి. To compose; to join; to combine. అతను ఆ గ్రంథంలో మాటలు బాగా కూర్చినాడు His words are well *arranged* in that composition. దర్జీ దుప్పట్లు కూర్చినాడు The tailor has *joined* the clothes.

కూర్చుండడం *v. n.* కూర్చుంటూ। కూర్చుండి. To sit. అక్కడ కూర్చుండు *Sit down* there.

కూలడం *v. n.* కూలుతూ। కూలి. To fall down; to overturn. Used with కింద. Such as గోడ కిందకూలినది The wall *fell down.* బండి కూలినది The carriage was overturned. కూలచడం To cause to fall.

కూలి *sub.* కూలి. (No plural.) Hire or labcur. నీవు వాడికి యెంత కూలియిచ్చినావు? How much did you give him for his *coolie* or *hire.* కూలివాడు A *labouring man,* usually called a *coolie.* తోట తవ్వేటందుకు కూలివాండ్లు వచ్చినారా? Have the *coolies* come to dig in the garden? కూలిపని *Work* for *hire.*

✓ కూసం *sub.* కూసపు। కూసాలు. The name of the *cast skin* of a snake. It also means a *dress* worn by very young children. కూసం విడవడం To *cast* the *skin,* as a snake. పాము కూసం A *snake's skin.* ఆ చిన్నదానికి కూసం తొడిగించు Put on that *infant's dress.* కుబుసము : కుసుము.

## కె

కెంపు *sub.* కెంపు। కెంపులు. A ruby.

• కెలకడం *v. a.* కెలుకుతూ। కెలికి. To turn or twist; to mix up or stir. వెంనపూసలో వేలుపెట్టి కెలికినాడు He put his finger in the butter and *stirred* it up. అతను అంనమాటలు కెలికినాడు He *turned and twisted* the words that were spoken by him.

## కే

కేక *sub.* కేక। కేకలు. Noise. vide కూత; కూక.

కేవు *sub.* కేవు। కేవులు. Freight. నీవాడ కేవుయెంత? What is the *freight* of your ship?

## కై

కైతప్పు *sub.* కైతప్పు। కైతప్పులు. A mistake in writing. నావల్ల కైతప్పువచ్చినది I have made a *mistake* in writing, that is, I have written *wrong*.

కైదు *sub.* కైదు। కైదులు. Prison; confinement. అతణ్ని కైదులో వెయ్యడమైనది He has been put in *confinement*. కైదు చెయ్యడం To *confine*; to *imprison*.

కైలు *sub.* కైలు। కైళ్లు. A revenue term, signifying the *measurement* of the crops, before a division of it is ordered. కైలుకొవడం To make a *kyle* or form a *measurement*. ఆకుప్ప కైలుకొలేదు That heap has not been *measured*. కైలుచెయ్యడం To *measure* grain.

కైవారం *sub.* కైవారపు। కైవారములు. Circumference. ఆ స్తంభపు కైవారంకొలిచితే Bring me the *measurement* of that *pillar*.

## కొ

కొట్టడం *v. a.* కొట్టుతూ। కొట్టి. To flog; to beat. అతణ్ని యితడు కొట్టినాడు This man has *beat* the other one. మేజిస్ట్రేటువారు దొంగలను కొట్టించినారు The magistrate has caused the thieves to be *flogged*. దార్లుకొట్టడం To *rob* on the *highways*.

కొట్టివెయ్యడం *v. a.* కొట్టివేస్తూ। కొట్టివేసి. To exclude; to dismiss; to strike out. ఆ జాబితాలోనుంచి అతనిపేరు కొట్టివెయ్యి *Strike* his name *out* of that list. కొర్టువారు అతని వ్యాజ్యం కొట్టివేసినారు

The court has *dismissed* his suit.

కొట్టు *sub.* కొట్టు|కొట్లు. A beating; a flogging; a godown. బియ్యపుకొట్లు Rice *godowns.* సామాను కొట్లో వేసినారు They have put the baggage in the *godown.*

కొఠి *sub.* కొఠి|కొఠీలు. A soucar's place of business, synonymous with *banking house* or *bank.* ఆ సాహుకారు యెక్కడ కొఠి వేసినాడు? Where has that soucar or sowkar fixed his *place* of *business?*

కొడవలి *sub.* కొడవలి|కొడవండ్లు. A sickle. మహసూలు కోతకు కొడవండ్లు తెచ్చినారు They have brought the *sickles* for cutting the crops.

కొడి *sub.* కొడి|కొళ్ళు. A flame; a flag. అగ్నిహోత్రపు కొడి The *flame* of fire. దీపపు కొడి The *flame* of a lamp. మైనపువత్తి కొడి The *flame* of a candle. కుంపిణీవారి కొడి వేసిన నాటనుంచి మేము వారి ప్రాపకంలో వుండి వున్నాము We have lived under the Company's protection, ever since their *flag* was raised.

కొడుకు *sub.* కొడుకు|కొడుకులు. A son. vide కుమారుడు.

కొణుజు *sub.* కొణుజు|కొణుజులు. A tick. పశువు తొడుగు.

కొత్త *adj.* New. కొత్తసామాను *New* things.

-కొతకడం *v. n.* కొతుకుతూ|కొతికి To evade or prevaricate in speech. మాటలుఅన్ని చెప్పక కొతుకుతాడు He *prevaricates* and would not tell all.

కొద్ది *adj.* Little; small; few. కొద్దిపని A *small* business. కొద్దిమంది *Few* people. కొద్దిచెయ్యడం To *diminish*; to *curtail.* నా జీతం కొద్దిచేసినారు They have *curtailed* my allowances. ఈశ్వరుడు వారిపని కొద్దిచేసినాడు Providence has *brought* them into this *low state.* కొద్దిపరచడం Item.

కొదవ *sub.* కొదవ. (No plural.) A remainder; a residue. vide కడమ.

కొన *sub.* కొన|కొనలు. An end. vide కడ.

కొనడం *v. a.* కొంటూ|కొని. To purchase. It is used in all

senses.

కొన్ని *adj*. Some. కొన్నివస్తువలు *Some* articles. కొన్నిపశువులు *Some* cattle. This word is applied only to things or animals.

కొర్న *adj*. Waste. కొర్నభూమి లేక యరనుభూమి Waste land.

కొంగ **sub**. కొంగ।కొంగలు. A crane. It is the general name of birds of this species.

కొంగు **sub**. కొంగు।కొంగులు. Hem or border of a garment or piece of cloth. పైటకొంగు End of a woman's cloth, thrown over the shoulder.

కొంచుపోవడం *v. a.* కొంచుపోతూ।కొంచుపోయి. To carry away; to remove. ఆ వస్తువు అక్కడనుంచి కొంచుపో *Carry* that thing *away* from that place.

కొంచం *adj*. Little or few. కొంచం మంది Few people. vide కొద్ది.

కొంటె **sub**. కొంటె।కొంటెలు. Depravity; impudence; is generally applied to young people. కొంటెవాడు A *wicked roguish* fellow. కొంటె తనం *Depravity*; *wickedness.*

కొండ **sub**. కొండ।కొండలు. A hill; a rock. కొండ కనము or వాక A *pass* or *narrow road* between two hills. కొండ చిలువ The *rock* snake.

కొండముచ్చు **sub**. కొండముచ్చు।కొండముచ్చులు. The *large, black faced* monkey.

కొండనాలికె **sub**. కొండనాలికె।కొండనాలికెలు. The palate of the mouth.

కొండి **sub**. కొండి।కొండ్లు. A sting. తేలుకొండి The *sting* of a scorpion. చీమకొండి The *bite* of an ant, that is, the ***sting***. దోమకొండి A mosquito *bite*, literally ***sting***.

కొండెం **sub**. కొండెపు।కొండెములు False complaint. నేను నాపనిలో జాగ్రతగా వుండలేదని నామీద అతను కొండెములు చెప్పినాడు He made ***false statements*** against me, of not being careful in my business.

కొంత *adv*. Some or few. కొంతమంది A few people. కొంత పయికం

Some money.

కొందరు *adj.* Some or some people. కొందరు మనుష్యులు Item. This word is entirely applied to people.

కొప్పు *sub.* కొప్పు|కొప్పులు. The hair knot, fixed in the manner observed by the women in India.

కొబ్బరి *sub.* కొబ్బరి. (No plural.) This is the name given to the white substance *inside* of the *coconut.* They make an oil from this stuff, which is consequently called కొబ్బరి నూనె *Coconut oil.* కొబ్బరిపిండి *Coconut* meal or flour, which means the *refuse* of the stuff left in the mill, after expressing the oil from it, which is given to fatten bullocks. కొబ్బరిచెట్టు A *coconut* tree. కొబ్బరికాయ The *coconut* fruit. కొబ్బరిమట్ట or ఆకు *Coconut* leaf. కొబ్బరికల్లు *Coconut* toddy. This toddy is not commonly drawn or used to the northward, where the palmyra toddy is the prevailing liquor.

కొమ్మ *sub.* కొమ్మ|కొమ్మలు. A branch. చెట్టుకొమ్మ The *branch* of a tree.

కొమ్ము *sub.* కొమ్ము|కొమ్ములు. A horn. ఎద్దుకొమ్ము A bullock's *horn.* కొమ్ముబూర A blowing *horn.* This word also means the *mark* to the consonant, which makes it sound like *oo*, called *Kommoo.*

కొయ్య *sub.* కొయ్య|కొయ్యలు. Wood; a ship's mast. వాడ కొయ్య Item. రెండు కొయ్యలవాడ A *two masted* vessel. N. B. *Wood* is the real meaning but, by custom, it is applied to *masts* of a ship.

కొయ్యడం *v. a.* కోసాను|కోసి. To cut; to amputate; to pluck; to gather. పండ్లు కొయ్యడం To *gather* fruit. పువ్వులు కొయ్యడం To *pluck* or *gather* flowers. ముక్కు కొయ్యడం To *cut off* a nose. N.B. This was the practice amongst the Zemindars for the punishment of thieves, before the Judicial system

was established.

కొరకడం *v. a.* కొరుకుతూ।కొరికి. To gnaw. పిట్ట జామపండు కొరికినది A bird has been *gnawing* at the guava fruit.

కొరకంచు *sub.* కొరకంచు।కొరకంచులు. A fire brand.

కొరకు *pre.* For; on account of. vide కోసం.

కొరడుపారడం *v. n.* కొరడుపారుతూ।కొరడుపారి. To be benumbed or to deaden. అతను నీళ్ళలో శానాసేపు నిలుచున్నందున వళ్లు కొరడు పారినది Having been a long time in the water, his body has become *numbed.*

కొరివి *sub.* కొరివి।కొరువులు. A fire brand. vide కొరకంచు.

కొల *sub.* కొల।కొలలు. *Measurement.* ఆ ధాన్యపుకొల మర్యాదప్రకారం లేదు The *measurement* of that grain is not agreeable to standard. యిక్కడ కొలలు అన్నీ పిచ్చికొలలు The *measures* at this place are all false *measures.* It also applies to land.

కొల్ల *sub.* కొల్ల।కొల్లలు. Dissipation; booty. యీ సొమ్ము నాకు కొల్లగా వచ్చినదికాదు I did not get this property as a *booty.*

కొలపడం *v. a.* కొలుపుతూ।కొలిపి. This verb is applied to the prompting of the men to the dancing girls at a nautch, to assist them in the words of the song, which generally accompanies the dancing. మేలుకొలపడం To *wake* a person *from sleep.* వుసుకొలపడం To *set* a dog *upon* one.

కొల్లపెట్టడం *v.a.* కొల్లపెట్టుతూ।కొల్లపెట్టి. To dissipate; to squander; to make away with. వూరిరైతులు మహసూళ్లు బొత్తిగా కొల్లపెట్టినారు The village people have completely *made away* with the produce. అతను యింట్లో సొమ్ముఅంతా కొల్లపెట్టినాడు He has *squandered away* the whole of his estate.

కొలవడం *v. a.* కొలుస్తూ।కొలిచి. To measure; to serve; to worship. ధాన్యం కొలవడం To *measure* grain. బట్ట కొలవడం To *measure* cloth. భూమి కొలవడం To *measure* ground. దొరను కొలవడం To serve the master. దేవుని కొలవడం To worship God.

కొలిమి *sub.* కొలిమి|కొలుములు. A forge. కమ్మరవాడు కొలిమి పెట్టలేదు The blacksmith has not *set up* his *forge*.

కొలువు *sub.* కొలువు|కొలువులు. Service; servitude. vide నవుకరీ.

కొవ్వడం *v. n.* కొవ్వుతూ|కొవ్వి. To strengthen and get fat. Figuratively, to swell out with pride or riches.

కొవ్వు *sub.* కొవ్వు. (No plural.) Grease; fat. పందికొవ్వు Hog's *lard*.

కొస *sub.* కొస|కొసలు. End. vide కొన.

కొసరడం *v. a.* కొసురుతూ|కొసిరి. To demand over. అతను బాజార్లో కూర కొన్నప్పుడు చాలా కొసిరినాడు కాని యేమిన్ని యివ్వలేదు Buying greens in the bazaar, he tried hard to *get* something *over*, but nothing was given.

## కో

కోక *sub.* కోక|కోకలు. A name given to the clothes worn as the usual dress by the women in India. vide చీర.

కోట *sub.* కోట|కోటలు. A fort. ఆ పట్నంలో కోట కట్టించినారు They have built a *fort* at that town.

కోర్టు *sub.* కోర్టు|కోర్టులు. The court; any court of justice.

కోడలు *sub.* కోడలు|కోడండ్లు. A daughter-in-law; pl. Daughters-in-law.

కోడి *sub.* కోడి|కోళ్లు. A fowl. కోడికూత The *crow* of a *cock*. కోడిపిల్ల A *chicken*. కోడిజుట్టు A *cock's* comb. పిల్లలకోడి A brood *hen*. సీమకోడి A European *fowl*; the name usually given to a *turkey*. కోడిఆర A *cock's* spur or heel.

కోడు *sub.* కోటి|కోళ్లు. The leg of a cot. మంచంకోడు Item. ఊరిదరి పీటిపల్లము A *water-course*.

కోడె *sub.* కోడె|కోడెలు. A male or bull calf; steer.

కోణం *sub.* కోణపు|కోణములు. A corner; an angle. ఆ బల్లకు కోణములు బాగా తీర్చినావా? Have you measured the *angles* of that table properly?

కోత *sub.* కోత|కోతలు. A cutting. కోతకాలం Harvest time. యీ దేశంలో కోతకాలం యిదికాదు This is not the *time* of *harvest* in this country. మహాన్యాలు కోతకు తయారుఅయినది కాదు The *crop* is not yet ripe for *cutting.*

కోతి *sub.* కోతి|కోతులు. A monkey. pl. Monkeys.

కోనేరు *sub.* కోనేటి|కోనేరులు. A pond or small piece of water in a garden, generally called *tank.* అతను కోనేరు వకటి తవ్వించినాడు He got dug a *tank* or *pond.*

కోపం *sub.* కోపపు|కోపములు. Anger. అతను నామీద చాలా కోపం చేసినాడు He has been exceedingly *angry* with me.

కోమటి *sub.* కోమటి|కోమట్లు. A banian or banyan. కోమటి కులం The *banian* caste. కోమటివాడు A *banian* man. కోమటిది A *banian* woman. This is considered to be the third caste amongst the Hindoos or Hindus.

కోర *sub.* కోర|కోరలు. A tusk; a fang; the side teeth of the human head. పాముకోరలు The *fangs* of a snake. పులికోరలు The *teeth* or *fangs* of a tiger. పందికోర The tusk of a boar.

కోరడం *v. n.* కోరుతూ|కోరి. To wish; to hope; to choose. మీరు తగువర్లను కోరుకున్నారా? Have you *chosen* arbitrators? సాక్షులను కోరడం To *choose* witnesses.

కోరా *adj.* Unbleached. కోరాబట్ట *Unbleached* cloth. కోరా బారచాపులు *Unbleached* long cloths. కోరా బంగారం *Adulterated* gold; what the pagoda is made of, that is, with *alloy* in it.

కోరిక *sub.* కోరిక|కోరికలు. A desire; a wish; a hope. మీ కోరిక యేమి? What is your *wish?* మీకు భాగ్యం రావలెనని నాకు కోరికవున్నది My *hope* is, that you may be rich.

కోల *sub.* కోల|కోలలు. A stick; an arrow. కోలల పొది A quiver of *arrows.* ఆ విల్లుకాడు కోలలు బాగా వేస్తాడు That bowman is very expert in delivering his *arrows.* తవ్వుకోల A *hoe,* to grub up grass. This is the method of cutting grass in

India, for horses and other animals.

కోసం *pre.* For; because of; on account of. నా కోసం అతను వచ్చినాడు He has come *for*, or *on my account*, or *because of* me. నా కోసం విచారించవద్దు Do not be grieved *for*, or *on my account*.

కోసు *sub.* కోసు|కోసులు. A distance of two miles, as it is generally reckoned, but it varies so considerably in different parts of the country, as seldom to be depended on.

## కౌ

కౌగిలి *sub.* కౌగిలి|కౌగిళ్లు. An embrace. స్నేహితుడియొక్క కౌగిలి చాలా సంతోషమును కలగచేసినది The *embrace* of a friend gave great satisfaction. కౌగిలించుకోవడం To *embrace*. This word is usually written కౌగలించుకోవడం.

కౌజు *sub.* కౌజు|కౌజులు. A partridge. కంజు Item.

కౌను *sub.* కౌను|కౌనులు The waist; a pure Telugu word, now obsolete.

కౌలు *sub.* కౌలు|కౌళ్లు. Agreement; lease.

కౌసు *sub.* కౌసు|కౌసులు. General name given to meat purchased in the bazaar, more particularly applied to prawns and fish of any kind.

## ఖ

ఖర్చు *sub.* ఖర్చు|ఖర్చులు. Expenditure or expense. ఖర్చుచెయ్యడం To make *expense*; to spend. ఆ మనిషి చాలా ఖర్చుచేస్తాడు That man lives at a great *expense*. నా దగ్గర ఖర్చుకు ఏమీలేదు I have got nothing for my *expenditure*.

ఖజానా *sub.* ఖజానా|ఖజానాలు. Treasure; money. ఖజానాపెట్టె A *cash* chest. ఖజాంచి A *cash-keeper*.

ఖర్జూరచెట్టు *sub.* ఖర్జూరచెట్టు|ఖర్జూరచెట్లు. The palm or date tree.

ఖర్జూరపండు *Date fruit.*

ఖడాయించడం *v. a.* ఖడాయిస్తూ।ఖడాయించి. To erect; to raise. డేరా ఖడాయించడం To *raise* or *pitch* a tent. డేరావెయ్యడం is more generally used.

ఖబరు ***sub.*** ఖబరు।ఖబర్లు. News; information. అతను వచ్చినాడని మాకు ఖబరు తెలిసినది I am *informed* he is arrived. బజారు ఖబరు Bazaar *reports*, that is, *fabrications*. వాడ ఖబరు Ship *news*. నోటి ఖబరు Verbal *information*.

ఖరీదు ***sub.*** ఖరీదు।ఖరీదులు. Price; value. ఖరీదు చెయ్యడం To *value*. vide విలవ.

ఖానిగీ *adj.* Private; clandestine. ఖానిగీ సొమ్ము *Private* money. ఖానిగీ లెక్కలు *Private* accounts. ఖానిగీ పని *Private* business; any thing done in a *clandestine manner*. నీవు చేసిన ఖానిగీపని నాకు తెలిసినది I am well acquainted with all your *private doings*.

ఖాలీ *adj.* Empty. ఆ యిల్లు ఖాలీ చేసినారు They have left that house *empty*.

ఖావందు ***sub.*** ఖావందు।ఖావందులు. Master; superior. vide దొర.

ఖాసా *adj.* Own; private. నా ఖాసాయిల్లు My *own* house. జమీందారుడి ఖాసాలు A zemindar's *private* servants, that is, his *slaves*.

ఖూనీ ***sub.*** ఖూనీ।ఖూనీలు. Murder. ఖూనీ ఖోరు A *murderer*.

## గ

గచ్చు ***sub.*** గచ్చు. (No plural.) The name given to what is generally called ***fine chunam.***

గజ్జ ***sub.*** గజ్జ।గజ్జలు. The groin.

గజం ***sub.*** గజము।గజములు. A yard measure. తుపాకీగజం A ***ram-rod.***

గజ్జి ***sub.*** గజ్జి. (No plural.) The itch.

గజ్జె ***sub.*** గజ్జె।గజ్జెలు. Morris bells, tied by dancing girls to

their feet, when they dance; bells tied to the trappings of horses in India.

కట్టన చెయ్యడం *v. a.* కట్టనచేస్తూ।కట్టనచేసి. To ram down; to beat. ఫిరంగిలో మందుగుండువేసి కట్టనచేస్తూవున్నారు They are *loading* the cannon with powder and ball and *ramming* it home. బందీవాళ్లు దారిఅంతా కట్టనచేస్తూవున్నారు The prisoners are *beating* the road hard. చాకలవాడు బట్టలు కట్టనచేస్తూవున్నాడు The washerman is *beating* the clothes.

కట్టి *adj.* Strong; capable. కట్టిపని Substantial work. కట్టిమనిషి A *strong* man. కట్టివాడు A man of *capacity*.

కట్టు *sub.* కట్టు।కట్లు. A bank or dam. vide కట్ట.

కడ *sub.* కడ।కడలు. A cane, stick or stalk. వెదురుకడ A bamboo *stick*. జొన్నకడ A maize *stalk*. చెరుకుకడ The *stalk* of the sugar plant. తలకడ A *pillow*, according to idiom.

కడ్డ *sub.* కడ్డ।కడ్డలు. A boil; an ulcer; a root; a lump of earth. అతని వీపుమీద పెద్దకడ్డ లేచినది A large *ulcer* has come upon his back. మంటికడ్డ A clod of earth. పెండలపు కడ్డలు *Yams*. కడ్డకట్టడం To grow into *lumps* or *congeal*. నెయ్యి కడ్డకట్టినది The ghee is got into *lumps*, that is, *congealed*.

కడన *sub.* కడన।కడనలు. Acquirement; a regard. కడన చెయ్యడం To *regard*; to *acquire*. అతని కడన యేమాత్రం వుంటుంది? How much has that man *acquired*? అతను యెవరినీ కడనచెయ్యడు He has no *regard* for any person.

కడప *sub.* కడప।కడపలు. A threshold.

కడపడం *v. a.* కడుపుతూ।కడిపి. To put off; to postpone. యితను మాకు సొమ్ము యివ్వక కడుపుతూవున్నాడు He won't pay me my money and *puts* me *off*.

కడమంచ *sub.* కడమంచ।కడమంచలు. A stand or wooden horse, to hold trunks and boxes.

కడ్డం *sub.* కడ్డపు।కడ్డములు. The beard. మనిషి కడ్డం A man's beard.

చింబోతు గడ్డం The *beard* of a goat. ఆ మనిషిగడ్డం తెల్లగా వున్నది That man's *beard* is gray.

గడ్డి *sub.* గడ్డి. (No plural.) Grass. గడ్డియిల్లు A *thatched* house. గడ్డినేత *Thatching.*

గడించడం *v. a.* గడిస్తూ|గడించి. To provide for yourself; to acquire. అతను శానాసొమ్ము గడించినాడు He has *acquired* a great deal of money.

గడియ *sub.* గడియ|గడియలు. A bolt; the Telugu hour. ఆ తలుపు గడియవెయ్యి *Bolt* that door. యిక్కడికివచ్చి వకగడియ అయినది A *gurry* of time has passed since I came here. N. B. Two *gurries* and a half are reckoned to our English hour.

గడియుడం *v. n.* గడుస్తూ|గడిచి. To elapse; to expire; to pass. నలసంవత్సరం గడిచినది The year Nallah has *expired.* ఆ వుపద్రవములోనుంచి గడిచివచ్చినాడు He has *escaped* from that danger, and is come away.

గడుసు *adj.* Self confident; of good address. గడుసు మనిషి A man of free approach and elegant manners.

గణితం *sub.* గణితపు|గణితములు. Arithmetic. యితను గణితప్రజ్ఞలో మహాగట్టివాడు He is well versed in the science of *Arithmetic.*

గత్తర *sub.* గత్తర|గత్తరలు. Disturbance; vexation. గత్తరచెయ్యడం To *disturb; to give trouble.* అతను వూళ్లోకివెళ్లి గత్తరచేసినాడు He went to the town and created *disturbance* there.

గతి *sub.* గతి|గతులు. State; condition; nature. వాడుచేసిన మాయచాత మాకు యీగతి సంభవించినది This is the *condition* I am brought to, owing to his deceitful conduct. యీశ్వరగతి యీచొప్పున వున్నది Such is the *will* of providence. గ్రహగతి The *course* of the planets.

గద్ద *sub.* గద్ద|గద్దలు. A kite.

గది *sub.* గది|గదులు. A room; an apartment; a chamber.

గనక *adv.* Therefore; because. vide కాబట్టి.

గని **sub.** గని।గనులు. A mine. వజ్రాలగని A diamond ***mine.***

గంజాయి ***sub.*** గంజాయి. (No plural.) This is the preparation made from the leaf of the poppy, which is taken in great quantities in India mixed up with tobacco and smoked in the hookah. It has an exhilarating and intoxicating effect, like the opium.

గంజి ***sub.*** గంజి. (No plural.) *Conjy.* గంజినీళ్లు Thin *conjy.* This is rice boiled down to a liquid and is a very cooling, wholesome drink.

గంజీఫా ***sub.*** గంజీఫా।గంజీఫాలు. These are small thick tablets, ninety six in number, on the principle of our cards; with king, and vizier, drawn upon some; and 1, 2, 3, to the number of 10 marked on others. They are commonly of eight different colours; generally played by three people; but four can play at them. The game is called ***ganjeepha,*** from the Persian. గంజీఫా ఆడడం To play at ***ganjeepha.***

గంటం ***sub.*** గంటపు।గంటములు. The *iron pen;* ***style;*** an iron pen with which the Indians write on the palmyra leaf. గంటంతో వ్రాయడం To write with the *guntum* or ***style.***

గండం ***sub.*** గండపు।గండములు. Danger; peril; fatality. గండం తప్పడం To escape from *danger.*

గండ్ర ***adj.*** Cunning; sharp; quick. మహాగండ్ర మనిషి A man of great ***cunning;*** vulgarly termed a ***knowing fellow.*** గండ్ర యిసుక ***Coarse*** sand.

గండి ***sub.*** గండి।గండ్లు. A small channel cut in the bank of a tank for letting the water go into the fields; a breach in the bank, when the water forces its way through.

గంత ***sub.*** గంత।గంతలు. A bullock saddle. ఆ యెద్దుమీద గంత వేసినావా? Have you ***saddled*** that ***bullock?***

గంతువెయ్యడం. ***v. n.*** గంతువేస్తా।గంతువేసి. To jump; to vault.

గంధం *sub.* గంధపు|గంధములు. Prepared sandal-wood in the state in which the Indians rub it on their bodies; the general term for smell. ఇక్కడ మంచిగంధం కొట్టుతూ వున్నది There is a *nice smell* here. దుర్గంధం *Bad smell.* మంచి గంధం *Sandal-wood;* a *good smell.*

గంధకం *sub.* గంధకపు. (No plural.) Brimstone.

గబ్బిలం *sub.* గబ్బిలపు|గబ్బిలములు. A bat.

గంప *sub.* గంప|గంపలు. A basket, such as coolies use for carrying wine &c.

గ్రంథం *sub.* గ్రంథపు|గ్రంథాలు. A composition; a work, such as contains both prose and verse. గ్రంథం Also means the *collection* of *leaves* in which the work is contained, commonly called a *book.* It is also the name of the letter, in which the Sanskrit is written amongst the Malabar people.

గ్రంధిజినస్సు *sub.* గ్రంధిజినస్సు|గ్రంధిజినస్సులు. Medical drugs. ఆ ఔషధంలోకి ఆ గ్రంధిజినస్సులు తీసుకునిరా Bring those *drugs* here, to mix up in that medicine.

గ్రహం *sub.* గ్రహపు|గ్రహములు. A planet; a demon. అతణ్ని గ్రహం పట్టినది He is possessed by a *demon.* సూర్యుడు చంద్రుడు మొదలైన గ్రహములు The sun and moon and other *planets.*

గ్రహణం *sub.* గ్రహణపు|గ్రహణములు. An eclipse. సూర్యగ్రహణం An *eclipse* of the sun. చంద్రగ్రహణం An *eclipse* of the moon. గ్రహణం పట్టడం To be *eclipsed.*

గ్రహించడం *v. a.* గ్రహిస్తా|గ్రహించి. To comprehend. ఆ వుత్తరములో మతలబు గ్రహించినావా? Did you *understand* the *meaning* of that letter?

గర్భం *sub.* గర్భపు|గర్భములు. The belly. గర్భంతో వుండడం To be *pregnant.* ఆ స్త్రీ పది సంవత్సరములనుంచి పిల్లలులేక యిప్పుడు గర్భంతో వున్నది That woman is now *big with child,* after having been ten years without getting children.

గరిటె *sub.* గరిటెను|గరిటెలు. A ladle; a spoon. N. B. The word గంటె has been adopted to signify a *spoon*, but గరిటె is the proper word.

గరిడీ *sub.* గరిడీని|గరిడీలు. Place of exercise. యీవేళ గరిడీలోకి సాధనం నిమిత్తం వెళ్ళినాను I went this day to the *place* of *exercise* to practise.

గర్భిణి *sub.* గర్భిణిని|గర్భిణులు. Pregnancy: pregnant woman. vide గర్భం.

గరుత్మంతుడు *sub.* గరుత్మంతుని|గరుత్మంతులు. The kite commonly called *Garutmanthudu,* which the Indians consider sacred from an idea that Vishnoo used to ride upon this bird, or upon one of the same species, but infinitely larger.

గర్వపడడం *v. n.* గర్వపడుతూ|గర్వపడి. To be insolent; to be purse proud.

గర్వం *sub.* గర్వపు|గర్వములు. Sauciness; insolence; pride.

గర్వంగా *adv.* Insolently. అతను నాతో మహా గర్వంగా మాట్లాడినాడు He spoke to me very *overbearingly.*

గరువు *sub.* గరువు|గరువులు. A sandy, low, flat soil. గరుపనేల Item.

గల్లంతు *sub.* గల్లంతు|గల్లంతులు. Disturbance. vide గత్తర.

గల్లా *sub.* గల్లా. (No plural.) Grain. యీవూళ్లో యెంత గల్లా వున్నది? How much *grain* is there in this village?

గవ్వ *sub.* గవ్వ|గవ్వలు. A cowrie or cowry the average of which is eighty to one dub.



గాక *adv.* Besides; moreover. యిదిగాక *Besides this; moreover.* యిదిగాక మరికొంచెమైనా వున్నదా? Is there any more *besides this?* మీరు యిచ్చినదిగాక యింకా పదిరూపాయీలు వున్నవి *Besides* what you gave, there are ten rupees *over.*

గాగరా *sub.* గాగరాను|గాగరాలు. An under-garment; the same

as petticoat.

గాజు *sub.* గాజు।గాజులు. Glass or China-ware; glass hand-rings. గదిలోవున్న గాజుచిప్ప తీసుకునిరా Bring that *China-vessel* from the godown. ఆ ఆడమనిషి కొత్తగాజులు తొడుక్కున్నది That woman has put new *hand-rings* or *bangles* on.

గాడి *sub.* గాడి।గాడీలు. A Hackery; a carriage drawn by bullocks used by the Indians.

గాడిద *sub.* గాడిదె।గాడిదెలు. An ass. గాడిదకూత The braying of an *ass.*

గానుగ *sub.* గానుగ।గానుగలు. A press; a mill. నూనె గానుగ An oil *press.* చెరుకు గానుగ A sugar *press.* గానుగ ఆడడం To *work* a *mill.*

గాబోలును *adv.* Perhaps. vide కాబోలును.

గాభరా *adj.* Confused; perplexed. అతడితో బెదురుమాటలు చెప్పి గాభరా చెయ్యకు Do not *confuse* him, by speaking threatening words.

గాయం *sub.* గాయపు।గాయాలు or గాయములు. A wound. గాయం తగలడం or కావడం To be *wounded.* గాయం చెయ్యడం To *wound.*

గ్రామం *sub.* గ్రామపు।గ్రామములు. A village.

గ్రాసం *sub.* గ్రాసపు।గ్రాసములు. Subsistence. నీకు గ్రాసముకు యేలాగున జరుగుతూవున్నది? How do you obtain your *subsistence*? ఆ వూర్లో పశువులకు యేమైనా గ్రాసం కలదా? Is there any *forage* for the cattle at that village?

గారడీవాడు *sub.* గారడీవాని।గారడీవాండ్లు. A slight of hand performer, as they are generally termed in India, a *conjurer.* These people are very numerous in India and very dexterous in their art.

గాలం *sub:* గాలపు।గాలాలు. A hook. యీ గాలంతో యేలాగంటి చాపలు పట్టుతున్నావు? What kind of fish do you catch with this *hook*?

గాలి *sub.* గాలి|గాడ్పు. The wind; a demon. గాలి బాగా వేస్తూ వున్నది There is a fine *wind* blowing. సుడి గాలి A whirl-wind. గాలి కొట్టడం The wind to blow. గాలి విసరడం The wind to blow hard. గాలి వాన Wind and rain, properly a tempest. This word when written గాడ్పు in the plural, means an infection amongst cattle. పశువులకు గాడ్పు An infection amongst the cattle.

*గాలించడం *v. a.* గాలిస్తూ|గాలించి. To search for; to look out; to clear out. బియ్యంలో రాళ్ళు గాలించడం To clear rice of sand or stones. పెట్టెలో వస్తువులు గాలించడం To search a trunk for any articles. మనిషిని గాలించడం To send in search of a man.



గిట్టమి *sub.* గిట్టమి|గిట్టములు. Enmity variance. అతనికి నామీద గిట్టమి వున్నది He is at *variance* with me.

గిత్త *sub.* గిత్త|గిత్తలు. A steer; a runt.

గిద్ద *sub.* గిద్ద|గిద్దలు. A small measure, eight to the seer and sixteen to the manika.

గిన్నె *sub.* గిన్నె|గిన్నెలు. The name of the small cups of brass or other metal, used by the Indians to hold ghee.

గింజ *sub.* గింజ|గింజలు. Seeds. vide విత్తు.

గియ్యడం *v. a.* గీస్తూ|గీసి. To rule lines. vide గీసి కొట్టడం. This word when applied to toddy implies the drawing of it. కల్లు or తాడి గియ్యడం To draw toddy. నాలుక గియ్యడం To scrape the tongue. తల గియ్యడం To shave the head. కత్తితో గియ్యడం To scrape with a knife.

గిల్లడం *v. a.* గిల్లుతూ|గిల్లి. To pinch.

గిల్లు *sub.* గిల్లు|గిల్లులు. A pinch.



**గీకడం** *v. a.* గీకుతూ|గీకి. To scrape. vide గీరడం.

**గీటు** ***sub.*** గీటు|గీట్లు. A line; a mark or stroke. ఆ పుస్తకంలో గీట్లు గియ్యి. Rule the *lines* in that book. ఆ అక్షరంమీద గీటు బాగా వెయ్యి Make the *stroke* over that letter, properly. గీటు in this sense, means the stroke over a letter, to denote a stress to be laid upon it on pronouncing it, distinguishing the *long* from a *short* vowel.

**గీపెట్టడం** *v. n.* గీపెట్టుతూ|గీపెట్టి. To cry.

**గీరడం** *v. a.* గీరుతూ|గీరి. To scrape; to scratch with any sharp instrument. Also to tear any thing with the teeth. మామిడి టెంకపండ్లతో గీరినాడు He took the inside of the mango and *tore* it with his teeth.

**గీర్వాణం** ***sub.*** గీర్వాణపు. (No plural.) Synonymous with *Sanskrit.* vide సంస్కృతం.

**గీచివెయ్యడం** *v. a.* గీచివేస్తూ|గీచివేసి. To scratch out; to erase. ఆమాట గీచివెయ్యి *Scratch out* that word.



**గుక్క** ***sub.*** గుక్క|గుక్కలు. The breath. ఒక గుక్కలో నేను వస్తాను I shall be back in a *breath.* గుక్కెడు నీళ్ళు As much as a *gulp* of water.

**గుగ్గిలం** ***sub.*** గుగ్గిలపు. (No plural.) Dammar.

**గుచ్చడం** *v. a.* గుచ్చుతూ|గుచ్చి. To prick; to thread; to string. నాచేతులో ముల్లు గుచ్చుకున్నది A thorn has *pricked* my hand. ఆ సూదిలో దారం గుచ్చు *Thread* that needle. ముత్యాలు గుచ్చడం To string pearls.

**గుచ్చుకోవడం** *v. a.* గుచ్చుకుంటూ|గుచ్చుకుని. To prick. vide గుచ్చడం.

**గుజష్తా** ***adj.*** A revenue term signifying *expired; elapsed.*

గుజష్తా సాలు or సాలు గుజష్తా *Last* year.

గుజారు *sub.* గుజారు। గుజారులు. The soft substance in fruit. vide. గుంజు.

గుట్ట *sub.* గుట్ట। గుట్టలు. A hillock; unevenness in ground. ఆ భూమిలో నానాగుట్టలు వున్నవి There are many *hillocks* in that ground.

గుట్టు *sub.* గుట్టు। గుట్టులు. Deceit; false appearance. vide మర్మం.

గుడ్డ *sub.* గుడ్డ। గుడ్డలు. A cloth; a small piece of cloth. ఆ గుడ్డ నాకు యిప్పించు Give me that *piece of cloth.*

గుడ్లగూబ *sub.* గుడ్లగూబ। గుడ్లగూబలు. An owl.

గుడి *sub.* గుడి। గుళ్లు. A pagoda or eastern temple; the name of the *mark* on consonants to signify the vowel *e.*

గుడ్డి *adj.* Blind. గుడ్డివాడు A *blind* man. గుడ్డిది A *blind* woman.

గుడిసె *sub.* గుడిసె। గుడిసెలు. A hut.

గుడ్డు *sub.* గుడ్డు। గుడ్లు. An egg. గుడ్లుపెట్టడం To lay *eggs.* కంటిగుడ్డు The *ball* of the eye.

గుడుగుర్రాడడం *v. n.* గుడుగుర్రాడుతూ। గుడుగుర్రాడి. To whisper. వారు గుడుగుర్రాడుతూ వున్నారు They are *whispering* together. గుసగుసలాడడం Item.

గుణకం *sub.* గుణకపు। గుణకాలు. The *multiplier* in arithmetic.

గుణం *sub.* గుణపు। గుణములు. Nature; quality; disposition. అతను మంచిగుణం కలవాడు He is a man of a good *disposition.* చెడ్డగుణం Bad *disposition.* నాకు శరీరంలో గుణం అయినది My body is restored to a good *state.*

గుణించడం *v. a.* గుణిస్తూ। గుణించి. To multiply. మూడింటితో నాలుగు గుణిస్తే పన్నెండు అవుతుంది The *multiplication* of four by three makes twelve.

గుణింతం *sub.* గుణింతపు। గుణింతములు. Spelling, as it relates to letters; and multiplication, as it regards figures. గుణింతం గుణించడం To *spell*; to *multiply.*

గుత్త *sub.* గుత్త। గుత్తలు. Rent; farm. గుత్తగాడు *Renter* or *farmer.*

గుత్త చెయ్యడం To *rent*.

గుత్తి *sub.* గుత్తి|గుత్తులు. A bunch or cluster. అంగూరుపండ్ల గుత్తి A *cluster* of grapes. పుష్పాల గుత్తి A bunch of flowers.

గుర్తు *sub.* గుర్తు|గుర్తులు. Mark; token. బట్టమీద గుర్తు చెయ్యలేదు They have not put a *mark* upon the cloth. అనుగ్రహానకు గుర్తు *Token* of favour. గుర్తుపట్టడం To *recollect* and *recognize*.

గుద్దు *sub.* గుద్దు|గుద్దులు. The clenched fist. వాణ్ని గుద్దుతో పడవేసినాడు He *knocked* him down with his *fist*.

గునపం *sub.* గునపపు|గునపములు. An iron crow-bar. ఆగోడ పడగొట్టడానకు గునపం కావలెను The *crow-bar* is wanted to knock down that wall.

గునవడం *v. n.* గునుస్తూ|గునిసి. To grumble with discontent; to murmur.

గుప్పడం *v. a.* గుప్పుతూ|గుప్పి. To fling; to throw at. అతడు నామీద గుప్పెడుపువ్వులు గుప్పినాడు He *threw* a handful of flowers at me.

గుప్పిలి *sub.* గుప్పిలి|గుప్పిళ్ళు. A clenched hand or fist.

గుప్పెడు *sub.* గుప్పెడు|గుప్పెళ్ళు. Handful of any thing.

గుంజ *sub.* గుంజ|గుంజలు. A pillar. ఇంటి గుంజలు The *pillars* of a house. vide స్తంభం.

గుంజు *sub.* గుంజు|గుంజులు. Inside or substance of fruit. అరటి పండులో గుంజు The *inside* of a plantain.

గుంజులాడడం *v. a.* గుంజులాడుతూ|గుంజులాడి. To wrestle.

గుంట *sub.* గుంట|గుంటలు. A hole. vide గొయ్యి.

గుండ్రన *sub.* గుండ్రని|గుండ్రనలు. Roundness. గుండ్రనిబల్ల A *round* table. ఆ బంతికి గుండ్రన తక్కువ That ball wants *roundness*.

గుండా *adv.* Thro'. ఆ ద్వారంగుండా నేను లోపలికి వెళ్లినాను I went thro' the gate; it is also figuratively used as follows. అతను మహాగుండా మనిషి He is a very thorough fellow.

గుండు *sub.* గుంటి|గుండ్లు. A bullet or ball. తుపాకి గుండు Musket ball. ఫిరంగి గుండు A cannon *ball*.

గుండె *sub.* గుండె|గుండెలు. A heart. గుండెకాయ Item. గుండె means

(figuratively) *fortitude* and *boldness.* అతను మంచిగుండె కలవాడు He is a man of a *stout heart.* అలాగంటి పనిచెయ్యడానకు నాకు గుండె వున్నదా? Have I the *boldness* to do such a thing?

గుమ్మడి పురుగు *sub.* గుమ్మడి పురుగు।గుమ్మడి పురుగులు. A species of butterfly.

గుమాస్తా *sub.* గుమాస్తా।గుమాస్తాలు. An agent; commonly called *Gomastah* in India.

గుమ్మి *sub.* గుమ్మి।గుమ్ములు. A granary.

గుంపు *sub.* గుంపు।గుంపులు. A knot. ఆ కర్రకు చాలా గుంపులు వున్నవి. There are a great many *knots* in that wood. This word is applied to our meaning of band or assemblage. దొంగల గుంపు A *knot* of thieves. మనుష్యులగుంపు An *assemblage* of people. పశువుల గుంపు A *number* or *parcel* of cattle.

గుఱ్ఱం *sub.* గుఱ్ఱపు।గుఱ్ఱములు. A horse. గుఱ్ఱపు పిల్ల A *foal.* గుఱ్ఱం తొక్కడం A *horse* to *step out.* గుఱ్ఱపు డెక్క A *horse's hoof.* గుఱ్ఱపు లద్ది *Horse-dung.* గుఱ్ఱపు సాల *Horse stable.*

గురి *sub.* గురి।గురులు. An aim; a sight. గురితప్పి పొయ్యేడం To *miss* your *aim.* గురి చూడడం To *take aim.* అతను ఆ గోడమీద గురి చూచినాడు He *aimed* at that wall. ఆ మనిషి అంబు గురిగా వేస్తాడు కాని తప్పిపొయ్యేదు Whenever that man *takes aim,* his arrow never misses the mark. This word also means *esteem* or *respect.* గురి వుండడం To have *esteem.*

గురించి *adv.* Regarding; on account of. అందున గురించి *On that account* or *therefore.* యెందున గురించి? *Wherefore?* on *what account?* యిందున గురించి On this *account*; for *this reason; hence.* అతన్ని గురించి యేమి చేసినావు? What did you do *regarding* him? అందున గురించి యిక్కడికి రాలేదు I did not come here *on that account.* యెందున గురించి అంతదూరం వెళ్లినావు? What was the *reason* you went so far?

గుఱ్ఱు *sub.* గుఱ్ఱు।గుఱ్ఱులు. Snoring. నిద్దరలో గుఱ్ఱుపెడతాడు He *snores*

in his sleep. Figuratively గుర్రుగా వుండడం to be *enraged*.

గురువారం *sub.* గురువారపు|గురువారములు. Thursday.

గురువు *sub.* గురువు|గురువులు. A teacher, both for the instruction of the mind and the care of the soul. vide అయ్యగారు.

గుల్ షబ్ పువ్వు *sub.* గుల్ షబ్ పువ్వు|గుల్ షబ్ పువ్వులు. The *goolshub* flower is long in its leaves, of a white colour, resembling the *hyacinth* but of a much stronger smell. It is commonly used at nights, both by men and women in India: hence its name, as derived from the Persian.

గుల్ల *sub.* గుల్ల|గుల్లలు. An oyster. గుల్ల కర్ర A *hollow stick*. This name is also the general term for *shell*. గుల్ల సున్నం *Shell chunam*. చింత గుల్ల Tamarind in the *shell* or *pod*.

గులాబి పువ్వు *sub.* గులాబి పువ్వు|గులాబి పువ్వులు. A rose.

గువ్వ *sub.* గువ్వ|గువ్వలు. A dove.

గుసగుస *sub.* గుసగుస|గుసగుసలు. A whisper. గుసగుసలాడడం To whisper.

గుహ *sub.* గుహ|గుహలు. A den; a cave. ఆకొండగుహలో పెద్దపులులు వుండవచ్చును There may be royal tigers in the *den* of that hill.

## గూ

గూటం *sub.* గూటపు|గూటములు. A wooden mallet.

గూడ *sub.* గూడ|గూడలు. This is the name of a hollow shaped matting, having strings tied to each end, by which two people take hold and lift water out of any tank or reservoir into a field, or from a lower field into a higher.

గూడు *sub.* గూటి|గూళ్లు. A bird's nest. పిట్టగూడు. Item. This word also means the *small receptacles*, formed in the walls of the houses in India. This word is also applied to the *junnaloo* or *maize* when *heaped* before it is thrashed.

*కూన *sub.* కూన|కూనలు. A large earthen vessel used by washers, and also in family houses. vide బాన.

కూను *sub.* కూని|కూనులు. A hunch or unevenness. కర్రకు కూనులు *Bumps* in wood. కూని వాడు A man with a *hunch-back.* కూని ది A woman with a *hunch-back.*

కూబ *sub.* కూబ|కూబలు. The drum of the ear; the proper name for an owl, more generally called గుడ్ల కూబ.

## గె

గెంటడం *v. a.* గెంటుతూ|గెంటి. To push. నెట్టడం Item.

గెంటు *sub.* గెంటు|గెంట్లు. A push. వాణ్ని ఒక గెంటులో పడవేసినాను I over-threw him with *one push.*

గెల *sub.* గెల|గెలలు. A bunch. అరటి గెల A *bunch* of plantains.

గెలవడం *v. a.* గెలుస్తూ|గెలిచి. To gain; to win. ఆటలో పదిరూపాయీలు గెలిచినాను *I gained* ten rupees at play.

గెలుపు *sub.* గెలుపు|గెలుపులు. Gain. ఆటలో అతనికి యెంతగెలుపు వచ్చినది? How much was his *gain* at play.

## గే

గేదె *sub.* గేదె|గేదెలు. A female buffalo. These animals are used in India, exactly as they use cows.

## గొ

గొగ్గి *sub.* గొగ్గి|గొగ్గులు. Crookedness. గొగ్గి ముత్యం An *uneven* pearl. గొగ్గిపండ్లు *Crooked* teeth. గొగ్గి గా *Crooked; uneven.*

గొట్టం *sub.* గొట్టపు|గొట్టములు. A case; a small box. చుట్టల గొట్టం A box for holding cigars or cheroots. It is made of a bamboo hollowed out and is applied to various other uses. తుపాకి గొట్టం The *barrel* of a musket or fowling-piece.

గొట్టు *adj.* Difficult to remember or to retain. This word is applied to such phrases or lines in composition as are of a cramped nature, and not easily remembered in the repetition. గొట్టు మాటలు *Difficult* words *to remember*. గొట్టుగా Possessing *difficulty*. యీశ్లోకం మహా గొట్టుగా వున్నది This verse is very *difficult*, that is, to remember and repeat.

గొడ్డలి *sub.* గొడ్డలి। గొడ్డండ్లు. A hatchet or axe. గొడ్డలితో కొట్టడం To *hew* or *cleave* with a *hatchet*.

గొడారివాడు *sub.* గొడారివాని। గొడారివాండ్లు. A maker of slippers; a shoe-maker.

గొడ్డు *sub.* గొడ్డు। గొడ్లు. A head of cattle; *barrenness*; *impotence*. అతనికి పది గొడ్లు వున్నవి He has got ten *head of cattle*. గొడ్డు పోతు A man of *impotence*. The term is also erroneously applied to women. గొడ్రాలు A *barren* woman. గొడ్డుటావు A *sterile* cow. గొడ్డు చెట్టు A *barren* tree. గొడ్డు భూమి *Sterile* ground or soil.

గొడుగు *sub.* గొడుగు। గొడుగులు. An umbrella. నేను యెండ తగలకుండా గొడుగు తెచ్చుకున్నాను I have brought the *umbrella* to keep the sun off.

గొణగడం *v. n.* గొణుగుతూ। గొణిగి. To mutter to yourself.

గొంగళి *sub.* గొంగళి। గొంగళ్లు. A sort of rug usually termed *komely* in India. They are very coarse, being made of hair and answer for covering to horses. గొంగళి పురుగు A kind of caterpillar full of hair, the touch of which inflames the skin. *Komely* కంబళి.

గొంతుక *sub.* గొంతుక। గొంతుకలు. The throat.

గొంది *sub.* గొంది। గొందులు. A narrow street; a harbour. యీపట్న ములో సందులు గొందులుచాలా వున్నవి: పెద్దవీధులు లేవు This town has a great number of *lanes* (or small passages), but no principal streets. గాలి వి పరీతంగా [illegible] కొనిపోయి వుంచినారు The wind being very strong they have

taken that vessel into harbour.

గొప్ప *adj*. Great; eminent. గొప్పమనిషి A big man or man of eminence. గొప్పయిల్లు A large house. గొప్పగుఱ్ఱం A big horse. గొప్పతనం Bigness; elevation of rank.

గొయ్యి **sub**. గోతి|గోతులు. A hole. ఆదోవలో గోతులుతవ్వినారు They have dug *holes* in that road.

గొరపం **sub**. గొరపపు|గొరపములు. A curry comb. This word should properly be written కొరపం.

గొఱ్ఱె **sub**. గొఱ్ఱె|గొఱ్ఱెలు. A sheep. గొఱ్ఱెపోతులు or గొఱ్ఱెపోతు A ram. గొఱ్ఱెపిల్ల A lamb. గొఱ్ఱెలు Sheep.

గొల్ల **sub**. గొల్ల|గొల్లలు. A cow keeper or shepherd. గొల్లవాడు *Item*. గొల్లకులం Cowkeeper caste. గొల్లవాండ్లు మేకలను మేపుతూవున్నారు. The *shepherds* are attending the sheep. గొల్లవాండ్లు వెన్నచేస్తారు The *cowkeepers* make butter.

గొలుసు **sub**. గొలుసు|గొలుసులు. A chain. కరిపిణీ గొలుసు A gold chain worn at the wrist.

గొళ్లెం **sub**. గొళ్లెపు|గొళ్లెములు. A hasp, for shutting upon a staple, where padlocks are used.

## గో

గోకడం *v. a*. గోకుతూ|గోకి. To scratch. నావీపు దురదపెట్టుతూవున్నది, గోకు! My back itches, scratch it!

గోటు **sub**. గోటు|గోట్లు. Lace or border. నీలి గోటు A blue *border*. జరిగోటు Narrow *gold lace*. పట్టు గోటు *A silk border*. గోటుగాడు A person of *self sufficiency*.

గోడ **sub**. గోడ|గోడలు. A wall. రాతి గోడ A stone *wall*. మంటి గోడ A mud *wall*.

గోడిగ **sub**. గోడిగె|గోడిగెలు. A mare.

గోడిపెట్టు **sub**. గోడిపెట్టు|గోడిపెట్లు. A blow with the knuckles on the head. మొట్టికాయలు.

గోడు *sub.* గోడు|గోడులు. Circumstance; concern; subject matter. అతని గోడు యేమి? What is the matter with him? అతని గోడు యేమో విచారించు Enquire into his case and see what it is.

గోదు *sub.* గోదు|గోదులు. Gum; paste.

గోదుమలు *sub.* గోదుమలు. (No singular.) Wheat.

గోనె *sub.* గోనె|గోనెలు. A kind of pack-cloth, well known by the name of *gunny*. గోనె పట్టా A piece of *gunny*.

గోండ్రించడం *sub.* గోండ్రిస్తూ|గోండ్రించి. To roar, as a wild beast. ఆ కొండమీద పెద్దపులి గోండ్రించగా విన్నాను I heard a tiger *roaring*, on the top of that hill. గోండ్రించడం is also used for the *noise* made by a person, when vomiting.

గోపురం *sub.* గోపురపు|గోపురములు. The gateway or archway at the entrance of pagodas.

గోమేధికం *sub.* గోమేధికపు|గోమేధికములు. The name of a hard black stone.

గోరింక *sub.* గోరింక|గోరింకలు. The name of the bird, commonly called the *myna*.

గోరింట *sub.* గోరింట|గోరింటలు. Henna or nail-dye plant. It yields a red die, when bruised, which the Indians apply to the nails and palms of their hands, at certain feasts. గోరింట Item. గోరింట దగ్గు The whooping cough.

గోరు *sub.* గోటి|గోళ్ళు. The nail of the finger or toe. పిట్ట గోరు A bird's *claw*. పులి గోరు A tiger's *claw*. పిల్లి గోరు A cat's *claw*.

గోలీ *sub.* గోలీ|గోలీలు. Marbles, with which boys play.

గోవు *sub.* గోవు|గోవులు. A cow. ఆవు Item.

## ఘ

ఘటించడం *v. a.* ఘటిస్తూ|ఘటించి. To happen; to arise; to

accrue. యీ ధర్మకార్యం చేసినందున మీకు చాలా పుణ్యం ఘటిం స్తున్నది By this charitable act of yours, your reputation will *increase* for benevolence.

ఘంట **sub.** ఘంట।ఘంటలు. A bell. These are used, of all sizes, in pagodas and on elephants or bullocks. The *plate* made of a mixed metal on which the Indians strike their hours, better known by the name of *ghurry*. Hence *gunta* is the adopted name for the word *hour*.

ఘనం **sub.** ఘనపు।ఘనాలు. Honour; dignity; honesty.

ఘరషణ **sub.** ఘరషణ।ఘరషణలు. Dispute; contention. ఘరషణ చెయ్యడం To *dispute*; to *contend*. నాతో బాకీ నిమిత్తం ఘరషణ చేసినాడు. He has *disputed* with me, regarding a balance.

# చ

చక్కన **sub.** చక్కన।చక్కనలు. Beauty. ఆ స్త్రీ చక్కన చూడు! Behold the *beauty* of that woman!

చక్కని *adj*. Beautiful; handsome. చక్కని వాడు A *handsome* man. చక్కని ది A *beautiful* girl. చక్కని మాటలు *Agreeable* or *pleasing* speeches. చక్కని తనం *Beauty*.

చకముకిరాయి **sub.** చకముకిరాతి।చకముకిరాళ్ళు. A flint.

చక్రం **sub.** చక్రపు।చక్రములు. A wheel.

చక్కిలిగింత **sub.** చక్కిలిగింత।చక్కిలిగింతలు. A tickling. నాకు చేతిలో చక్కిలిగింత వున్నది I have got a *tickling* in my hand. చక్కిలి గింత పెట్టడం To *tickle*. నాకు చక్కిలిగింత పెట్టకు Do not *tickle* me.

చచ్చిపోవడం *v. n.* చచ్చిపోతూ।చచ్చిపోయి. To die. vide చనిపోవడం.

చచ్చౌకం **sub.** చచ్చౌకపు।చచ్చౌకములు. Squareness. బల్లయొక్క చచ్చౌకం The *squarness* of a table.

చడ్డ *adj*. Bad; wicked. చడ్డతనం Badness; evil. అతనికి చడ్డతనం లేదు There is no *evil* in that man. చడ్డపని A bad action.

చత్త *sub.* చత్త|చత్తలు. Rubbish; dirt. యింట్లో చత్తఅంతా వూడిచి వెయ్యి Sweep out all the *dirt* from the house.

చత్వారం *sub.* చత్వారపు|చత్వారములు. Dimness of sight. అతనికి చత్వారం పట్టినది గనక సులోచనాలు లేనిది వ్రాయలేడు That man is *dim-sighted* and cannot write without spectacles.

చద *sub.* చద|చదలు. A white-ant. చద పురుగు. Item.

చదరంగం *sub.* చదరంగపు|చదరంగములు. The game of *chess.* చదరంగపు పాెలు or కాయలు *Chess-men.* చదరంగపు బలం The *whole* of the *chess-men.* చదరంగం ఆడడం To play at *chess.* చదరంగపు బల్ల A *chess*-board.

చదవడం *v. a.* చదువుతూ|చదివి. To read; to peruse. ఆ మనిషి శానా పుస్తకాలు చదివినాడు గనక మంచి బుద్ధిమంతుడు That man is a man of knowledge, having *read* a great many authors.

చదును *sub.* చదును|చదునులు. Evenness; level. చదును చెయ్యడం To make *even* or *equal.* తోటలో నేల చదును చెయ్యి Make the ground of the garden *level.*

చనిపోవడం *v. n.* చనిపోతూ|చనిపోయి. To die. vide చావడం.

చన్ను *sub.* చన్ను|చన్నులు. The breast; the *teat* of animals. మొగవాడి చన్ను A man's *breast.* ఆడదాని చన్ను A woman's *breast.* కుక్క చన్నులు A bitch's *teat,* &c. &c.

చను మొన *sub.* చను మొన|చను మొనలు. The nipple.

చనువు *sub.* చనువు|చనువులు. Friendship. స్నేహం Item.

చంచలగువ్వ *sub.* చంచల గువ్వ|చంచల గువ్వలు. A turbid dove.

చంద్రకాంత పువ్వు *sub.* చంద్రకాంత పువ్వు|చంద్రకాంత పువ్వులు. The name of a flower. It is of different colours, white, red and yellow, and sometimes of mixed colours. It does not smell well.

చందమామ *sub.* చందమామ|చందమామలు. The moon. The name also of a part cut from the centre of the sprout first issuing from the palmira nut, which the natives eat.

చంద్రుడు *sub.* చంద్రుడి|చంద్రులు. The moon. ఆ స్త్రీయొక్క సొగసైన

ముఖం వెయ్యిచంద్రులవలె వున్నది That woman's beautiful face shines like a thousand *moons*.

చందా *sub.* చందా।చందాలు. Subscription. చందా వెయ్యడం To *subscribe.* అతని పెండ్లి నిమిత్తం చందా వేసినారు They have made a *subscription* for his marriage. చందా కాగితం Subscription paper.

చందువా *sub.* చందువా।చందువాలు. The name given to the *cloth* put to the roofs of houses in India, commonly to the bed-rooms.

చందువా చాప *sub.* చందువా చాప।చందువా చాపలు. This is the fish which we call the *pomfret.* It is extremely delicate and well flavoured. It is thought to resemble the turbot.

చంప *sub.* చంప।చంపలు. The cheek. చంపకాయ A slap on the face.

చంపడం *v. a.* చంపుతూ।చంపి. To kill; to murder. వక మనిషిని చంపినాడు He has murdered a man.

చప్పగా *adv.* Insipid; tasteless. యీ చల్ల చప్పగావున్నది This butter-milk is *tasteless.* యీ పండు చప్పగావున్నది This fruit is *insipid.*

చప్పట్లు *sub.* చప్పట్లు. (No plural.) A clapping of the hands. చప్పట్లు కొట్టడం To clap the hands. కాకిని బెదిరించే నిమిత్తం చప్పట్లు కొట్టినాడు He *clapped* his hands, to frighten away the crow. N. B. The Indians clap the hands sometimes in ridicule, but never in the way of applause, as Europeans are accustomed to do.

చప్పరించడం *v. a.* చప్పరిస్తూ।చప్పరించి. To suck. అతను పటికబెల్లం నోటిలో వేసుకుని చప్పరించినాడు He has taken sugar candy in his mouth and *sucked* it.

చప్పా *sub.* చప్పా।చప్పాలు. A mark or impression, such as is made on cloth. This word has lately been understood to mean *printing,* to which it is not inapplicable. చప్పా వెయ్యడం To *mark* or *print.* బట్టలు చప్పా వెయ్యడం To *mark*

or *print* cloths. కాకితాలమీద చప్పా వెయ్యడం To *mark* or *print* papers.

చప్పుడు *sub.* చప్పుడు|చప్పుళ్ళు. A noise; a disturbance. అక్కడ యేమో చప్పుడు అవుతూవున్నది, విచారించు! Go and see what that *noise* is there!

చమ్మ *sub.* చమ్మ|చమ్మలు. Dampness. యీ కాగితం చమ్మపట్టినది This paper has got *damp*. చమ్మగిలడం To be *damp*.

చమర్చడం *v. n.* చమర్చుతూ|చమర్చి. To be damp; to sweat. vide చమ్మ.

చమట *sub.* చమట|చమటలు. Perspiration. చమట పట్టడం To *perspire*.

చమటకాయ *sub.* చమటకాయ|చమటకాయలు. A prickly heat; lichen.

చమత్కారం *sub.* చమత్కారపు|చమత్కారములు. Dexterity; ingeniousness; subtilty; wit. అతను మాట్లాడేటప్పుడు చమత్కారపు మాటలుఆడి నవ్విస్తాడు His speech is so full of *ingeniousness* and *wit* that he makes all people laugh. చమత్కారి A *dexterous* or *dextrous* person.

చమరడం *v. a.* చమురుతూ|చమిరి. To rub or besmear.

చముడు *sub.* చమిటి|చముళ్ళు. Deafness. చముడు పట్టడం To *become deaf*. చముడు చెట్టు Is the name given to what is commonly called the *milk hedge*. చముడు కాకి Is also the name of a bird commonly called the *crow-pheasant*. The word is often written చవుడు.

చమురు *sub.* చమురు|చముర్లు. Oil or grease of every kind.

చర *sub.* చర|చరలు. A ravaging; ravishing; violating.

చరపడం *v. a.* చరుపుతూ|చరిపి. To spoil; to corrupt. పని చరపడం To *spoil* business. కాగితం చరపడం To *blot* paper. స్త్రీని చరపడం To *defile* a woman.

చర్మం *sub.* చర్మపు|చర్మములు. The skin; a hide. మనిషి చర్మం A man's *skin*. గొడ్డు చర్మం The *hide* of a beast.

చల్ల *sub.* చల్ల|చల్లలు. Butter-milk.

చల్లడం *v. a.* చల్లుతూ।చల్లి. To sprinkle. ఆ పువ్వులమీద కొద్దిగా నీళ్ళు చల్లు *Sprinkle* a little water on those flowers. పన్నీరు చల్లడం To *sprinkle* rose water.

చల్లన *sub.* చల్లని. (No plural.) Coldness or freshness of air. చల్లదనం Item. చల్లని నీళ్ళు *Cold* water.

చలనం *sub.* చలనము।చలనములు. A shaking.

చలమ *sub.* చలమ।చలమలు. A garden well.

చలవ *sub.* చలవ।చలవలు. A bleaching. చలవ చెయ్యడం To *bleach.* చాకలవాడు బట్టలు చలవచేసినాడు The washerman has bleached the clothes. N. B. When this word is written in the plural, it applies to the *cold* in the *human frame,* at the point of death.

చలి *sub.* చలి. (No plural.) A shivering or severe cold. చలి జ్వరం or వూష్ణం *Cold* and fever. చలికాలం The *cold* season. యీవేళ మహా చలిగావున్నది It is very cold to-day.

చలికత్తె *sub.* చలికత్తె।చలికత్తెలు. A companion or friend, as applicable amongst women.

చలికాడు *sub.* చలికాడి।చలికాండ్లు. A companion or friend, as applied amongst men.

చలించడం *v. n.* చలించుతూ।చలించి. To shake. vide కదలడం.

చవటు *sub.* చవటి. (No plural.) A sort of *clayey sand* of the nature of fuller's earth, used by the washing people in India for *cleansing* the *clothes* given to them to wash, and also by dyers to *prepare* the *cloth* before it is painted. This word is also written చవుడు.

చవి *sub.* చవి।చవులు. Taste. మంచిచవి A good taste. చవిగా వుండలేదు The *taste* is not good. చవిచూడడం To *taste.* ఆ పండు చవిచూడు *Taste* that fruit.

చవుక *adj.* Cheap. చవుక వస్తువు. A cheap thing. This word is also written చౌక.

చవులపిల్లి *sub.* చవులపిల్లి।చవులపిల్లులు. A hare.

## చా

చాకరు *sub.* చాకరు।చాకర్లు. A servant.

చాకలవాడు *sub.* చాకలవాడి।చాకలవాండ్లు. A male washer. చాకల కులం The washer caste. చాకలది A female washer.

చాకలి *sub.* చాకలి।చాకండ్లు. A washer. vide చాకలవాడు.

చాకిరీ *sub.* చాకిరి।చాకిరీలు. Service. నాకింద చాకిరీ చేస్తూవున్నాడు He is in my *service.*

చాచడం *v. a.* చాచుతూ।చాచి. To stretch. చెయ్యి చాచి బల్లమీద కాగిదం పుచ్చుకో *Stretch* out your hand and take that paper off the table.

చాట *sub.* చాట।చాటలు. A hand basket. They are made flat and used for winnowing grain and for holding rice and vegetables and other articles in common use.

చాటించడం *v. n.* చాటిస్తూ।చాటించి. To publish or proclaim by beat of tom-tom.

చాటింపు *sub.* చాటింపు।చాటింపులు. Publication by beat of tom-tom. యీ మాట చాటింపు చేయించు Get this *beat* by *tom-tom!* vide ప్రకటన.

చాటు *sub.* చాటు।చాట్లు. A shadow or any thing to obscure the light. It also means *secrecy* or any thing *private.* చాటుమాటు *Secret* or *private* information. చాటు నిలుచోకు *Get* out of the *light*: that is, do not stand as a *shadow* to me. ఆ గోడచాటున నిలుచోకు Do not *stand* in the *shade* of that wall: that is, *behind* the wall.

చాడీ *sub.* చాడీ।చాడీలు. A tale; a story. చాడీలు చెప్పడం To tell *tales.* నామీద చాలా చాడీలు చెప్పినాడు He has *invented* a great number of *tales* against me.

చాత *pre.* By or through; for. యీపని అతనిచాత చెయ్యబడ్డది This business is done *by* him. చాతను Item. నీవు యిందుచాత

యిక్కడికి వచ్చినావు? *For* what purpose have you come here?

చాందినీ *sub.* చాందినీ। చాందినీలు. Cloths fixed to the roofs of houses. vide చందువా.

చాప *sub.* చాప। చాపలు. A fish. చాపల వాడు A *fisherman.* చాపలు పట్టడం To catch *fish.* చాపవేట *Fishing.* పల్లెవాండ్లు చాపలవేట నిమిత్తం వెళ్లినారు The *fishermen* have gone to *fish.*

చాప *sub.* చాప। చాపలు. A mat. యీ చాపమీద చాప వేయ్యి Put the fish upon this *mat.* తెరచాప The *sail* of a ship.

చాయ *sub.* చాయ। చాయలు. Paint; shadow. పాలకి చాయ బాగావున్నది The *paint* of the palanquin is very good. మేము కుంపిణీవారి చాయను వున్నాము I live under the company's *shadow*: that is, their *protection.*

చారు జామా *sub.* చారుజామా। చారు జామాలు. A pad, used in the room of a saddle by the Indians.

చాలడం *v. n.* చాలుతూ। చాలి. To suffice. నీవు యిచ్చిన సొమ్ము నాకు చాలుతున్నది The money you have given me will *suffice.*

చాలదు *adv.* Insufficient. మీరు యిచ్చినసొమ్ము చాలదు The money you have given is *not enough.*

చాలా *adj.* Plenty. చాలామంది Plenty of people. చాలా పళ్లు A *great quantity* of fruit.

చాలు *sub.* చాలు। చాళ్లు. A furrow; destiny. నాగటి చాళ్లు Plough *furrows.* యింటి చాలు *Fortune* or *destiny* of a house. దాని యింటిచాలు యెప్పటికీ ఆడపిల్లలు కలిగే మరియాద It was the *destiny* of her house to bring forth nothing but girls.

చాలును *adv.* Enough. మీరు అన్న మాట చాలును What you have said is *enough.*

చావడం *v. n.* చస్తూ। చచ్చి. To die. vide చనిపోవడం.

చావడి *sub.* చావడి। చావళ్లు. The hall in a house; the *cutwal's choultry.* అతను యింట్లో చావట్లో కూర్చుండి వున్నాడు He is sitting in the *hall* of his house. నిన్నటి రాత్రి కొత్వాలు చావట్లో యెందరు దొంగలను తెచ్చినారు? How many thieves were

put in the *cutwal's choultry* last night?

చావు ***sub.*** చావు।చావులు. Death; decease; demise.

## చి

చిక్కడం *v. n.* చిక్కుతూ।చిక్కి. To grow lean; to secure; to hold fast. ఆ మనిషి మహా చిక్కినాడు That man has *got* very *lean.* ఆ దొంగ నాకు చిక్కినాడు I could *secure* that thief. పిట్ట నా చేతిలో చిక్కినది I have got *hold of* a bird in my hand.

చిక్కన ***sub.*** చిక్కన।చిక్కనలు. Thickness. కాగిదపు చిక్కన *Thickness* of paper. బట్ట చిక్కన *Thickness* of cloth.

చిక్కని *adj.* Thick. చిక్కని కాగిదం Thick paper. చిక్కని తనం *Thickness.*

చిక్కం ***sub.*** చిక్కపు।చిక్కములు A small net to hold birds or grass.

చిక్కంటు ***sub.*** చిక్కంటి।చిక్కంట్లు. The name of a species of comb with only four or five large teeth, with a long handle to lay hold of and is used for the purpose of separating the hair, in order to make it into plats or plaits.

చికిలించడం ***sub.*** చికిలిస్తూ।చికిలించి. To neigh. ఆ గుర్రం మహా చికిలిస్తున్నది That horse *neighs* very much.

చికిలింపు ***sub.*** చికిలింపు।చికిలింపులు. A neigh or neighing.

చికిలిగర్ ***sub.*** చికిలిగర్।చికిలిగర్లు. A *chickeldar;* properly speaking, a *knife-grinder.* చికిలిగర్ కత్తి తోమినాడా? Has the *chickeldar* ground the knife?

చిక్కు *adj.* Entangled. తలవెంట్రుకలు చిక్కు పడ్డవి My hair has got *entangled.*

చిక్కుడు కాయ ***sub.*** చిక్కుడు కాయ।చిక్కుడు కాయలు. Country beans.

చిగర్చడం ***v. n.*** చిగుర్చుతూ।చిగిర్చి. To bud; to shoot out leaves.

ఆచెట్టు చిగిర్చినదిగాని ఆకులు పెద్దవి కాలేదు That tree has *shot forth* the young leaves which have not yet come to any size.

చిగురు *sub.* చిగురు or చిగుటి|చిగుళ్లు. A young leaf; a shoot. మామిడి చిగుటిమీద పురుగు వున్నది There is a worm upon that *young* mango *leaf*. This word also means the *gums* and also the tender part of the *flesh* under the nail. పంటి చిగురు The gum. గోటి చిగురు The fleshy part of the *nail.*

చిట్లడం *v. n.* చిట్లుతూ|చిట్లి. To split; to crack. అద్దం చిట్లినది The looking-glass is *cracked.* కలం చిట్లినది The pen is *split.*

చిటిక వెయ్యడం *v. a.* చిటిక వేస్తూ|చిటిక వేసి. To snap with the fingers.

చిటికిన వేలు *sub.* చిటికినవేలి|చిటికినవేళ్లు. The little finger. కాలి చిటికిన వేలు The *littte toe.*

చిత్తా *sub.* చిత్తా|చిత్తాలు. This is a revenue term implying a *daily account* or *account particulars.*

చిడిముడి *sub.* చిడిముడి|చిడిముడిలు. Anger. వారి యిద్దరిలో కొంచం చిడిముడి పుట్టినది Those two people have got a little *angry.*

చితకడం *v. n.* చితుకుతూ|చితికి. To burst. పండు చెట్టుమీద నుంచి పడి చితికినది The fruit fell from the tree and burst. కురుపు చితకడం A boil to burst or break.

చిత్తం *sub.* చిత్తపు|చిత్తములు. Mind; liking; choice. మీ చిత్తం As you *please.* N. B. This word is very frequent in replying to a person and means as often a *cheerful* as a *reluctant* assent.

చిత్తరువు *sub.* చిత్తరువు|చిత్తరువులు. A picture or drawing. చిత్తరువు వ్రాయడం To *draw*; to *delineate*; to *paint.*

చిత్రిక *sub.* చిత్రిక|చిత్రికలు. A carpenter's plane. చిత్రిక పట్టడం To *plane.* వడ్రవాండ్లు బల్లకు చిత్రిక బాగా పట్టినారు The carpenters have *planed* that table very nicely. పుస్తకాల్లో చిత్రిక వెయ్యడం To put *marks* in the palm-leaf books. These are

small *bits* of *palm-leaf*, placed between the leaves as marks.

చిత్తు *sub.* చిత్తు|చిత్తులు. A foul draft or copy; a blot; erasure. చిత్తు కాగిదం A *foul draft.* యీ మాట చిత్తులో వున్నది This word is in the *foul copy.* కాగిదంలో చిత్తులు *Blots* or *mistakes* in paper.

చిన్న *adj.* Small or little; young. చిన్న పిల్ల A *young* child. చిన్న తనం *Youth.* చిన్నది A *small* thing; a *young* girl. చిన్న వాడు A *young boy* or *lad.*

చినుకు *sub.* చినుకు|చినుకులు. A drop. వర్ష పు చినుకు A *drop* of rain.

చిన్నె *sub.* చిన్నె|చిన్నెలు. Mark; turn of countenance. వాడి ముఖంమీద దొంగ చిన్నెలు అగపడలేదు His *countenance* does not betray the *marks* of a thief.

చించడం *v. a.* చించుతూ|చించి. To tear. బట్ట చించడం To *tear* cloth.

చింత *sub.* చింత|చింతలు. The tamarind tree. చింత చెట్టు Item. చింత పండు *Tamarind* fruit or *tamarinds.* చింత కాయ Unripe *tamarinds.* చింత తోట A *tamarind* garden. చింత గుల్ల The *shell* or *pod* of the *tamarind.* This word when used as a Sanskrit derivative means affliction, sorrow, or vexation. చింత చెయ్యడం To feel grief or vexation. చింతగా Sorrowfully; afflictingly. మీరు చింత చెయ్యవద్దు Do not be *grieved.* In this sense the word is Sanskrit.

చిప్ప *sub.* చిప్ప|చిప్పలు. A shell; any small concave vessel to hold liquids. ఆ కొబ్బరి చిప్పలో నెయ్యి వేసి తీసుకురా Put ghee in that *coconut shell* and bring it here. వెలగ చిప్ప A shell of the *velaga* fruit. వెలగపండు Wood apple.

చిమ్మడం *v. a.* చిమ్ముతూ|చిమ్మి. To squirt; to spurt out. వాడిమీద రక్తం చిమ్మినాడు The blood has *spurted out* upon him.

చిమ్మట *sub.* చిమ్మట|చిమ్మటలు. A moth.

చింబోతు *sub.* చింబోతు|చింబోతులు. A he-goat. vide మేక.

చిరగడం *v. n.* చిరుగుతూ। చిరిగి. To tear; to wear out. ఆ బట్ట చిరిగి వున్నందున కట్టుకోవడానకు పనికిరాకుండా వున్నది That cloth is so *torn* and *worn* that there is no further use for it.

చిరత *sub.* చిరత। చిరతలు. A cudgel used for exercise and practice. చిరత చెయ్యడం To play at *cudgels.* This word also means the *round piece of wood* put into the end of a description of boats called *sangarees.*

చిరత పులి *sub.* చిరత పులి। చిరత పులులు. The cheetah; a fierce animal of the cat kind, half as big as royal tiger.

చిరివేరు *sub.* చిరివేటి। చిరివేళ్లు. The chaya-root or shaya-root which produces a red die.

చిరుగు *sub.* చిరుగు। చిరుగులు. A hole in cloth. ఆ బట్టనిండా చిరుగులు వున్నవి That *cloth* is full of *holes.*

చిలక *sub.* చిలక। చిలకలు. A parrot.

చిలకరించడం *v. a.* చిలకరిస్తూ। చిలకరించి. To sprinkle. vide చల్లడం.

చిలకరింపు *sub.* చిలకరింపు। చిలకరింపులు. A sprinkling.

చిల్లర *adj.* Sundry. చిల్లర వస్తువులు Sundry articles.

చిల్లి *sub.* చిల్లి। చిల్లులు. A small hole.

చివకడం *v. n.* చివుకుతూ। చివికి. To spoil by dampness; to get damaged. కర్ర నీళ్ళలో చాలాదినములు వుండి చివికినది That piece of wood is *spoiled* by being too long in the water.

చివర *sub.* చివర। చివరలు. An end. vide కడ.

## చీ

చీకటి *sub.* చీకటి। చీకట్లు. Darkness.

చీకురువాయి *sub.* చీకురువాయి। చీకురువాయిలు. A cricket. ఒక దినుసు గబ్బిలము.

చీటి *sub.* చీటి। చీట్లు. A note, usually called *chit* in India.

చీదడం *v. a.* చీదుతూ। చీది. To blow the nose. ముక్కు చీదడం Item.

చీదర *sub.* చీదర। చీదరలు. Perplexity; distraction of mind.

చీపురు కట్ట *sub.* చీపురు కట్ట। చీపురు కట్టలు. A broom.

చీమ *sub.* చీమ। చీమలు. An ant. యెఱ్ఱ చీమ A red *ant.* నల్ల చీమ A black *ant.* కొండ చీమ The large black *ant.*

చీము *sub.* చీము. (No plural.) Matter; pus. ఆ కురుపులోనుంచి విస్తారం చీము వచ్చినది A great deal of *matter* came from that boil.

చీర *sub.* చీర। చీరలు. A woman's cloth. vide కోక.

చీరడం *v. a.* చీరుతాను। చీరి. To rend; to tear. పెద్ద పులి ఆ మనిషిని చీరినది The tiger has *torn* that man *to pieces.*

చీరిక *sub.* చీరిక। చీరికలు. A remnant or piece of cloth; tatters. చీరికలు చెయ్యడం To *tear* into *pieces* or *wear* into *rags.* అతను బట్టలు కొద్దిదినములకిందటనె వేసుకున్నాడుగాని చీరికలు అయినవి He has *worn* his clothes only a short while ago but they are all in *tatters.*

చీలచడం *v. a.* చీలుస్తాను। చీలిచి. To break asunder; to split; to divide, as wood or leaves.

చీలడం *v. n.* చీలుతాను। చీలి. To divide off; to part company, as people do on a road.

## చు

చుక్క *sub.* చుక్క। చుక్కలు. A dot; a mark; a star. అతను యెప్పటికీ యెఱ్ఱ చుక్క పెట్టుకుంటాడు That man always wears a red *mark.* ఆ గుఱ్ఱం నొసటిమీద తెల్ల చుక్క వున్నది That horse has a white *star* on his forehead. రాత్రి మబ్బుచాతను ఆకాశంమీద చుక్కలు అగపడలేదు This night is so cloudy that the sky does not display a single *star.* చుక్క also means a drop of any liquid. చేరుచుక్క Means a small trinket worn on the forelock of women and children.

చుక్కాని *sub.* చుక్కాని। చుక్కానులు. The helm or rudder of a ship.

చుట్ట *sub.* చుట్ట।చుట్టలు. A roll. పొగచుట్ట A *cheroot,* as it is called in India; literally a *roll* of tobacco, made for smoking. చీనా చుట్ట A *roll* of china silk. This word also means the *round rings* of straw or cloth. చుట్ట కుదురులు which women put on their heads to carry loads and what are under round vessels, to keep them standing.

చుట్టడం *v. a.* చుట్టుతూ।చుట్టి. To roll up; to warp. పాగా మహా బాగా చుట్టినాడు He has *tied* his turban *on* with great taste.

చుట్టం *sub.* చుట్టపు।చుట్టాలు. A relation.

చుట్టరికం *sub.* చుట్టరికపు।చుట్టరికాలు. Relationship; consanguinity. అతనికీ నాకూ యేమిన్ని చుట్టరికంలేదు There is no *relationship* between him and me.

చుట్టు *sub.* చుట్టు।చుట్లు. Circumference. తోటచుట్టు The *circumference* of a garden. బల్లచుట్టు *Round* the table; the *circumference* of a table. బల్లచుట్టూ మనుష్యులు నిలుచున్నారు People are standing *round* the table. చుట్టుబడడం To go *about* or *out* of the way. అతని యింటికి వెళ్లేదానకు దారితెలియక చుట్టుబడి వెళ్లినాను Not knowing the road to his house, I came a *round about* way.

చునాయించడం *v. a.* చునాయిస్తూ।చునాయించి. To plait; to fold. Some Hindoos, in imitation of the Mahometans, plait the sleeves of their vests in a very tasty manner, from the shoulder downwards to the wrist.

చుంచు *sub.* చుంచు।చుంచులు. A mouse. pl. Mice.

చులకన *sub.* చులకన. (No plural.) Lightness; not heavy. పాలకీ చులకనవాత బోయీలు వేగిరం వస్తారు The palanquin boys will come soon, because the palanquin is *light*.

చులకని *adj.* Light; not heavy. చులకని పాలకీ A light palanquin. చులకని తనం Lightness. చులకతనం Item.

చువ్వ *sub.* చువ్వ।చువ్వలు, The name of bamboos, as they are cut in the jungle; *long sticks,* in imitation of bamboo,

which the class of people called *Yerrakaloos* shape out of the stem of the date leaf with which they make up baskets. ఈత చువ్వ Palm leaf *cuttings.* చువ్వ కఱ్ఱ A name given to ***slips of wood*** in imitation of *rattans.*

## చూ

చూడడం *v. a.* చూస్తూ।చూచి. To see; to look. తొంగిచూడడం To *peep.* తిరిగిచూడడం To *look behind* or *back*; to *look again.* వాసన చూడడం To *smell.*

చూపించడం *v. a.* చూపిస్తూ।చూపించి. To shew; to cause another to see. ఆగుఱ్ఱం అతనికి చూపించు *Shew* him that horse.

చూపు *sub.* చూపు।చూపులు. A seeing; a sight. అతనికి దగ్గర చూపు కాని దూరపు చూపులేదు His *sight* answers only for near objects, not for those at a distance.

చూరి *sub.* చూరి।చూరీలు. A small knife. చూరకత్తి A *creese* or small dagger worn by most Hindoos at their girdle.

చూలు *sub.* చూలి।చూళ్లు. Pregnancy; with young. ఆ పశువు చూలుతో వున్నది That cow is *in calf.* చూడి ఆవులను తీసుకురా Bring the *cows* here that are *with calf.* This word is commonly written చూడు.

## చె

చెక్క *sub.* చెక్క।చెక్కలు. A piece. దూలపు చెక్కలు *Pieces* of a beam. వేపచెక్క The *bark* of the margosa or neem tree.

చెక్కడం *sub.* చెక్కుతూ।చెక్కి. To chop; to cut. కలం చెక్కడం To *make* a *pen.* కఱ్ఱ చెక్కడం To *chop* or *shave* wood with a hatchet. చెక్కని కలం A *quill.*

చెకడా *sub.* చెకడా।చెకడాలు. A cart.

చెక్కిలి *sub.* చెక్కిలి।చెక్కిళ్లు. The cheek.

చెట్టు *sub.* చెట్టు।చెట్లు. A tree. It is used also for a ***bush*** and

even smaller productions, such as పన్నీరు చెట్టు A rose *bush*. గోరింట చెట్టు Henna *bush*, of which hedges are made. మిరప చెట్టు A chilly or *chilli plant*. గోగు చెట్టు The *gogoo plant*. చెట్టుమాను The *trunk* of any large tree.

చెడ్డ *adj*. Bad. చెడ్డది A *bad* woman or article. చెడ్డవాడు A *bad* man. చెడ్డ పని A *bad* or *reprehensible* act. చెడ్డ తనం *Badness*; *wickedness*. వాడి చెడ్డతనం వల్లనె వాడు చెడిపోయినాడు He is ruined by his own *wickedness*. చెడ్డ in a figurative sense also means *clever*, *sharp* and *arch*. అతను యిలాటి మాటలు వినడు, మహా చెడ్డవాడు He is a very *sharp*, *clever* fellow and will not listen to such words.

చెదాయించడం *v. a.* చెదాయించుతూ। చెదాయించి. Applied to revenue, implying an *excess* of *assessment* beyond former years.

చెదరడం *v. n.* చెదురుతూ। చెదిరి. To disperse. బలం పోట్లాడలేక చెదిరినది The troops are *dispersed*, not being able to stand the battle.

చెంగు *sub.* చెంగు। చెంగులు. The border or edge of cloth. బట్ట చెంగు Item.

చెప్పడం *v. a.* చెప్పుతూ। చెప్పి. To tell. నాతోటి అలాగు చెప్పినాడు He *told* me so.

చెప్పు *sub.* చెప్పు। చెప్పులు. Sandals.

చెంబు *sub.* చెంబు। చెంబులు. A *chemboo* or what we generally call *fumbo* is a *small round vessel* of brass or other metal, generally of copper, used for drinking out of by the Indians and for washing with.

చెయ్యడం *v. a.* చేస్తూ। చేసి. To do. నీవు యేమి చేస్తావు? What *are you about*? ఆ గుర్రం యేనూరు వరహాలకంటె యెక్కువ చెయ్యదు That horse *will not produce* more than five hundred pagodas. దీపం పెద్ద చెయ్యడం To *put out* a light. This phrase is used, rather than దీపం తియ్యడం because the Hindoos have a superstitious objection to *blow out* a light. రాచెయ్యడం

To *get* by *heart*. కంఠపాఠం చెయ్యడం Item.

చెయ్యక పోవడం *v. n.* చెయ్యకపోతూ। చెయ్యకపోయి. Not to do; not to fulfill.

చెయ్యి *sub.* చేతి।చేతులు. The hand. తాళం చెయ్యి A *key*. అరిచెయ్యి The *palm* of the *hand*. చేతి కట్టు The wrist. మో చెయ్యి The *back* of the *hand*. చెయ్యి జారడం To *let fall* or *slip* from *hand*. చేవ్రాలు *Hand-writing*. చేవ్రాత Item. i. e. *signature*.

చెరగడం *v. a.* చెరుగుతూ।చెరిగి. To winnow. Commonly done with hand-baskets called in India చాటలు.

చెరుకు *sub.* చెరుకు।చెరుకులు. Sugar cane. చెరుకు గడ Item.

చెరువు *sub.* చెరువు।చెరువులు. A reservoir of water commonly called a *tank*, for the purposes of cultivation, or when near a village, for the use of the inhabitants and for cattle to drink out of.

చెల్లు *sub.* చెల్లు।చెల్లులు. A revenue term implying the *collection* of the revenue.

చెల్లెలు *sub.* చెల్లెలు।చెల్లెండ్లు. A younger sister. చెల్లి Item.

చెవి *sub.* చెవు।చెవులు. The ear. తాళంచెవి A *key*.

# చే

చేత *sub.* చేత।చేతలు. Workmanship. ఆ కంసాలి చేసిన చేత మహా బాగా వున్నది The *workmanship* executed by that goldsmith is very excellent. నగల చేత *Workmanship* of jewels.

చేదడం *v. a.* చేదుతూ।చేది. To draw; to wind. నూతిలోనుంచి నీళ్లు చేదుతున్నారు They are *drawing* water from the well. నూలు చేదడం To *wind* thread.

చేదు *sub.* చేదు।చేదులు. Bitterness. వేపాకు చేదు The *bitterness* of the margosa leaf. చేదుగా *Bitterly*.

చేను *sub.* చేని।చేనులు or చేలు. A crop; the cultivation. జొన్న చేను

A jonna *crop* or *field.* వరిచేను A *field* of paddy; and so for all other grains. చేను కాటుక పట్టడం The *grain* to get *mildewed.* This is applicable only to grain.

చేరడం *v. n.* చేరుతూ। చేరి. To arrive; to receive; to reach. నిన్న ను ఆ వూరికి చేరినాను I *arrived* yesterday at that town. ఆ వస్తువు నాకు చేరినది That thing has *reached* me.

చేరువ *adj.* Near. మీ యిల్లు యిక్కడికి చేరువా? దూరమా? Is your house *near* or *far* from hence?

చేష్ట *sub.* చేష్ట। చేష్టలు. Behaviour; manners. వాడి చేష్టలు మంచివి కావు. His *manners* are disagreeable.

# చై

చైత్రం *sub.* చైత్రపు। చైత్రాలు. One of the Telugu months, nearly answering to the month of April.

# చొ

చొట్ట *adj.* Lame; limping. written సొట్ట. vide కుంటి.

చొట్టు *sub.* చొట్టు। చొట్లు. A dent. ఆ తపేలాకు చాలా చొట్లు వున్నవి There are several *dents* in that brass pot. The word is commonly written సొట్టు.

చొంగ *sub.* చొంగ। చొంగలు. Saliva. vide చొల్లు.

చొప్ప *sub.* చొప్ప। చొప్పలు. Jonnaloo straw.

చొప్పన *adv.* Agreeable to; according. యీ చొప్పన చెయ్యి Act in *this manner*; do *accordingly.* మీ ఆజ్ఞ చొప్పన నేను అక్కడికి వెళ్లినాను *Agreeable* to your order, I went there.

చొరపడడం *v. a.* చొరపడుతూ। చొరపడి. To break into a house or penetrate into a place. ఆ యింట్లో చొరపడ్డాడు He has *broken* into that house. వాణ్ని కొట్టవస్తే ఆ మనుష్యులలో చొర పడ్డాడు When they came to beat him, he *ran* and *mix*ed

*amongst* those people.

చొరవ *sub.* చొరవ|చొరవలు. Confidence; firmness. ఆ దొరదగ్గిర మనవి చెయ్యడానకు అతనికి చొరవ తక్కువ లేదు He does not want for *confidence*, to state his case to that gentleman.

చొల్లు *sub.* చొల్లు|చొల్లులు. Saliva or spittle. వాడి నోటివెంబడిన్ని చొల్లు కారుతూ వున్నది The *saliva* comes from his mouth. కుక్క చొల్లు The *saliva* of a dog.

## చో

చోటు *sub.* చోటు|చోట్లు. Place; situation. అన్ని చోట్లు *Every where.* vide స్థలం.

చోద్యం *sub.* చోద్యపు|చోద్యములు or చోద్యాలు. A curiosity. యిలాటి చోద్యాలు యెక్కడా చూడలేదు I never saw such *curiosities* any where. చోద్యపు వస్తువులు *Curious* articles or *curios.*

చోరుడు *sub.* చోరుడి|చోరులు. A thief. vide దొంగ. pl. Thieves.

చోళ్లు *sub.* చోళ్ల. (No singular.) The name of a small grain, more commonly called *natcheny.*

## చౌ

చౌకి *sub.* చౌకి|చౌకీలు. The name given to a *place* appointed for *watchers*; the place appointed for *collecting duties.* సాయరు చౌకి A *custom house.* చౌకీ వుండడం To be on *watch.* చౌకీ దారుడు A *custom officer*; a *watcher.* చౌకి means a *wooden stool* used by the Indians instead of chair principally to sit upon, whilst they wash themselves.

చౌతా *sub.* చౌతా|చౌతాలు. A litter, more generally called *dooly* or *doolie.*

# జ

జగడం *sub.* జగడపు।జగడములు. A quarrel; dispute. జగడమాడడం To quarrel.

జట్టి *sub.* జట్టి।జట్టీలు. Handsel. పదిపుట్ల ధాన్యానకు కరారుచేసి జట్టీ పుచ్చుకున్నాడు I have made an agreement with him for ten candies of paddy, for which he has received the *handsel.*

జట్టు *sub.* జట్టు।జట్లు. An assemblage or body of people. vide గుంపు.

జడ *sub.* జడ।జడలు. A plat or plait of the hair. This word also means the *pod* in plants, when they have grown into seed.

జడిపించడం *v. a.* జడిపిస్తా।జడిపించి. To threaten; to frighten; to alarm.

జడియడం *v. n.* జడుస్తా।జడిసి. To fear.

జడుపు *sub.* జడుపు।జడుపులు. Fear; affright. చీకట్లో సంగీతం పాడుకుంటూ వెళ్లుతాడు గనక అతనికి జడుపులేదు Being dark, he goes along singing and is not *afraid.*

జత *sub.* జత।జతలు. A pair; a set. జత యెద్లు A *pair* of oxen. జత గుర్రాలు A *pair* of horses.

జనం *sub.* జనపు. (No plural.) Population or community. యీ వూళ్లో జనం విస్తారం వున్నది There is a great *concourse* of *people* in this town. జనాంగం Item.

జనుము *sub.* జనపు।జనుములు. The *junnam* or *jute.* A plant from which a coarse hemp is made in India. జనపనార The fibres of the *junnam* of which the hemp is made.

జంకడం *v. n.* జంకుతా।జంకి. To fear. అతన్ని చూడడానకు జంకినాను I was afraid to see him.

జంగమం *sub.* జంగమం।జంగమాలు. Any moveable article. యింట్లో జంగమాలు *Household articles.*

జంగం *sub.* జంగం।జంగాలు. A tailor; accepted term from the name of the caste.

జండా *sub.* జండా।జండాలు. A flag, usually termed *junda.* జండా కట్టడం To hoist a *flag.*

జంధెం *sub.* జంధెపు।జంధేలు or జంధెములు. The *string* worn by the brahmins or *kshatriyas* and banians and by other castes. vide వడుగు.

జపం *sub.* జపపు।జపములు. A prayer observed by the brahmins. ఆ బ్రాహ్మడు స్నానంచేసి జపం చేస్తున్నాడు That brahmin having made his ablutions is repeating the *jappum.* జప మాలికం *Praying beads* or *rosary.*

జప్తి *sub.* జప్తి।జప్తీలు. Sequestration. జప్తి చెయ్యడం To sequester.

జబ్బ *sub.* జబ్బ।జబ్బలు. The arm.

జబ్బు *sub.* జబ్బు।జబ్బులు. Negligence; carelessness. అతను ఆపనిలో జబ్బు చేసినాడు గనక చెడిపోయినది Owing to his *carelessness* that business has been spoiled.

జమ *sub.* జమ।జమలు. A revenue term signifying *collections.* జమ చెయ్యడం To make the *collections.* జమా బంది The *settlement* or *fixed assessment* of the revenue. జమా ఖర్చు Account of receipts and disbursements. జమా, వసూలు, బాకీ Demand, collection and balance.

జమీ *sub.* జమీ।జమీలు. A zemindary: properly, the *ground* or *land;* generally understood for the *district* of a *zemindar.* జమీదారుడు A *zemindar.*

జయం *sub.* జయపు।జయములు. Success; advantage. ఆ పనిలో మీకు జయం కావలెనని కోరుతాను I wish you may have every possible *success* in that concern.

జయించడం *v. a.* జయిస్తూ।జయించి. To be successful; to succeed; to reap *advantage.* ఆయుద్ధం వారు జయించినారు They had the *advantage* in that battle.

జరగడం *v. a.* జరుగుతూ।జరిగి. To act; to do. మీ హుకుంప్రకారం

పని జరుగుతున్నది The business *goes on* according to your orders.

జరపడం *v. a.* జరుపుతూ।జరిపి. To put off; to defer; to postpone. నా బాకీ అడిగితే దినములు జరుపుతున్నాడు గాని యిదివరకు యివ్వలేదు I have asked him for my balance, but he *puts* me *off* daily, and to this time has not paid me. N. B. This word also means to *shove* or *move* any thing away. బల్ల జరపడం To *push* the table *on*.

జరిగించడం *v. a.* జరిగిస్తూ।జరిగించి. To cause to act. మీరు చెప్పినపని అతనిచేత జరిగిస్తాను I shall *cause* that person to *execute* the business which you mentioned.

జరీ *sub.* జరీ।జరీలు. Gold thread or lace. జరీ తాడు Item. N. B. This word is generally called జలతారు but not correctly so. జరీ గోటు *Narrow gold lace.*

జరీబు *sub.* జరీబు।జరీబులు. The small rents, or contracts for tobacco, chillies, &c.

జరూరు *sub.* జరూరు।జరూర్లు. Necessity; occasion. ఆవస్తువు నాకు జరూరు లేదు I have no *occasion* for that article.

జల *sub.* జల।జలలు. A spring of water. నీళ్ల జల Item.

జలగ *sub.* జలగ।జలగలు. A leach.

జల్లించడం *v. a.* జల్లించుతూ।జల్లించి. To sift grain or any thing.

జల్లు *sub.* జల్లు।జల్లులు. A shower. వర్షపు జల్లు A *shower* of rain.

జలుబు *sub.* జలుబు।జలుబులు. A *cold*; the complaint of that name. జలుబు చెయ్యడం To take *cold* or to *catch* cold.

జల్లెడ *sub.* జల్లెడ।జల్లెడలు. A sieve.

జ్వరం *sub.* జ్వరపు।జ్వరములు. Fever. చలిజ్వరం *Fever* and cold.

జవ్వాది *sub.* జవ్వాది।జవ్వాదులు. Civet. జవ్వాది పిల్లి A *civet* cat; from which the *civet* is obtained.

జవాబు దారుడు *sub.* జవాబుదారుని। జవాబుదార్లు A surety; the person responsible.

## జా

జాగ్రత *sub.* జాగ్రత|జాగ్రతలు. Carefulness. అతని జాగ్రత నాకు బాగా తెలిసినది His *carefulness*, I am well acquainted with. జాగ్రత మనిషి A *careful* man. అజాగ్రత *Carelessness.* అతి జాగ్రత Extreme *carefulness.* జాగ్రత చెయ్యడం To be *careful*; to *take care.* జాగ్రతగా *Carefully.* మహా జాగ్రతగా నడుచుకుంటూ వున్నాడు He conducts himself very *carefully.*

జాగా *sub.* జాగా|జాగాలు. A place.

జాగీరు *sub.* జాగీరు|జాగీర్లు. A revenue term, signifying *free gift land.*

జాగు *sub.* జాగు|జాగులు. Delay. జాగు చెయ్యడం To make delay.

జాజికాయ *sub.* జాజి కాయ|జాజికాయలు. Nutmeg.

జాడ *sub.* జాడ|జాడలు. Haunt; place of resort. అతను యెక్కడికి పోయినాడో అతనిజాడ నేను యెరగను I do not know where he is gone to or where his *place of resort* is. ఆ కొండమీద పెద్ద పులులు వున్నజాడ నాకు తెలిసినది I know that hill to be the *haunt* of royal tigers.

జాతకం *sub.* జాతకపు|జాతకములు. A register of birth which is in fact a *horoscope*, in the manner they are executed in India. This being attended with trouble and expense, hence follows the ignorance of most of Indians as to their age.

జాతి *sub.* జాతి|జాతులు. Caste; tribe. బ్రాహ్మణ జాతి Brahminy *caste.* జాతివాడు A general term given for *Europeans.* జాతి is the same in other respects as కులం.

జాతియ్యం *sub.* జాతియ్యపు|జాతియ్యములు. Mode of speech; phraseology as applicable to some particular people or caste. ఈ హాస్యగాడు అనేక జాతియ్యములు చెప్పుతున్నాడు This *mimic* takes off the *technical terms* and *manners* of *speech*

of a number of people.

జ్ఞాపకం **sub.** జ్ఞాపకపు|జ్ఞాపకములు. Remembrance; recollection. ఆమాట నాకు జ్ఞాపకం లేదు I have no *recollection* of that speech. జ్ఞాపకం చెయ్యడం To *remind* one. అక్కడికి వెళ్ళమని అతనికి జ్ఞాపకం చెయ్యి *Remind* him of going there.

జాన **sub.** జాన|జానలు. A span. జానెడు Item. This is considered in extent from the thumb to the end of the little finger.

జాపత్రి **sub.** జాపత్రి. (No plural.) Mace; a spice.

జాబితా **sub.** జాబితా|జాబితాలు. A list; enumeration.

జాబు **sub.** జాబు|జాబులు. A letter. vide వృత్తరం.

జామ పండు **sub.** జామ పంటి|జామ పళ్ళు. The guava fruit. జామ చెట్టు The *guava tree*.

జామీను **sub.** జామీను|జామీనులు. Security.

జారడం **v. n.** జారుతూ|జారి. To slide; to slip. నా కాలు బురదలో జారినది My foot *slipt* on account of the mud. చెయ్యి జారడం To let *fall* or *slip* from hand.

జారత్వం **sub.** జారత్వపు|జారత్వములు. Incontinence; slipperiness.

జారుడు **sub.** జారుని|జారులు. A libertine; a debauched character.

జాలరు **sub.** జాలరు|జాలర్లు. Net-work; fringe. జాలరుకన్ను The ***mash***; literally, the *eye* of a *net*.

జాలి **sub.** జాలి|జాలులు. Pity; commiseration. అతని శ్రమ చూచే టప్పటికి నాకు చాలా జాలి పుట్టినది When I contemplated the difficulties of that man, I felt great *compassion* for him.

జాలె **sub.** జాలె|జాలెలు. A small net or purse.

జావ **sub.** జావ|జావలు. A drink, so called by the Indians, made of rice or wheat boiled down to a liquid.

జాహీరు **sub.** జాహీరు|జాహీర్లు. A representation. జాహీరు చెయ్యడం To *represent*. మీ చిత్తానకు యీ సంగతి జాహీరు చేసినాను I have *obtruded* this *circumstance* on your mind.

## జి

జిగట *sub.* జిగటు|జిగటలు. Paste or gum. vide జిగురు.

జిగి *adj.* Strong. జిగిపని Substantial work.

జిగురు *sub.* జిగురు|జిగుళ్లు. Paste or gum. జిగురు రాయడం To rub *paste.*

జినస్సు *sub.* జినస్సు|జినస్సులు. A thing; an article. అమ్మివేసే జినస్సు *Articles* for sale.

జిరాయతి *sub.* జిరాయతి|జిరాయతీలు. A revenue term signifying the cultivation. జిరాయతి భూమి Land under cultivation; circar land.

## జీ

జీడిగింజ *sub.* జీడిగింజ|జీడిగింజలు. The marking nut.

జీతం *sub.* జీతపు|జీతాలు. Pay. నెల జీతం Monthly pay.

జీను *sub.* జీను|జీనులు. A saddle.

జీర *sub.* జీర|జీరలు. A crack; a flaw. ఆ వజ్రంలో జీర వున్నది There is a *flaw* in that diamond.

జీలకర్ర *sub.* జీలకర్ర. (No plural.) Cumin seed. మసాలాలోకి జీలకర్ర తెప్పించు Get some cumin seed to mix with the curry stuff. నల్ల జీలకర్ర Black cumin seed.

జీవనం *sub.* జీవనపు|జీవనములు. Life; means of subsistence. మాదొర యిక్కడ లేనందున నాజీవనం పోయినది My master not being here, I have lost my *means* of *subsistence.*

జీవం *sub.* జీవపు|జీవములు. The soul.

జీవించడం *v. a.* జీవిస్తా|జీవించి. To subsist; to exist.

## జు

జుట్టు *sub.* జుట్టు|జుట్లు. A name given to the tuft of hair, which Indians keep on the top of their heads. జుట్టుముడి The knot

of the hair, in which this tuft is always tied.

జున్ను **sub.** జున్ను।జున్నులు. Cheese.

జులుం **sub.** జులుం।జులుములు. Force; oppression. జులుం చెయ్యడం To oppress; to distress. అతను జులుంచేసి నాదగ్గిర శానా సొమ్ము పుచ్చుకున్నాడు By dint of *oppression,* he has extorted a great sum of money from me.

జులుమానా **sub.** జులుమానా।జులుమానాలు. A fine; A forfeiture.

జువ్విచెట్టు **sub.** జువ్విచెట్టు।జువ్విచెట్లు. The *joovy* tree; it resembles the *banian* tree.

## జూ

జూజం **sub.** జూజపు।జూజములు. Play or gambling; gaming. అతను పనికిమాలినవాడు గనక యెప్పటికి జూజం ఆడుతాడు He is a good for nothing fellow, for he is ever engaged in *gambling.* జూజగాడు A gambler. జూదం Item.

## జె

జెడ్డ **sub.** జెడ్డ।జెడ్డలు. A small branch. The *mark* made to Telugu letters, to show the emphasis is called *jedda.* ఆ చెట్టుకొమ్మకు చాలా జెడ్డలు వేసినవి The bough of that tree has thrown out a number of *smaller branches.*

జెఱ్ఱి **sub.** జెఱ్ఱి।జెఱ్ఱులు. The centipede; a reptile with many legs.

## జే

జేగంట **sub.** జేగంట।జేగంటలు. A round flat plate made of mixed metal, which the Indians beat at their religious festivals.

జేగురు **sub.** జేగురు।జేగుర్లు. Red earth which the Indians commonly rub on their houses, both inside and outside.

జేంద్రవాడు **sub.** జేంద్రవాని।జేంద్రవాండ్లు. A particular caste of

weavers, so called in India. The word జాండ్రవాడు is commonly used. జేండ్రవాడు Item.

జేబు **sub.** జేబు|జేబులు. The pocket of a vest.

జ్యేష్ఠం **sub.** జ్యేష్ఠము|జ్యేష్ఠాలు. One of the Telugu months, nearly answering to the month of june.

## జొ

జొన్న **sub.** జొన్న|జొన్నలు. The jonna grain, commonly termed jonnaloo. జొన్నచేను Jonnaloo crop. మొక్కజొన్న Mocca-jonnaloo or maize.

## జో

జోకొట్టడం *v. a.* జోకొట్టుతూ|జోకొట్టి. To pacify; to pat children to make them quiet. పిల్ల యేడుస్తూవున్నది గనక జోకొట్టినారు As the child was crying, they ***patted*** it to ***make it quiet.***

జోగి **sub.** జోగి|జోగులు. A vagrant or vagabond; properly speaking, a ***beggar***.

జోడు **sub.** జోడి|జోళ్లు. A pair. చెప్పులజోడు A ***pair*** of slippers or shoes.

జోరావరి **sub.** జోరావరి|జోరావరీలు. Force; compulsion.

జోరీగ **sub.** జోరీగ|జోరీగలు. The dogfly. It also sticks to cattle.

జోలి **sub.** జోలి|జోళ్లు. Purpose; business; intention; design. అతని జోలి నీకు యేమి? What ***business*** have you with him? నాజోలికి రావద్దు Don't meddle in my ***concerns***; vulgarly, mind your own ***business.***

జోలె **sub.** జోలె|జోలెలు. This means the ***cloth*** which beggars carry with them for receiving the rice or other things given to them.

## ఝు

ఝుంకారం *sub.* ఝుంకారవు|ఝుంకారములు. Gesticulation in testimony of anger; a buzzing or humming. రాజుకు కోపం వచ్చినది గనక అతను ఝుంకారాలు చాలా చేస్తా వున్నాడు The Rajah having put himself in a passion makes a vast number of *angry gesticulations*. తుమ్మెదల ఝుంకారం The humming noise of bees.

## ఝా

ఝాము *sub.* ఝాము|ఝాములు. This is the name of a part of Telugu time considered a quarter of the day or night: that is, *seven* and a *half gurries* of their time. ఝాము రాత్రి The *first quarter* of the night. రెండు ఝాముల రాత్రి *Two quarters* of the night: that is, about *midnight.* మూడు ఝాముల రాత్రి *Three quarters* of the night: that is, about *three o'clock* in the *morning.* తెల్లవారు ఝాము *Day break.* This word ought to be written జాము.

## ఝూ

ఝూలు *sub.* ఝూలు|ఝూళ్ళు. Covering for a horse, called *jool* in India.

## ట

టక్కు *sub.* టక్కు|టక్కులు. Deceit; dissimulation; hypocrisy. అతను నన్ను టక్కుచేసి నావద్ద పది వరహాలు పుచ్చుకున్నాడు He obtained ten pagodas from me by *deceitful* means.

టంకం *sub.* టంకం|టంకములు. A *tunkum*: that is, an imaginary valuation of money, equal to sixteen *dubs* or four *fanams.*

Also a stone cutter's *chissel* or *tool,* with which he models or graves.

టంకసాల *sub.* టంకసాలి|టంకసాలలు. A mint. N. B. The word *tunka* was, anciently, the name of a coin current in India and the rupee is called so at this day, in the *woddia* language.

టప్పా *sub.* టప్పా|టప్పాలు. The post, generally called *tappal* in India. This is established in India by runners from stage to stage which are commonly eight or ten miles distant from each other. టపా బంట్రోతు A *tappal* peon or runner. టపామీద పంపించడం To send by the *tappal.*

టపాకి *sub.* టపాకి|టపాకులు. A sort of cracker made up of a small piece of cadjan leaf in which the powder is compressed and let off from the hand. చీనా టపాకి A China *cracker.*

టలాయించడం *v. a.* టలాయిస్తా|టలాయించి. To delay; to put off. మాబాకీ యివ్వక టలాయిస్తా వున్నాడు He *delays* paying my balance and *puts me off.* నేను అడిగిన మాటలకు జవాబులు యివ్వక రోజు రోజూ టలాయిస్తూ వున్నాడు He *defers* from day to day replying to my questions. vide జరపడం.

## టా

టాకు *sub.* టాకు|టాకులు. A ring, generally made with a flat rim, as a guard to more valuable. వజ్రపు వుంగరం పడిపోకుండా అతను టాకు పెట్టుకుంటూ వున్నాడు He puts on a *taakoo,* or flat-rimmed *ring,* to prevent his diamond ring from falling off. This word also means the *point* or *end* of a *pen.*

## టీ

టీకా *sub.* టీకా|టీకాలు. Inoculation; the small pox, by inoculation. టీకా వెయ్యడం To *inoculate.* vide మశూచికం.

year's accounts. అతను యీ వూళ్లోకి నిరుడు వచ్చినాడు He came *last year* into this village.

నిర్మూలం *sub.* నిర్మూలపు। నిర్మూలములు. Extirpation; destruction. ఆ వూరు తగలబడడంచేత బొత్తిగా నిర్మూలం అయినది That village is involved in complete *destruction* from fire.

నిరోగం *sub.* నిరోగపు। నిరోగములు. Health. యీ వూరు వచ్చిన తరువాత అతనికి నిరోగం అయినది After he arrived in this town, he recovered his *health*.

నిలపడం *v. a.* నిలుపుతూ। నిలిపి. To stop; to arrest; to fix; to desist. ఆ గుర్రాన్ని నిలుపు *Stop* that horse. ఆమాట చెప్పిన తరువాత నేను వ్రాయడం నిలిపినాను After making use of. that speech, I *stopped* writing: that is, *desisted* from writing. యీవేళ పీర్లను నిలిపినారు To-day they have *fixed up* their *peerloo* or *images*.

నిలవడం *v. n.* నిలుస్తూ। నిలిచి. To stay; to remain. యీ వూళ్లో నిలుస్తాను I shall stay in this town.

నిలుచుండడం *v. n.* నిలుచుంటూ। నిలుచుండి. To stand up.

నిలువ *sub.* నిలువ। నిలువలు. The remainder; a balance of account. నాలెక్క సంబంధం నీవద్ద యెన్ని రూపాయీలు నిలువ వున్నవి? What *balance* of rupees have you, in account with me, in your hands? నిలువ వున్న సామాను యిక్కడికి తీసుకుని రా Bring the *remainder* of those things here. It is commonly written నిలవ.

నివాడా *sub.* నివాడా। నివాడాలు. A revenue term, signifying the *settlement* of the revenue or revenue accounts. నివాడా చెయ్యడం To *make* the *settlement*.

నివాసం *sub.* నివాసపు। నివాసములు. Place of residence. మా నివాసం బందరులో My *place* of *residence* is at Masulipatam or Bundar.

నిశ్చయం *sub.* నిశ్చయపు। నిశ్చయములు. Agreement. vide నిర్ణయం.

నిషేక ముహూర్తం *sub.* నిషేక ముహూర్తపు। నిషేక ముహూర్తములు. Consummation of marriage; completion. అతనికి పెళ్ళి అయిన

మూడు సంవత్సరములకు నిషేక ముహూర్తం అయినది *Consummation* took place after he had been married three years.

నిస్సత్తువ *sub.* నిస్సత్తువ। నిస్సత్తువలు. Weakness; inability. యీ మందు తింటే నిస్సత్తువ వచ్చినది The effects produced by this medicine is *weakness.* మునుపు నాకు మహా నిస్సత్తువ వుండెను। యిప్పుడు గుణంగా వున్నది I used formerly to be subject to great *debility,* but have now got strong again.

## నీ

నీ *pro.* Nominative Case, Personal Pronoun. Thy. నీది Thine.

నీచం *sub.* నీచపు। నీచములు. Lowness; without character. అతని పని అంతా నీచంకింద వచ్చినది His business has ended in great *meanness.* అతని యింటికి నేను వెళ్ళితే నన్ను చాలా నీచపుమాటలు ఆడినాడు When I went to his house, he gave me nothing but *low words.* నీచం పెట్టడం or నీచ పరచడం To *despise.* నావద్ద చాలా అబద్ధాలు ఆడినందున అతణ్ణి నేను చాలా నీచపెట్టినాను As he told me a great number of lies, I *entertained* a great *contempt* for him. నీచత్వం Item.

నీచుడు *sub.* నీచుని। నీచులు. A low character; a man of a bad reputation. అతను కోమటి అయివుండి శూద్రకూడు తిన్నందున నీచుడైనాడు Being a banian and having eaten victuals with a *sudra,* he is become a fellow without character.

నీటు *sub.* నీటు। నీటులు. Vanity; pride of dress. నీటు మనిషి A *dressy man*; a *coxcomb.* నీటు గల *Coxcomical*; *foppish.*

నీడ *sub.* నీడ। నీడలు. Shade; shelter from the sun. చెట్టు నీడ The *shade* of a tree.

నీతి *sub.* నీతి। నీతులు. Conscience; uprightness. అతనికి మంచి నీతి వున్నది That man has a good *conscience.* నీతి గలవాడు He is a man of *conscientiousness.* నీతి మాటలు Moral discourses.

నీరు *sub.* నీటి। నీళ్లు. Water. It is commonly used in the plural

number. నాకు దాహానకు నీళ్లు యిప్పించు Give me *water*, to quench my thirst. యేటికి క్రొత్తనీరు వచ్చినది or తగిలినది A body of fresh *water* has come into the river. N. B. When water is mentioned in a large quantity, it is put in the singular number and when in small quantities in the plural. నీళ్ళ బుగ్గ A *water bubble*. నీటి వడి A *torrent*. నీళ్ళ జల A *spring* of water.

నీరుల్లి **sub.** నీరుల్లి. (No plural.) Onions. బజారులోకి విస్తరించి నీరుల్లి అమ్మ వచ్చినది A great quantity of *onions* came into the bazaar for sale. నీరుల్లి కడ్డలు or పాయలు *Onion* plants. vide వుల్లిపాయ.

నీలగడం *v. n.* నీలుగుతూ। నీలిగి. To strut; to walk proudly; to die. యుద్ధంలో నీలగడం To die in battle.

నీలం **sub.** నీలపు। నీలములు or నీలాలు. A sapphire. అతని చెవులను వున్న నీలాలు వేసిన పోగులజోడు మహా కాంతిగా వున్నది The ***sapphires*** in his ear-rings are very bright.

నీలి ***adj.*** Blue. నీలిరంగు. A blue colour. నీలి పాగా A ***blue*** turban. నీలి మందు ***Indigo***. నీలి చెట్టు The ***indigo plant***.

నీవు *pro.* నీ। మీరు. Thou. నీవు యేమి చేసినావు? What hast ***thou*** done? నీ పుస్తకం *Thy* book. మీరు యెక్కడికి వెళ్ళుతారు? Where are *you* going? నీది *Thine*. మీది ***Yours***. ఆ తోట నీది గాని అతనిది కాదు That garden is ***thine*** and not his.

నీళ్ళాడడం *v. a.* నీళ్ళాడుతూ। నీళ్ళాడి. To be in labour; in child-birth or in travail. ఆ చిన్నది నీళ్ళాడి వక కుమారుణ్ని కన్నది That young woman has been ***brought to bed*** and has got a son.

## ను

నుదురు ***sub.*** నుదుటి। నుదుళ్లు. The forehead. నుదుటిమీద పచ్చబొట్టు పొడిచినారు They have marked the ***forehead*** with the

green mark.

నున్నని *adj.* Smooth. నున్నని చెక్కిలి A *smooth* cheek.

నున్నూ *conj.* And. It is always coupled to some words in writing. అతనూ నేనున్నూ He *and* I. యీవేళా రేపున్నూ To-day *and* to-morrow. The word is properly only written న్నూ.

నునుపు *sub.* నునుపు। నునుపులు. Smoothness. బల్ల నునుపు The *smoothness* of a table. గోడ నునుపు The *smoothness* of a wall. నునుపు చెయ్యడం To *make smooth*. నున్నన Item.

నుంచి *pre.* From; since. నేను అక్కడినుంచి నిన్న వచ్చినాను I came here yesterday *from* thence. యిక్కడినుంచి *From* hence. అక్కడి నుంచి *Thence* or *from* thence. శానా దినముల నుంచి *From* a long period back.

నుయ్యి *sub.* నూతి। నూతులు. A well. ఆ నూతిలో నీళ్ళు యేమీ లేవు That *well* has got no water in it. గాడి నుయ్యి A *well* with a channel to it, made for conveying water into a garden or for cattle to drink out of. కరల నుయ్యి A pot *well*. యిటిక నుయ్యి A brick *well*. రాతినుయ్యి A stone *well*.

నురుగు *sub.* నురుగు। నురుగులు. Froth; foam. పాల నురుగు The *froth* of milk. గుర్రపు నురుగు The *foam* from a horse. నీటి నురుగు The *foam* produced by water.

నులక *sub.* నులక। నులకలు. The name of a small kind of rope or thick string with which the poorer sorts of Indians lace or rather string their bedsteads. In this state they are, what Europeans in India commonly call, *country cots*. మంచపు నులక *Cot string*.

నువ్వు *sub.* నువ్వు। నువ్వులు. The oil plant. నువ్వులు is the usual term given to *oil seeds*. నువ్వు చేను The *oil crop* or *plantation*. నువ్వుల గానుగ An *oil mill*. N. B. The oil mills are turned by a bullock, the man who feeds the mill sitting on the bar close to the pivot, managing the bullock and feeding the mill at the same time.

నుసుమ *sub.* నుసుమ । నుసుమలు. The eye fly; a small almost imperceptible insect, extremely troublesome in the hot weather in India, commonly attacking the eyes in great numbers. They only appear in the day time.

# నూ

నూక *sub.* నూక। నూకలు. The name given to grain, when half ground. It is generally termed *rolong* by Europeans in India. గోధుమ నూక Wheat *rolong.* బియ్యపు నూక Rice *rolong.* పెసర నూక *Pessera* or green gram *rolong*; and so, of other grains.

నూనె *sub.* నూనె। నూనెలు. Oil, in the state when prepared for use. కొబ్బరి నూనె Cocoanut *oil.* జీడి నూనె The *marking-nut* oil. ఆవ నూనె *Oil* of mustard.

నూరడం *v. a.* నూరుతా। నూరి. To bruise; to grind down into a mash. కత్తి నూరడం To *grind* a knife or sword. చింతపండు నూరడం To *grind* tamarind into a mash. ఔషధం నూరడం To *grind* or *mix* medicines. ఆవాలు నూరడం To *grind* mustard seeds, in a mash.

నూర్చడం *v. a.* నూరుస్తా। నూర్చి. To thrash. In India thrashing is performed by bullocks in the open air. A spot is cleared from dirt and hardened, in the field where the grain ripens; the grain is thrown upon it in loose heaps and bullocks are turned in upon it and kept in a constant motion treading it under foot till the grain is completely freed from the stalk. N. B. The bullocks are generally muzzled, though contrary to the Hindoo shasters. కుప్పలు నూర్చడం Thrash out the heaps.

నూరు *adj.* One hundred. నూరుమంది One *hundred* men. పది నూర్లు Ten *hundreds.* నూటి పరియంతం నేను లెక్క చెప్పతాను

I can reckon as far as *one hundred*. ఎనమన్నూరు వరహాలు Eight *hundred* pagodas.

నూర్పు *sub.* నూర్పు। నూర్పులు. A thrashing. ఆ వూరి కుప్పలు అన్నీ నూర్పులు అయినవి The *thrashing* of the whole of the heaps of that village is completed. The word నూర్పిడి is more generally used.

నూలు *sub.* నూలు। నూళ్ళు. Thread; generally speaking, thread in it's raw state. దూది వడికితే నూలు అవుతుంది। నూలు పేనితే దారం అవుతుంది If you spin the cotton, you get *thread*, which *thread* is twisted to make *sewing thread*. ఆ బారచాపుల నూలు మంచిది కాదు The *thread* in that long cloth is not good. సన్న నూలు Fine *thread*. ముతక నూలు Coarse *thread*. నూలు కండె An oblong ball of thread.

## నె

నెట్టడం *v. a.* నెట్టుతూ। నెట్టి. To push or thrust violently.

నెత్తి *sub.* నెత్తి। నెత్తులు. The head. నెత్తికాయ Item. ఆ సామాను వాడి నెత్తిమీద పెట్టు Put those things on his *head*. ఈ కుర్చీ నీ నెత్తిని పెట్టుకో Put this chair upon your *head*.

నెత్తురు *sub.* నెత్తురు। నెత్తుర్లు. Blood. నెత్తురు కారడం *Blood* to *flow* or *run*; to *bleed*. అతని చిగుళ్ళవెంట నెత్తురు పడుతున్నది His gums *bleed*.

నెనరు *sub.* నెనరు। నెనర్లు. Affection; attachment. ఆమెకు చిన్న వాళ్ళయందున మిక్కిలీ నెనరు వున్నది She discovers a great *affection* for her children.

నెపము *sub.* నెపము। నెపములు. Blame; accusation; imputation of fault. అతను నామీద లేని పోని నెపం వేశినాడు He brought up frivolous *accusations* against me. నెపం పెట్టుకోవడం To use *pretences*. అతను సంకటంగా వున్నానన్న నెపం పెట్టుకుని రెండుమూడు దినములనుంచి రాకుండా వున్నాడు Having used the *pretence* of

sickness, he has stayed away for two or three days.

నెమరు *sub.* నెమరు। నెమరులు. A ruminating or chewing of the cud. నెమరు వెయ్యడం To *ruminate.* పశువులు మేత మేశినవి కనక యిప్పుడు నెమరు వేస్తూ వున్నవి The cattle having done feeding are now *chewing* the cud. నెమరుకు తేవడం To *ruminate* or *muse.* అతను ఆమాట బాగా నెమరుకు తెచ్చుకున్నాడు He *ruminated* a good deal *upon* that *subject.*

నెమలి *sub.* నెమలి। నెమళ్లు. A peacock. నెవలి is usually the name given to it. నెమలి పిట్ట Item. మొగ నెమలి A *peacock*: that is the *male.* ఆడ నెమలి A *pea-hen.* నెమలి కుంచ A *peacock's tail.* నేల నెమలి The *ground peacock.* This is the bird, gentlemen in India call the *florikin.* It is of the same species as the *bustard,* about as big as a half grown fowl in the body with a long neck and long legs and a large beautiful eye.

నెయ్యడం *v. a.* నేస్తూ। నేసి. To weave. బట్ట నెయ్యడం To *weave* cloth. మంచం నెయ్యడం To *lace* a cot. తివాశి నెయ్యడం To *weave* or *make* a *carpet.* పెంకు నెయ్యడం To *tile.* గడ్డి నెయ్యడం To *thatch.* తాటి ఆకు నెయ్యడం To *cover* a *house* with *palmyra leaves.* సాలెపురుగు నెయ్యడం To *weave,* as a spider.

నెయ్యి *sub.* నేతి। నేతులు. Ghee; the grand desideratum of India. It is made by boiling down butter and after laying it by, is mixed with their victuals and frequently taken in a pure state.

నెరియడం *v. n.* నెరుస్తూ। నెరిశి. To grow grey. తల నెరియడం Item. అతను యాభై సంవత్సరములవాడు అయినాడు కనక తలా, గడ్డమున్ను నెరిశినవి Having got to the age of fifty, his head and beard have *grown grey.*

నెరుపు *sub.* నెరుపు। నెరుపులు. The greyness of age. అతని తల నెరుపు మహా వింతగా వున్నది All people speak of that man's *grey* head.

నెల *sub.* నెల। నెలలు. A month. నెలకు ముప్పై రోజులు There are

thirty days to the *month*. నెల నెల Monthly. ప్రతి నెల Every month. నెల పది రోజులు A month and ten days. నెల is the general name for the moon. నెల పొడుపు The new *moon*.

నెలవరి *sub*. నెలవరి। నెలవర్లు. A well informed, clever person. In some senses, also, it means a person having acquaintance. యీ వూరికి నెలవరిని కాను I am a *stranger* in this town.

నెలవు *sub*. నెలవు। నెలవులు. Information; acquaintance; experience. యీ పనిలో నాకు నెలవు లేదు I have no *experience* in this business. ఆయనతో నాకు నెలవు లేదు I have no *acquaintance* with him. ఆ మార్గం నాకు నెలవులేదు I have no *knowledge* of that road.

## నే

నేడు *sub*. నేటి. (No plural.) To day; this day. నేటి దినం or నేటి రోజు Item. నేటిదినం నాటికి తిరిగి వస్తాను I shall come back *this day* again: that is, on the return of this day. This is a mode of speech. నేటి వారం Item.

నేత *sub*. నేత। నేతలు. A weaving; a texture; a woof. ఆ బట్ట నేత మహా బాగా వున్నది The *texture* of that cloth is very good. నేతగాడు A weaver: that is, one who weaves cloth. He may be of any caste.

నేను *pro*. నా। మేము. I. నేను వస్తాను *I* shall come. నా యిల్లు *My* house. మా వూరు *Our* town. నే నే *Myself* or *I* myself. నాది Mine. నేనే యీ పని చేశినాను It was I *myself* did this business.

నేబు *sub*. నేబు। నేబులు. A dub. నేబు in some places is understood to mean *two dubs*.

నేర్పడం *v. a.* నేర్పుతూ। నేర్పి. To teach; to instruct. ఆ చిన్న వాడికి విద్య నేర్పుతూ వున్నాను I am *teaching* that boy a language.

నేర్పరి ***sub.*** నేర్పరి। నేర్పరులు. **A well instructed, skilful person.**

నేరం ***sub.*** నేరపు। నేరములు. **Crime; offence.** గొప్ప నేరం **A great** *offence.* కొద్ది నేరం **A** small *offence.* నేరం చెయ్యడం **To** ***commit*** a *crime.* నేర పెట్టడం To *accuse* of *crime.* నేర పెట్టించడం To be *accused* of *crime.* నేరపు మాటలు ఆడడం To use *criminal words.* నేరం పుచ్చుకోవడం To *levy* a *fine.* వాడలో వేసే నేరం The *ballast* of a *ship.*

నేరస్థుడు *sub.* నేరస్థుడి। నేరస్థులు. A criminal; a culprit; an offender. జిల్లా కోర్టులు నిర్ణయం అయిన తర్వాత దేశములో నేరస్థులు మహా కొద్దిగా బయిలు వెళ్ళుతున్నారు Since the establishment of the *Zillah* or District Courts, there have been fewer *offenders* in the country.

నేర్పించడం *v. a.* నేర్పిస్తూ। నేర్పించి. To cause one to learn or to teach.

నేర్చుకోవడం *v. a.* నేర్చుకుంటూ। నేర్చుకుని. To learn. అతను చదువుల పంతుల దగ్గిర తెనుగు నేర్చుకుంటూ వున్నాడు He is *learning* Telugu from his preceptor.

నేర్పు ***sub.*** నేర్పు। నేర్పులు. **Instruction; teaching; information.** అతనికి చిత్తర్వు పనిలో మంచి నేర్పు వున్నది He possesses great *knowledge* in drawing.

నేల ***sub.*** నేల। నేలలు. Earth; soil; ground. ఆ నేలను పండ్లచెట్లు బాగా అవుతవి Fruit trees thrive very well in that ***soil.*** నేల నెమలి పిట్ట The ground peacock or *florikin.*

## నొ

నొక్కడం *v. a.* నొక్కుతూ। నొక్కి. To press down or in; to compress. నన్ను తలుపుసందున పెట్టి నొక్కినాడు He ***squeezed*** me ***in*** between the door. అతని చెవిపోగు పడకుండా దగ్గిర నొక్కు ***Squeeze down*** **his ear-ring, so that it may not fall off.**

నొక్కు ***sub.*** నొక్కు। నొక్కులు. **A dent or pressure.** ముడుగులు

నొక్కులు పోయినవి My hand rings have got *dents* in them.

నొప్పి *sub.* నొప్పి। నొప్పులు. Pain; ache. తల నొప్పి The head ache. కడుపు నొప్పి The belly ache. ప్రసవపు నొప్పులు Childbirth or labour pains. నొప్పి చెయ్యడం To hurt or give pain. నొప్పి పట్టడం To receive or feel pain. నొప్పులు పడడం To be in labour or travail.

## నో

నోరు *sub.* నోటి। నోళ్లు. The mouth: that is, the inside of it. అతని నోరు పెద్దది గనక విస్తారం అన్నం పట్టుతుంది Having a large *mouth*, he can take a large swallow of victuals. వాకి నోరు A wide mouth.

## నౌ

నౌకరీ *sub.* నౌకరీ। నౌకరీలు. Service. నౌకరీ చెయ్యడం To serve. రెండు సంవత్సరములు ఆ దొర దగ్గిర నౌకరీ చేశాను I *have served* that gentleman, two years. నౌకరీ వుండడం To *take service*. యీ వేళ ప్రొద్దున పటాలంలో శిపాయీ నౌకరీ వున్నాను I *took service* this morning, as a sepoy in the battalion. నౌకరీ వుంచడం To *entertain* in the *service*. నౌకరీ మానుకోవడం To take a *discharge* from *service*. నౌకరీ తీశివెయ్యడం To *dismiss* from *service*.

నౌకరు *sub.* నౌకరు। నౌకర్లు. A servant. అతను అనేక దినములనుంచి మా నౌకరు He has been my *servant*, for a considerable period.

## ప

పక్క *sub.* పక్క। పక్కలు. A side; a bedding. యీ పక్క This *side*. ఆ పక్క That *side*. అన్ని పక్కలు All *sides*. పక్క

మీద పడుకోవడం To *sleep* upon a *bed*. నా పక్కలో పండు కుంటావా? Will you come and *sleep along* with *me*?

పక్కు *sub.* పక్కు. పక్కులు. A scab. పక్కు కట్టడం To form a *scab*. ఆ కురుపు పక్కుకట్టినది గనక త్వరగానే కుదురుతున్నది A *scab* having formed upon that sore, it will soon heal. పక్కు వూడడం The *scab* to fall off.

పగ *sub.* పగ. పగలు. Enmity; hostility; variance. అతనికీ నాకూ చాలా దినములనుంచి పగ వున్నది An *enmity* has subsisted betweee him and me, for a long period past. పగ వాడు An *enemy*. పగ పట్టడం To take or feel *enmity*. అతను పామును కర్ర పుచ్చుకుని కొట్టపోతే తప్పించుకుని పగపట్టినది Having taken a stick to kill a snake and failing to do so, the snake retained *enmity*. N. B. The Indians suppose a snake retains enmity and strives to revenge, at a convenient opportunity, any unsuccessful attempt to kill it. పగ చెయ్యడం To make *enmity*.

పగడం *sub.* పగడపు. పగడాలు. Coral; more properly, the coral when shaped into beads. అతడి మెడ తావళంలో చాలా గొప్ప పగడాలు వుండి వున్నవి That man wears a necklace of very large *coral beads*.

పగలకొట్టడం *v. a.* పగలకొట్టుతూ. పగలకొట్టి. To break. ఆ పెట్టె నేను పగల కొట్టినాను I have *broken* that box.

పగలడం *v. n.* పగులుతూ. పగిలి. To break; to shatter; to fall to pieces. శిరాబుడ్డి చెయ్యిజారి కిందపడి పగిలినది The ink bottle slipped out of my hand and *broke*. అతను పోట్లాడినందున తల పగిలినది He has been fighting and got a *broken* head.

పగలు *sub.* పగటి. పగళ్లు. Day time; the day. పగలు యిక్కడ వుండి రాత్రి లేచి వెళ్లుతాము I shall remain here during the *day* and go away in the evening. యీ రాత్రి వుండి రేపు పగటి వేళ యింటికి వెళ్లు Stay here to night and go home in the *morning*.

పగిలిన *adj.* Broken; fractured. పగిలిన తునకలు *Fractured* pieces. పగిలిన సామాను *Broken* things.

పచ్చ ***adj.*** Green. For this reason పచ్చ is the name given to the ***emerald***. పచ్చ రంగు *Green* colour. ఆ యింట్లోను కొన్ని పచ్చ కురిచీలు వున్నవి In that house, there are some *green* chairs. పచ్చ పొడవడం To mark with *green*. N. B. It is the practice of Hindoo women and sometimes of men, to puncture the skin and introduce a mixture made of the juice of the margosa leaf, some oil and turmeric. It is the same practice, as is by some other nations, termed ***tattooing***.

పచ్చ గన్నేరు పువ్వు ***sub.*** పచ్చగన్నేరుపువ్వు। పచ్చగన్నేరుపువ్వులు. A flower. Some of them are yellow and some white and well flavoured.

పచ్చడం ***sub.*** పచ్చడపు।పచ్చడములు. The name given to a particular kind of cloth, generally twenty four cubits long and two cubits broad. The word is called *patch* by Europeans and means *two* pieces.

పచ్చి *adj.* Fresh; new: raw; unboiled. పచ్చికర్ర *New* wood. పచ్చి కాయలు ***Fresh*** fruits. పచ్చికంద తింటాడు He eats *raw* ***cundah*** or a kind of degenerate yam. పచ్చి మాంసం *Raw* meat. పచ్చి ఆకు A *green* or *fresh* leaf. పచ్చి is also the adopted meaning for a bird. Figuratively పచ్చి దగా means, deceit.

పటకా ***sub.*** పటకా। పటకాలు. A ***sash*** commonly worn by all Indians.

పటకారు ***sub.*** పటకారు। పటకార్లు. Pincers. కమ్మరవాడి పటకారు A black-smith's ***pincers***. The proper word is పటుకారు.

పట్టడం ***v. a.*** పట్టుతూ। పట్టి. To hold; to gripe. యీ కాగిదం చివర పట్టు ***Lay hold of*** the end of this paper. చేతులు పట్టు, కొన్ని రూపాయిలు యిస్తున్నాను *Hold forth* your hands and I will give you some rupees.

పటం ***sub.*** పటపు। పటాలు. The name of ***a picture***, when finished

and mounted. పటం is also the name for a *map.*

పట్నం *sub.* పట్నపు। పట్నములు. A City; principal town; the capital of a country. అతను పట్నం వెళ్ళినాడు He is gone to the *capital.*

పటిక *sub.* పటిక।పటికలు. *Alum.* It is also used to express sugar candy, from its resemblance in shape and colour. పటిక బెల్లం or పటిక పంచదార *Sugar candy.*

పట్టు *sub.* పట్టు। పట్లు. Silk. పట్టు బట్టలు *Silk* clothes. పట్టు తునక A piece of *silk.* పట్టు means, also, a *grip..* కట్టి పట్లు The *grip* of a wrestler. పట్టు in another sense means an *application* or *putting upon.* సున్నపు పట్టు An *application* of chunam. N. B. This is the common application of the Indians to bruises and pain. The word means an *application* of any thing else. యింటి పట్టు A *place* of *residence.*

పట్టుకోవడం *v. a.* పట్టుకుంటూ। పట్టుకుని. To seize; to take. ఆ దొంగ పారిపోతూ వుండగా పట్టుకున్నారు They *took* that thief, whilst he was running away. ఆ వూళ్ళోకి ఫితూరీకోర్లు వచ్చి మమ్మున పట్టుకున్నారు The plunderers came to that town and *seized* us there.

పట్టు పడడం *v. n.* పట్టుపడుతూ। పట్టుపడి. To be apprehended; to be seized. ఆ రాజు యింతమట్టుదాకా ఫితూరీలో వుండి పది దినముల కిందట పట్టుపడ్డాడు That Rajah, who has all this time been in rebellion, *was seized* about ten days ago.

పట్టె *sub.* పట్టె। పట్టెలు. A side, border or streak. మంచపు పట్టె One *side* of the bed frame. సున్నపు పట్టె A *streak* of chunam, such as the Hindoos rub on the out side of their houses. They are sometimes, alternately red and white. నవారు పట్టె *Lacing* for bed frames. తాటి పట్టె means the *fourth part* of a *palmyra tree,* cut length ways for buildings.

పడగ *sub.* పడగ। పడగలు. The name for the *hood,* of the hooded snake: that is, the expansion on each side of its head and

down the back of its neck, when the snake raises itself.

పడడం *v. n.* పడుతూ। పడి. To fall; to happen; to sink. చెట్టు మీదనుంచి పడడం To *fall down* from a tree. బోర్ల పడడం To *fall flat* down. సంకట పడడం To *fall* sick. ఖైదులో or సంకెళ్ళ పడడం To *get imprisoned* or be *put* in *irons.* కోప పడడం To *get* angry. సంతోష పడడం To *feel* glad or *be pleased.* విచార పడడం To *grieve*; to *lament.* కాకితాలున్నూ, బట్టలున్నూ మడత పడడం Papers and clothes to rumple or *get into folds.* N. B. This verb is joined to the verbal infinitive of other verbs, to form the passive voice.

పడమర *sub.* పడమటి। పడమరు. The west. సూర్యుడు పడమర అస్తమానం అవుతూ వుంటాడు The sun sets in the west.

పడవ *sub.* పడవ। పడవలు. A boat. ఓడ పడవ A ship's *boat.*

పడిగె *sub.* పడిగె। పడిగెలు. Borrowed clothes. పడిగె బట్టలు Item. It is a common practice, amongst people in India who are not very rich, but are desirous of appearing well dressed, to enter into bargains with the washers, to supply them with other people's dresses, for the use of which the wearers pay the washers from two to six rupees at the end of the year.

పడిశెము *sub.* పడిశెపు। పడిశాలు. A cold in the head. vide రొంప.

పడుకోవడం *v. n.* పడుకుంటూ। పడుకుని. To lay down; to recline. నేను మహా అలసట పడ్డందున పడుకుంటాను I am very tired and must *lay down.* పడుకోవడం means, also, to *go to sleep.*

పడుగు *sub.* పడుగు। పడుగులు. Length, as contrasted with breadth, in the measurement and weaving of cloth. పేక is the breadth. నూలు పడుగు Length of the thread in weaving. మంచం పడుగు Length in lacing a cot. So also for the breadth, when you use పేక.

పడుచు *adj.* Applied to women or to men. పడుచుది A *girl* or *young woman.* When applied to women it is

used as a substantive. అదుగో, పది హేను సంవత్సరములుగల మంచి పడుచు వున్నది Behold that charming *girl*, who cannot be more than fifteen years of age! పడుచువాడు A *young man*. పడుచు తనం *Youth* or *time of youth*. అతను పడుచుతనంలో వున్నాడు He is in the period of his *youth*.

*పడుచుకోవడం *v. a.* పడుచుకుంటూ। పడుచుకుని. To go astray; to visit men. This word is applied only to women.

పతకం *sub.* పతకపు। పతకములు. The name given to an ornament worn by the Hindoos at the breast and suspended round the neck, by a string or chain. They are more or less expensive, according to the fancy and riches of the wearer.

పత్రం *sub.* పత్రపు। పత్రములు. A bond. పత్రం వ్రాయడం To *execute* a *bond*. పత్రం తల చించడం To *cancel* a *bond*.

పతివ్రత *sub.* పతివ్రత। పతివ్రతలు. A constant, chaste female. It is a Sanskrit compound meaning *devotion* to the *husband*. రాముడి భార్య పతివ్రత అని అనుకుంటారు People say that Ramdoo's wife is a *chaste, constant* woman.

పథ్యం *sub.* పథ్యపు। పథ్యాలు. Diet. పథ్యం పెట్టడం or పెట్టించడం To fix or prescribe a *diet*. పథ్యం చెయ్యడం To undergo a *regimen*. పథ్యం పుచ్చుకోవడం To resume *diet* under restrictions.

పదం *sub.* పదపు। పదాలు. A song. పదం పాడడం To sing a *song*.

పద్యం *sub.* పద్యపు। పద్యాలు. The *paddiums* or stanzas are the poetic descriptions of historical and religious events, written in a sort of medium language between Telugu and Sanskrit and that *ancient* Telugu for which there is no particular name. The best informed Indians tell you it is pure Telugu, they are written in, but this is from their not being written entirely in Sanskrit and having Telugu mixed in them. పద్యాలు పాడడం or చదవడం To

sing or recite *paddiums*. In reciting their *paddiums*, the Hindoos modulate the sentences into a kind of recitative, very agreeable to the ear.

పదార్థం **sub.** పదార్థపు । పదార్థములు. Ready money; personal property. This word is not considered correct, but it is adopted and understood by the people in this sense. అతని వద్దను విస్తరించి పదార్థం వున్నది He possesses considerable *personal property*. vide అర్థం.

పది **adj.** Ten. పది వందలు or పది నూర్లు *Ten* hundreds. పది మంది A *number* of people. N. B. This is a mode of speech.

పద్దు **sub.** పద్దు। పద్దులు. An entry in accounts. లెక్క పద్దులు Entries or particulars of an account.

పదును **sub.** పదును। పదునులు. Sharpness; glibness; quickness. కత్తిపదును The sharpness of a knife. వర్షం కురిసినందున దున్నడా నకు భూమి మహా పదును యిచ్చి వున్నది In consequence of the rain, the ground has obtained a degree of *glibness* and aptness for the plough. పదును చెయ్యడం To sharpen. పదును చేసే రాయి A hone or whetstone.

పద్ధతి **sub.** పద్ధతి। పద్ధతులు. A manner; a way. పరగణా వ్యవహారం తమరు శలవు యిచ్చిన పద్ధతి ప్రకారం జరిగించినాను I have conducted the business of the District, agreeable to the *manner* which you prescribed.

పన్నడం **v. n.** పన్నుతూ। పన్ని. To pretend or feign. చచ్చినానని పన్నినాడు He *feigned* to be dead.

పనసపండు **sub.** పనసపంటి।పనసపండ్లు. The jack fruit. This fruit grows to the size of a man's head and when ripe acquires an offensive smell. The inside parts into cloves or divisions, with a stone in each. The fruit strikes out from all parts of the tree and sometimes even from the roots.

పని *sub.* పని, పనులు. Business; work; an act. మంచి పని A good or praiseworthy act. చెడ్డ పని A bad or reprehensible act. పని చెయ్యడం To work or to do business. యీవేళ శానా పని చేశినాము We have *done* a great deal of *business* to-day. కూలివాళ్లు సగం పనిచేసి యింటికి వెళ్ళినారు The coolies have gone home, after doing only half their *work*. నీపని పట్టిస్తాను I will *take care* of you. Meant, when spoken in a threatening tone.

పన్నీరు *sub.* పన్నీటి, పన్నీరులు. Rose water. It is difficult to say how this word is compounded. The two last syllables imply *water*, but the first has a meaning unconnected with a rose, altho' the only meaning to be given to the word is *rose-water*. పన్నీరు చెట్టు A *rose* tree. పన్నీరు పువ్వు A *rose*. పన్నీరు చల్లడం To sprinkle *rose-water*. N. B. This is a practice on visits of ceremony in India.

పన్ను *sub.* పన్ను, పన్నులు. A tax. The general name for taxation. యింటి పన్ను House tax. బీటి పన్ను Tax on pasturage. సాలె పన్ను Tax on weavers.

పన్నెండు *adj.* Twelve; a dozen. పన్నెండుమంది బోయీలు *Twelve* palanquin boys. ఆ పనిమీద పన్నెండు మందిని వుంచినారు They kept a *dozen* fellows at that business.

పంకా *sub.* పంకా, పంకాలు. A fan. vide విసన కర్ర.

పంక్తి *sub.* పంక్తి, పంక్తులు. A line; a row, in a limited sense. యీ పుస్తకం మీదను నాలుగు పంక్తులు వ్రాశినాను I have written four *lines* in this book. భోజనాలకు పది పంక్తులను కూర్చున్నారు They are sitting in ten different *rows*, eating their victuals.

పంచగవ్యం *sub.* పంచగవ్యపు, పంచగవ్యాలు. The name given to a drink, which the Hindoos take on a superstitious idea of its expiating any sin committed by them, because cow's

urine forms the principal ingredient. The composition is made of cow's urine, cow's dung, cow's milk, ghee and *tyre* or sour milk or curd.

పంచడం *v. a.* పంచుతూ। పంచి. To divide ; to share. పాళ్లు పంచడం To *divide* shares. పంచుకోవడం Item.

పంచదార *sub.* పంచదార। పంచదారలు. Sugar, generally; commonly, brown sugar. చీనా or పటిక పంచదార *Sugar candy*.

పంచపాళి *sub.* పంచపాళి। పంచపాళిలు. The name of the *gallery* in front of houses called a *verandah*, over which the roof extends to a certain distance, to keep off the sun.

పంచలోహాలు *sub.* పంచలోహాల. (No Singular.) The name of a metal, composed of five different ones, viz. gold, silver, copper, tin and lead.

పంచాంగం *sub.* పంచాంగపు। పంచాంగములు. This word is a Sanskrit compound to denote the Brahmin calculations of time. It is therefore synonymous with our word *Calendar*. పంచాంగం బ్రాహ్మడు *Panchangum* or *Calendar* Brahmin. పంచాంగం చెప్పడం To tell the calculations of the seasons.

పంచాయతీ *sub.* పంచాయతీ। పంచాయతీలు. An arbitration. vide తగువు.

పంచితం *sub.* పంచితపు। పంచితాలు. The name given to cow's urine, which the Indians use sometimes medicinally and most generally for cleansing the floors and walls of the inside of their houses, as a preventative against filth and vermin. యింట్లో పంచితాలు చల్లడం To sprinkle the house with cow's urine. It is also mixed with cow's milk, cow dung, thick buttermilk or *tyre* or curds and ghee and in this state taken superstitiously for the expiation of sin, the cow being

considered a sacred animal by the Hindoos. This composition is called పంచగవ్యం.

పంజరం *sub.* పంజరపు। పంజరములు. A bird cage. ఆ పిట్టను పంజరంలో వుంచు Keep that bird in a *cage.*

పంట *sub.* పంట। పంటలు. The produce or crop. ఆ చేను పంట బాగా పండినది The *produce* of that plantation has been properly ripened.

పంటె *sub.* పంటె। పంటెలు. A distaff.

పండడం *v. a.* పండుతూ। పండి. To ripen. ఆ చెట్టుకాయలు మహా బాగా పండినవి The fruit of that tree have *ripened* very favourably. పండడం Means, also, *to sleep.*

పండించడం *v. a.* పండిస్తూ। పండించి. To cultivate; to raise. ఆ కాపు నూరుపుట్ల ధాన్యం పండించినాడు That inhabitant has *brought* a hundred candies of grain *into cultivation.*

పండు *sub.* పంటి। పండ్లు. Fruit. The general name of all fruits, but chiefly of *ripe* fruits, from పండడం to *ripen.* పనస పండు Jack *fruit.* మామిడి పండు Mango *fruit.* పండుటాకు An *old leaf.*

పండుగ *sub.* పండుగ। పండుగలు. A holiday or feast. దసరాపండుగ The *Dassara feast.* పండుగ నిమిత్తం వెళ్ళి యింకా రాలేదు He is gone to a *feast* and is not yet returned.

పండుగొప్ప *sub.* పండుగొప్ప। పండుగొప్పలు. A species of codfish.

పంతము *sub.* పంతపు। పంతములు. A vow. పంతము వెయ్యడం To make a *vow.*

పంతులు *sub.* పంతులు। పంతుళ్ళు. The name assumed by most Brahmins, when they get into employ. It means something superior to the common people, something like our word *mister.* పంతులు is also the meaning among the Indians for a *school-master* or *preceptor.*

పంది *sub.* పంది। పందులు. A hog. అడివి పంది A *wild hog.* పంది పిల్ల A *pig.* పందితొడ The quarter of a *hog.* వూరపంది A village

*hog.* పంది మూలగడం *Speaking*, as a *hog.* పంది గోండ్రించడం To *grunt*, as a *hog.*

పందికొక్కు *sub.* పందికొక్కు। పందికొక్కులు A *pandikockoo* or as we generally call it *bandicoot.* This animal seems to be between the pig and the rat in appearance, having the head very like a pig and making a grunting noise like the pig. The body is like that of a rat.

పందిరి *sub.* పందిటి। పందిళ్ళు. This is the name of a covering made of leaves or other materials, to keep off the sun and serve as a shelter from the weather. Europeans call it *pandaal.*

పందెం *sub.* పందెపు। పందెములు. A stake or bet. The Indians love cock fighting. This amusement is chiefly followed by the weaver castes, who stake large sums on favourite game cocks. Brahmins and other castes bet at games of chance, such as *sogataala*, or at *cards*, and also at *chess.* పందెపు కోడి *A fighting cock.* పందెం వెయ్యడం To *lay a wager.* ఆటలో పందెం A *stake* at *play.* తన అన్న వూరినుంచి రేపు వస్తాడని పందెం వేశినాడు He *laid a wager*, that his elder brother would return from the village to-morrow.

పప్పు *sub.* పప్పు। పప్పులు. Gram or other grain, prepared by being first roasted, then bruised and the husk removed, in which state it is boiled up and eaten with rice by the Indians. Sometimes it is given dry to horses, or mixed with sugar, for childern, when it is called పప్పు. బెల్లం.

పంపకం *sub.* పంపకపు। పంపకములు. Dismission. అతను మొన్నటి రోజున తన బంధువుల పంపకం నిమిత్తమై యింటికి వచ్చినాడు He came home the other day, on purpose to give *dismission* to some relations of his. ములాకాత్ అయిన తరవాత అతన్ని రెండుజాములప్పుడు పంపకం చేసినాను The visit being over, I gave him his *dismission* about noon.

పంపడం *v. a.* పంపుతూ। పంపి. To send; to despatch. కొన్ని మంచి నారింజపండ్లు నాకు పంపుమని చెప్పు Tell him to *send* me some good oranges. అతనికి వుత్తరం నిన్న పంపినాను I *despatched* a letter to him yesterday.

పంపరమాస పండు *sub.* పంపరమాస పంటి। పంపరమాస పండ్లు. The fruit which Europeans term the *pummelnose.* It is the same which, in the West Indies, is called the *shaddock.*

పంపించడం *v. a.* పంపిస్తూ। పంపించి. To send; to despatch. vide పంపడం.

పంపించుకోవడం *v. a.* పంపించుకుంటూ। పంపించుకుని. To engage to send.

ప్రకటం *sub.* ప్రకటపు। ప్రకటాలు. Proclamation; publication. ప్రకటం చెయ్యడం To publish; to proclaim. నీతో చెప్పినమాట అందరికీ ప్రకటం చేయించు Make whatever I have told you *public* to every one.

ప్రకారం *pre.* According. మీ ఆజ్ఞ ప్రకారం According to your order. ప్రకారంగా Accordingly. ఆ ప్రకారంగా నడుచుకో Act accordingly.

ప్రకాశం *sub.* ప్రకాశపు। ప్రకాశాలు. Reflection of light; glittering; a shining; a glass. సూర్య ప్రకాశం The splendour of the sun. నక్షత్ర ప్రకాశం Glittering of the stars. కీర్తి ప్రకాశం The splendour of fame. ఆ రాజు ప్రకాశం లోకములో మహా విస్తరించినది The *splendour* of that Rajah spread greatly amongst the people.

ప్రకాశించడం *v. n.* ప్రకాశిస్తూ। ప్రకాశించి. To shine; to glitter. ఆ వజ్రం మహా ప్రకాశిస్తూ వున్నది That diamond *shines* superiorly. ఆ యింట్లోను దీపాలు ప్రకాశిస్తూ వున్నవి The lights *shine* from that house also.

ప్రజ *sub.* ప్రజ। ప్రజలు. An inhabitant; a crowd of people. నిన్నటిదినం దేవుడి వుత్సవమును విస్తరించి ప్రజ వచ్చినది A great *crowd* of people came yesterday, to see the ceremonies on

account of the idol. కాటకంచేత యీ దేశములో ప్రజలు మహా తక్కువ అయినారు The number of *people*, in consequence of the famine, is much reduced in this country.

ప్రత్యక్షం **sub.** ప్రత్యక్షపు। ప్రత్యక్షాలు. Presence. నాతో ప్రత్యక్షమందు వకలాగున్నూ, పరోక్షమందు వకలాగున్నూ అన్నాడు He spoke one way in my *presence*, and another way in my absence. ప్రత్యక్షంగా Being present. ఆ మాట నాతో ప్రత్యక్షంగా చెప్పలేదు He did not speak that word whilst I was *present*.

ప్రత్యామ్నాయం *adv.* Instead. నా ప్రత్యామ్నాయం రాముణ్ని మీ వద్దికి పంపించినాను I have sent Ramdoo to you, *in* my *stead*.

ప్రతి *adj.* Each; every; again. ప్రతి యిల్లు *Every* house. ప్రతి మనిషి *Every* man. ప్రతి దిక్కున *Every* where. When used figuratively, it is pure Telugu. ప్రతి మాట *Retorting* words. ప్రతి వుత్తరం or ప్రత్యుత్తరం An *answer*. ప్రతి ధ్వని An *echo*. ప్రతి బింబం *Reflection* in a *glass*. ప్రతి రోజు or దినం *Daily* or *every day*.

ప్రత్తి **sub.** ప్రత్తి. (No Plural.) Cotton: that is, cotton when *first gathered* or when in the pod. ప్రత్తి చేను *Cotton* field or plantation. N. B. This word is sometimes called పత్తి.

ప్రతిజ్ఞ **sub.** ప్రతిజ్ఞ। ప్రతిజ్ఞలు. Determination; resolution; intention; vow. ప్రతిజ్ఞ చెయ్యడం To *resolve*; to *determine*. అతను కాశీ వెళ్లుతానని ప్రతిజ్ఞ చేశినాడు He has *made* a *vow* to go to Caassy or Benares.

ప్రతిమ **sub.** ప్రతిమ। ప్రతిమలు. A drawing or a picture.

ప్రతిష్ఠ **sub.** ప్రతిష్ఠ। ప్రతిష్ఠలు. Reputation; name. ప్రతిష్ఠ చెయ్యడం To endow.

ప్రతిహతం **sub.** ప్రతిహతపు। ప్రతిహతాలు. Revenge; retaliation; prevention. అతను చేశిన విరోధానకు తిరిగీ ప్రతిహతం చెయ్యవలెనని విచారించినాను In consequence of his hostility, I devised the *means* of being *revenged*.

ప్రధానం ***sub.*** ప్రధానపు। ప్రధానములు. Pre-eminence; superiority. అన్ని పనులలోకీ యిది మాకు ప్రధానపు పని Of all other concerns, this is my *principal one.* ప్రధానం చెయ్యడం To *make* the *marriage portion.*

ప్రపంచం ***sub.*** ప్రపంచపు। ప్రపంచములు. The world; the universe. మనుష్యుల ప్రపంచం The *inhabited world* or *terrestrial globe.* దేవతల ప్రపంచం The *ethereal world* or *celestial sphere.* Figuratively యీ సంగతి ప్రపంచం అంతా యెరుగుదురు The *whole world* is acquainted with this business.

ప్రబలం ***sub.*** ప్రబలపు। ప్రబలాలు. Exaltation; pre-eminence. అతనికి వుద్యోగ ప్రబలంచేత తీరుబడి లేకుండా వున్నది From the *pre-eminence of* his situation, he has very little leisure. ప్రబలం చెయ్యడం To *increase*; to *exalt.*

ప్రబలించడం ***sub.*** ప్రబలిస్తూ। ప్రబలించి. To exalt; to raise; to improve. అతని వుద్యోగం మహా ప్రబలించినది He has *improved* his situation considerably. అతని వంట్లో రోగం మహా ప్రబలించినది The disorder in his body has *increased* to an alarming height.

ప్రభుత్వం ***sub.*** ప్రభుత్వపు। ప్రభుత్వములు. Power; authority; government. చెన్నపట్నపు ప్రభుత్వానకు కొత్త గౌనరు వచ్చినాడు A new governor has arrived, for the *government* of Madras. ప్రభుత్వం చెయ్యడం To *govern.*

ప్రభువు ***sub.*** ప్రభువు। ప్రభువులు. A Lord; a master; a governor.

ప్రమాణం ***sub.*** ప్రమాణపు। ప్రమాణాలు. An oath; an affirmation. ప్రమాణం చెయ్యడం To *make oath* or to *swear.* సాక్షి ప్రమాణం చేశి వాఙ్మూలం యిచ్చినాడు The witness having been *sworn,* has delivered his deposition. తప్పు or అబద్ధపు ప్రమాణం A *false oath* or *perjury.* ప్రమాణం చేయించడం To *administer* an *oath,* or cause one to *swear.* అతనిచేత ప్రమాణం చేయించు *Administer* the *oath* to him. ప్రమాణం also means, *measurement* or *dimension.*

ప్రయత్నం ***sub.*** ప్రయత్నపు। ప్రయత్నములు. An endeavour and effort. అతను పెళ్ళి ప్రయత్నంలో వున్నాడు His *endeavour* is to get married. ప్రయత్నం చెయ్యడం To *endeavour*. కోర్టులో నౌకరీ వుండవలెనని ప్రయత్నం చేశినాడు He *made efforts*, to get into the service of the court.

ప్రయాణం ***sub.*** ప్రయాణపు। ప్రయాణాలు. A journey. నేను దేశాంతరం వెళ్ళడానకు ప్రయాణం అయినాను I have made preparations for *a journey* into different countries. ప్రయాణపు వస్తువులు or సరంజాము *Travelling* things. ప్రయాణం వెళ్ళడం To *make* a *journey*.

ప్రయాసం ***sub.*** ప్రయాసపు। ప్రయాసములు. A difficulty; a trouble; an embarrassment. ప్రయాస పెట్టడం To *give trouble* or *vexation*. నన్ను కైదులో వుంచి చాలా ప్రయాసపెట్టినాడు He has put me in prison and caused me great *vexation*. ప్రయాస పడడం To be *oppressed*.

ప్రయోజనం ***sub.*** ప్రయోజనపు। ప్రయోజనాలు. Business; ceremony; occupation. నీకు యీ వూళ్లో యేమైనా ప్రయోజనం వున్నదా? Have you any *occupation* in this village? యీ రోజున మా యింట్లో తిధి ప్రయోజనం I have this day an annual *ceremony* to perform in my house. తిధి ప్రయోజనం is properly speaking one of the prescribed ceremonies for the death of a relation. శుభ ప్రయోజనం *Marriage* or *religious ceremony*.

ప్రవర్తన ***sub.*** ప్రవర్తన। ప్రవర్తనలు. Conduct; behaviour. అతని ప్రవర్తన నాకు సమాధానమైనది కాదు I am not at all satisfied with his conduct.

ప్రవర్తించడం ***v. a.*** ప్రవర్తిస్తూ। ప్రవర్తించి. To behave; to conduct oneself. అతను మంచివాడు గనక బాగా ప్రవర్తిస్తూ వున్నాడు He is a good man, so *conducts* himself properly.

ప్రవేశం ***sub.*** ప్రవేశపు। ప్రవేశములు. Arrival; acquirement. అతని ప్రవేశపు సంగతి మేము వినలేదు I have not heard any thing about his *arrival*. అతనికి సంస్కృతపు విద్యలో బాగా ప్రవేశం

వున్నది He has made great progress, in the *acquirement* of the Sanskrit language.

ప్రవేశపెట్టడం *v. n.* ప్రవేశపెట్టుతూ। ప్రవేశపెట్టి. To place; to appoint. అతణ్ని ఆ యింట్లో ప్రవేశపెట్టు *Place him* in that house. అతణ్ని ఆ వుద్యోగంలో ప్రవేశ పెట్టినాను I have *appointed* him in that service.

ప్రవేశించడం *v. a.* ప్రవేశిస్తూ। ప్రవేశించి. To arrive at. వూళ్ళో ప్రవేశించడం To *arrive* at a town.

ప్రశ్న *sub.* ప్రశ్న। ప్రశ్నలు. A question. ప్రశ్నలు వెయ్యడం To put *questions.* అతను వచ్చిన తరువాత నీవు యేమి ప్రశ్నలు వేశినావు? After he *came,* what *questions* did you *put* to him?

ప్రసవం *sub.* ప్రసవపు। ప్రసవములు. Labour or travail in child-birth. ఆ చిన్నదానికి ప్రసవపు దినములు సమీపించినవి That young woman has reached her time of *laying in.* ప్రసవపు నొప్పులు *Labour* or *childbirth pains.* ప్రసవపు నొప్పులు పడడం To feel the *pains* of *child-birth* or to be *in labour.*

ప్రర *sub.* ప్రర। ప్రరలు. A swamp; marsh; bog or fen. వుప్పు ప్రర A salt *marsh* or *swamp.* రాగిటి ప్రర A clayey *bog.* వట్టి ప్రర A *fen* or *marshy ground.* ప్రర is also a *measurement,* forty of which go to *one toom.* Salt, grain and chunam are generally measured with it.

పరఖావిణీ *sub.* పరఖావిణీ। పరఖావిణీలు. A shroffing. పరఖావిణీ చెయ్యడం To *shroff* money. A term given in India to the method used of *trying money* by the *sight,* in the act of telling it. In a figurative sense, you say *మనిషిని పరఖావిణీ చెయ్యడం To *bring* a man to the *test.*

పరదా *sub.* పరదా। పరదాలు. A curtain; a screen; generally meant for the *curtain* to apartments, where the females are.

పరపతి *sub.* పరపతి। పరపతులు. Credit; trust. యీ వూరికి పరాయీని గనక నాకు యెక్కడా పరపతి లేదు Being a stranger in

this town, I *have* no *credit* with any body. పరపతి వుండడం To *have credit.*

పర్యంతం *adv.* Until or meantime. నేను వచ్చే పర్యంతం యిక్కడ వుండు You must remain here *until* I come. నేను ప్రొద్దున వెళ్ళి రెండు ఘంటలకు వస్తిని, అంత పరియంతం నీవు యిక్కడ యేమి చేస్తివి? I went this morning and was away two hours, what have you done *in* all the *meantime*?

పరవడం *v. a.* పరుస్తూ। పరిచి. To spread; to extend; to expand. ఆ తివాశీ గదిలో పరువు *Spread* that carpet in the room.

పరవానా *sub.* పరవానా। పరవానాలు. A revenue term, signifying an *order* or *mandate.* మొఖాసా జరగగలందులకు పరవానా యిచ్చినాడు He gave me a *perwaanah*, conferring on me the enjoyment of a *mocassa* village.

పరామర్శ *sub.* పరామర్శ। పరామర్శలు. Attention; civility; enquiry. పరామర్శ చెయ్యడం To shew *civility*; to be *attentive*; to *provide* for; to *condole.* ఆ మనిషిని భోజనం చేశేటప్పుడు చాలా పరామర్శ చెయ్యి *Pay* particular *attention* to that person, during his meal. ఆ మనిషికి అన్నానికి పరామర్శ చెయ్యి See to *provide* for that man's victuals.

పరామర్శించడం *v. a.* పరామర్శిస్తూ। పరామర్శించి. To be attentive; to condole with.

పరాయీ *sub.* పరాయీ। పరాయీలు. A stranger. పరాయీ మనిషి Item.

పరిగెత్తడం *sub.* పరిగెత్తుతూ। పరిగెత్తి. To run. ఆ బంట్రోతు అక్కడనుంచి యిక్కడికి రావడానకు మహా త్వరగా పరిగెత్తినాడు That peon has *run* very fast, to come from that place to this.

పరిచయం *sub.* పరిచయపు। పరిచయాలు. An acquaintance. vide పరిచితి.

పరిచితి *sub.* పరిచితి। పరిచితులు. An acquaintance. పరిచితి చెయ్యడం To make *acquaintance.*

పరియాచకం *sub.* పరియాచకపు । పరియాచకములు. Jocularity; merriment; jesting. అతను నన్ను చూచినప్పుడల్లా పరియాచకపు మాటలు ఆడుతాడు Whenever he meets me he always addresses me in words of *merriment* and *jesting*. పరియాచకం చెయ్యడం To *jest*. N. B. The proper Sanskrit word, for which this word is adopted, is పరిహాసం.

పరిశీలన *sub.* పరిశీలన। పరిశీలనలు. An inquiry; an investigation; a scrutiny. నా వ్యాజ్యం పరిశీలనలోకి వచ్చినది My cause is brought under *investigation*. పరిశీలన చెయ్యడం or పరిశీలించడం To *investigate*.

పరిశుభ్రం *sub.* పరిశుభ్రపు। పరిశుభ్రాలు. Cleanliness. పరిశుభ్రమైన *Cleanly* or *clean*. పరిశుద్ధం Item.

పరిష్కారం *sub.* పరిష్కారపు। పరిష్కారములు. A revenue term, signifying *settlement* of *accounts*. పరిష్కారం చెయ్యడం To *settle* or *adjust*.

పరీక్ష *sub.* పరీక్ష। పరీక్షలు. Examination. ఆ చిన్నవాడు తాను చదువుకున్న చదువు పరీక్ష యిచ్చినాడు That boy has *delivered his lesson*: that is, he has gone through the *examination* of it. పరీక్ష చెయ్యడం To *examine*. పరీక్ష యివ్వడం To *go through* or to *undergo* an *examination*.

పరుగు *sub.* పరుగు। పరుగులు. The act of running. గుర్రపు పరుగు *Running*, as a horse. మనిషి పరుగు *Running*, as a man. పరుగు is also applied to *distance*. పరుగు మేర or పరుగు దూరం The *distance* of a *coss*. *Coss* is two and a half miles.

పరుండడం *sub.* పరుంటూ। పరుండి. To rest; to sleep. పడుకోవడం Item.

పరుపు *sub.* పరుపు। పరుపులు. A bedding. మంచపు పరుపు Sleeping *bedding*. సవారీ పరుపు Palanquin *bedding*. N. B. This word, also, means the extent of surface in ground.

పరువు *sub.* పరువు। పరువులు. Dignity; grandeur. ఆరాజు పరువు అందరికంటే మహా యెక్కువ That Rajah supports a *superior*

*appearance*, to all persons. పరువు also means *the season* for any thing. పండ్ల పరువు The *season* of fruit. పంట పరువు The *season* of cultivation.

పలక *sub.* పలక। పలకలు. This is the name of the tablet, which school boys in India carry to school and write their lessons upon. నేత పలక or సాలెవాళ్ళ పలక What are called the *lams*, in a weaver's loom.

పలచన *sub.* పలచన। పలచనలు. Thinness; spareness. పాల పలచన *Thin* milk. ఆ కాకితపు పలచనచేత శిరా యినికిపోయినది Owing to the *thinness* of the paper, the ink sinks in it. పలచని బట్ట *Thin* cloth. పలచని కర్ర A *slight* piece of wood. పలచని మనిషి A *spare slim* person. పలచన also means *degradation.* పలచన చెయ్యడం To *degrade.* పలచనగా చూడడం To *look on* one *degradingly.*

పలంగుపోషు *sub.* పలంగుపోషు। పలంగుపోషులు. This word is usually called *palampore*, by Europeans in India. It is a bed covering of a single cloth, painted in the Dutch taste.

పల్లం *sub.* పల్లపు। పల్లములు. A saddle; also, the term given for *low* land or *nether ground*, such as is commonly flooded in cultivation. గుర్రపు పల్లం A horse *saddle.* పల్లపు భూమి అంతా దున్నినారు They have ploughed all the *low ground.* ఆ స్థలం పల్లము కనక నీళ్ళు నిలిచినవి That place being *low ground*, the water lodged there.

పలవరించడం *sub.* పలవరిస్తూ। పలవరించి. To have or get the night-mare. ప్రతి రాత్రి అతను నిద్రపోయినప్పుడు పలవరిస్తాడు He has the *nightmare*, every night that he goes to sleep. కలవరించడం Item.

పలవరింత *sub.* పలవరింత। పలవరింతలు. The night-mare. నిన్నటి రాత్రి అతనికి నిద్రలో మహా పలవరింతలు వచ్చినవి He had the *night-mare* very severely last night. కలవరింత Item.

పల్లు *sub*. పంటి। పళ్ళు. A tooth. పళ్ళ నొప్పి The tooth-ache. N. B. పళ్లు is the name properly given to the front teeth. The *side teeth* are called కోరలు and the *back teeth* దంతాలు. vide these words. పలు వరస A row of *teeth*.

పలుకడం *v. n.* పలుకుతూ। పలికి. To speak; to make reply. అతణ్ని పిలిపించి యేమి పలికినావు? When you called him what did you say?

పలుకరించడం *v. a.* పలుకరిస్తూ। పలుకరించి. To call, for any purpose. అతణ్ని మా యింటికి భోజనానికి రమ్మనుమని పలుకరించు Call him to eat victuals in my house. నిన్న చెప్పిన మాటకు యేమంటాడో పలుకరించు Make him tell what he would say to what I said yesterday.

పలుకు *sub*. పలుకు। పలుకులు. Speech; word; the inside or substance of seeds. కుంకుడు విత్తులో పలుకు The *inside* of soap-nut *seed*. This is eaten by children, vide కుంకుడు కాయ.

ప్లలుగు *sub*. పలుగు।పలుగులు. Violence; intemperance; bad conduct; the name for an *iron crow*. పలుగు వాడు An *unruly* character. గడ్డ పలుగు An *iron crow*. పలుగు రాయి A *small stone*, generally met with in the sand of dried up rivers.

పలుమారు *adv*. Often; repeatedly. యీ మాట పలుమారు చెప్పవద్దు Do not tell me this word *over* and *over again*.

పల్లె *sub*. పల్లెటి। పల్లెలు. A village. పల్లెటూరు A village. పల్లెటూరి వాడు A *village* man or clown or *country* man. పల్లె వారు is the name of *fishing people*, in particular.

పశి *adj*. Infant; not mature. పశిబిడ్డ An *infant* or *very young child*. పశి దూడ or లేగ A *very young* calf. పశికాయ *Tender young* fruit. పశి పట్టడం To *discover* by the *smell*. పశితనం *Infancy*; *childhood*. అతణ్ని పశితనం నాటినుంచి బాగా యెరుగుదును I know him extremely well, from his *infancy* upwards.

పశువు *sub*. పశువు। పశువులు. Cattle or kine. పశువులు మేతకు వెళ్ళినవి The *cattle* have gone to graze. పశువులను కాచేవాడు

A ***herdsman.*** పశువుల డెక్క The *hoof* of *cattle.* పశువుల మంద A ***herd*** of cattle.

పసందు ***adj.*** Comely; handsome.

పసరం ***sub.*** పసరపు । పసరములు. Cattle. vide పశువు.

పసరు ***sub.*** పసరు। పసర్లు. The name given to the tinged water, squeezed from different vegetables, which the Indians mix up in particular medicines. పసరు is the name given to *vomits,* produced from bile. అతనికి పైత్యంచేత చాలా పసరు వెళ్ళినది Being bilious, he has *vomited* a great deal of ***bilious stuff.***

పస్తాయించడం ***v. n.*** పస్తాయిస్తూ। పస్తాయించి. To repent; to regret or feel ashamed. అతను అన్న మాటలకు నేను చాలా పస్తాయించినాను I *felt* great *shame,* for the words that he uttered. నేను యీ పని తెలియక చేశినానని పస్తాయించినాను I did that thing without knowing and *repented* of it.

పసుపు ***sub.*** పసుపు । పసుపులు. Turmeric. This is the common ingredient of the curries of the Indians and what causes its yellow colour. Hence the colour of yellow is called పసుపు. The *round yellow mark* made by Indians on their foreheads is made up of turmeric. కస్తూరి పసుపు A species of *scented turmeric.*

పహరా ***sub.*** పహరా। పహరాలు. A sentinel; confinement: that is, ***under sentinels.*** పహరా శిపాయీలు Sepoy ***sentinels.*** పహరాలో వెయ్యడం To *put* under *confinement.*

పళ్ళిక ***sub.*** పళ్ళిక। పళ్ళికలు. A round flat basket used by tank-diggers and work people in general.

పక్షమందు ***conj.*** If; supposing; provided. నీవు వచ్చే పక్షమందు మా యింటికి వెళ్ళి వర్తమానం తెలుసుకుని రా ***Provided*** you are coming, you go to my house and learn the news there and return. నీవు రాని పక్షమందు నీ తమ్ముణ్ణి పంపించు ***Supposing*** you are not coming, send your brother.

medicine originally brought from China.

ఫిరంగి *sub.* ఫిరంగి। ఫిరంగిలు. A cannon. ఫిరంగి వెయ్యడం To fire a *cannon* or *gun.* వాడ వచ్చినది గనక కోటలో ఫిరంగిలు వేశినారు A ship having arrived, they *fired* the *guns* in the fort for her. ఫిరంగి గుండు A *cannon ball.* ఫిరంగి వత్తి The *match.*

ఫిరియాదు *sub.* ఫిరియాదు। ఫిరియాదులు. A complaint; accusation. ఫిరియాదు చెయ్యడం or కావడం To make *complaint.* అతను నామీద ఫిరియాదు అయినాడు He has *complained* against me. అతను నేను సొమ్ము దొంగిలినానని ఫిరియాదు చేసినాడు He has *accused* me of stealing money. ఫిరియాదుదారుడు A *complainant.*

ఫీ

ఫీజు *sub.* ఫీజు. Fees; the allowed percentage to pleaders on the regulated amount of causes decided in court.

బ

బజంత్రీ *sub.* బజంత్రీ। బజంత్రీలు. A musical performer. బజంత్రీల మేళం A set or band of *musical* performers. These generally consist of six people: that is, one pair of large *cymbals*, the *sonnaye* or pipe, the *suttee*, the *doaloo*, the *veeranum* and the *narraga.* They are employed at the pagoda or at marriages and ceremonies.

బజ్జినస్సు *sub.* బజ్జినస్సు। బజ్జినస్సులు. Detail; particulars.

బట్ట *sub.* బట్ట। బట్టలు. Linen cloth: generally speaking, that manufactured in India. సన్నపు బట్ట *Fine cloth.* ముతక బట్ట *Coarse cloth.* బట్ట నెయ్యడం To *weave cloth.* బట్టకుంబీ చెయ్యడం To *bleach cloth.* N. B. The word బట్టలు is also generally used for *wearing clothes.* బట్టలు తొడగడం To dress *clothes.*

తెల్ల బట్టలు Clean *clothes*. నా బట్టలు అన్నీ చాకలివాడికి వుతక వేశినాను I have given all my *clothes*, to the wash. N. B. There is no proper word in Telugu for our word to *wear out*, as applied to *clothes*. బట్ట తల *Bald*-headed. బట్ట యెద్దు or గుఱ్ఱం A *roan coloured* bullock or horse.

బట్టి ***sub.*** బట్టి। బట్టిలు. A water-channel. vide కాలువ.

బడాయీ ***sub.*** బడాయీ। బడాయీలు. Pride; haughtiness; arrogance. బడాయీ ఖోరు A *proud* or *scornful* man. బడాయీ మనిషి Item. బడాయీ గల *Proud*; *haughty*.

బద్ద ***sub.*** బద్ద। బద్దలు. A piece; a fragment or shaft. కాయ బద్దలు *Pieces* of fruit: that is, cut in readiness for dressing. కఱ్ఱ బద్ద A *piece* of wood. బద్దలు కొట్టడం To *cut* or *break* into *pieces*. అతను కఱ్ఱపుచ్చుకుని లాంతరు బద్దలు కొట్టినాడు He took a stick and *broke* the lantern into *pieces*. వింటిబద్ద A *bow*, in archery. పోక బద్ద *Betel nut*.

బదిలీ ***sub.*** బదిలీ। బదిలీలు. A change of situation; a removal to another place. బదిలీ చెయ్యడం To *remove* or *change*. అతణ్ని ఆ వుద్యోగంలోనుంచి బదిలీ చేశినారు They have *removed* him from that employment: that is, they have *put* some body else *in his place*.

బదులు ***sub.*** బదులు। బదుళ్ళు. A debt; a loan; an exchange. బదులు చెయ్యడం or పుచ్చుకోవడం To *borrow*. బదులు యివ్వడం To *lend*.

బద్ధకం ***sub.*** బద్ధకపు। బద్ధకాలు. Laziness; indulgence; lassitude. బద్ధకుడు An *indolent*, *lazy* man. బద్ధకం కలవాడు Item.

బద్ధకించడం ***v. a.*** బద్ధకిస్తా। బద్ధకించి. To idle; to trifle. అతను పని చెయ్యక బద్ధకించినాడు He neglected his business and *idled* his time.

బనాతు ***sub.*** బనాతు। బనాతులు. The name given to broad cloth in general.

బంక ***sub.*** బంక। బంకలు. Gum.

బంగారపిచ్చిక ***sub.*** బంగారపిచ్చిక। బంగారపిచ్చికలు. The name of a

small yellowish bird, that builds very curious hanging nests. This bird is taught to dive into a well after a ring which it seizes before the ring sinks to the bottom and brings out in its bill. Properly బంగారు పిచ్చిక.

బంగారం *sub.* బంగారపు। బంగారాలు. Gold. బంగారం కరగడం To melt *gold.* బంగారపు నగలు *Golden joys* or jewels. బంగారంతో చేసిన *Made* of *gold.* మేలిమి బంగారం *Pure gold.* కోరా బంగారం *Adulterated gold.*

బండ *sub.* బండ। బండలు. A stone, in common: not applied to precious stones.

బండారం *sub.* బండారపు। బండారాలు. An estate; a property. అతని దగ్గిర మహా బండారం వున్నది That man has got a very ample *estate.* అతడు మా తమ్ముడితోటి పోట్లాడినాడట, యిప్పుడు బైటికి రమ్మనుమను తన బండారం అగపరుస్తాను That man has fought with my younger brother, for which reason call him out here and I shall soon see *what* he *is made* of.

బండి *sub.* బండి। బండ్లు. A wheel; also, a cart or a conveyance. It is as often used for the *wheel,* as for the *body* of it. నకటా బండ్లు The *wheels* of a cart. రథపు బండ్లు The *wheels* of the Swamy coach or chariot used in temples. యెడ్ల బండి A bullock *cart.* గుర్రపు బండి A one-horse *carriage* or *bandy.* రెండు గుర్రాల బండి A two-horse *bandy* or *carriage.*

బంతి *sub.* బంతి। బంతులు. A ball. బంతి ఆడడం To play at *ball.* That played with by the Indians is stuffed with piece of gunny or hemp and covered with thin leather. బంతి చెట్టు is the name of a *bush* that yields a flower like the *stock.* పూల బంతి A *bunch* of flowers. యెడ్ల బంతి is the name given to *strings* of bullocks, employed to thrash the grain.

బందివాను *sub.* బందివాను। బందివానులు. A prisoner.

బందు *sub.* బందు। బందులు. A hinge. తలుపు బందులు. The *hinges* of a door. పెట్టె బందులు The *hinges* of a box. బందు is the

name of a large ravenous bird, commonly called the *adjutant*.

బంధువుడు *sub.* బంధువుడి। బంధువులు. A relation or connection by alliance. బంధువురాలు A female *connection* or *relation*. యీవేళ పండుగ గనక మా బంధువులు అంతా మా యింటికి వచ్చినారు This being a feast day, the whole of my *relations* are come to my house. బంధుత్వం Relationship.

బ్రతకడం *v. a.* బ్రతుకుతూ। బ్రతికి. To exist; to live; to subsist. యీ రోగంలో అతను బ్రతకడం మహా కష్టం It will go hard with him to *survive* this illness.

బ్రతుకు *sub.* బ్రతుకు। బ్రతుకులు. A living; existence; support. చావు బ్రతుకులు దేవుని ఆధీనం *Existence* and death are in the power of God.

బ్రహ్మదేవుడు *sub.* బ్రహ్మదేవుని। బ్రహ్మదేవులు. The name given to one of the deities of the Hindoos, understood by them to possess the creative power.

బరకడం *v. a.* బరుకుతూ। బరికి. To scratch. బరుక్కోవడం To scratch himself.

బరతరపు *sub.* బరతరపు। బరతరపులు. Dismissal; discharge from service. బరతరపు చెయ్యడం To *dismiss*. కుంఫిణీ నౌకర్లను శానా మందిని బరతరపు చేసినారు They have *discharged* a great many people from the Company's service.

బరమా *sub.* బరమా। బరమాలు. An auger. This differs from the European tool in having a bow to turn it by, the string of which is twisted twice round the *bit* of the *auger*, the bow being held and moved with one hand and the auger directed with the other hand.

బరాతం *sub.* బరాతపు। బరాతాలు. A revenue term signifying *an order* for *money*. వూరిమీది బరాతం *An order* for *money* on a village. బరాతం వ్రాయడం To write *an order* for *money*.

బరి *sub.* బరి। బర్లు. A school. చిన్నవాళ్ళు బరిలోకి వెళ్ళినారు The

boys have all gone to *school.* బరి పెద్ద The head boy of the *school.* It is the custom in the Indian schools, when one boy becomes perfect in his lessons, to make him repeat them and teach them to the other boys. బరి also means a *person's side;* also, a *boundary* or *line* of *distinction.* బరి also, means a *naked* or *bare back.* బరి గుర్రం A horse, *without covering.* బరిమేన్ను The body *bared.* బడి Item.

బరిజెపురుగు *sub.* బరిజెపురుగు, బరిజెపురుగులు. The name of the nauseous insect, commonly termed *cock'roach.* బరికెపురుగు Item.

బరిశె *sub.* బరిశె, బరిశెలు. The name of a spear, generally used for state, slender and terminating in a grooved head and thin point, made of one piece of tempered iron, ornamented with tassels. బరిసె Item.

బరువు *sub.* బరువు, బరువులు. A load; a weight; a burden. బరువు మొయ్యడం To carry a *load.* ఒంటెపిట్టలు గొప్ప బరువు మోస్తవి The camels carry a great *weight.*

బల్ల *sub.* బల్ల, బల్లలు. A plank; a board; a table. మేజాబల్ల A *table,* partly derived from the Hindustani. ఆ బల్లమీది వస్తువులు తీసుకొని రా Bring me the things from that *table.* బల్ల సొరుగు A *table drawer.* కడుపులో బల్ల is the name given to the *pressure* in the *stomach,* from extreme costiveness.

బలపం *sub.* బలపము, బలపాలు. The name of the stone with which the Indian boys write on their tablets, which are black, the mark made by this stone becoming white.

బలం *sub.* బలము, బలాలు. Strength; might; force; hence, it also means, an army. అందరికంటె అతనికి బలం యెక్కువ His *strength* is superior to that of all the others. పగవాళ్ళ దండు వస్తుందిగాని మనకు బలం యెక్కువవున్నది గనక త్వరగా కొట్టివెయ్య వచ్చును The enemy's *army* is coming, but, as we have a superior force, they must soon be beaten back. బలంగా *Stoutly; vigorously.* బలమైన *Stout; hearty; valiant.*

చదరంగపు బలం *Chess-men.*

బలవంతం **sub.** బలవంతపు. బలవంతాలు. Constraint; force; compulsion; oppression. బలవంతం చెయ్యడం To *oppress; to constrain.* నన్ను వూరికే రమ్మనుమని బలవంతం చేసినాడు He sent to call me away in a vexatious manner and greatly *oppressed me.*

బలహీనం **sub.** బలహీనపు. బలహీనాలు. Weakness; want of strength. బలహీనపు మనిషి A *weak* man.

బలి **sub.** బలి. బలులు. A sacrifice; an offering. These are of various kinds, some of grain and some of meat, all practised according to the Hindoo rites. యీ వూరి గ్రామ దేవతకు బలి నిమిత్తమై నాలుగు గొర్రెలను తీసుకుని వచ్చినారు They have brought four sheep, as a *sacrifice* to the idol of this village. బలి యివ్వడం To perform a *sacrifice.*

బల్లి **sub.** బల్లి. బల్లులు. A lizard. మాల బల్లి The pariah *lizard.* This is a distinction or nick-name given to such lizards as are uncommonly black.

బలియడం **v. a.** బలుస్తూ. బలిసి. To strengthen; to get stout; to fatten. అతనికి తిండిపుష్టి బాగా వున్నందున మహా బలిసినాడు He has *grown* very *fat* and *stout* from extraordinary good living.

బలువు **adj.** Heavy; weighty. బలువుపల్లకీ A *heavy* palanquin.

బల్లెం **sub.** బల్లెపు. బల్లెములు or బల్లాలు. A spear. పంది బల్లెం A hog-*spear.* బల్లెంతో పొడవడం To strike with a *spear.* This kind of spear has a head or blade, sometimes a foot and a half in length and six or seven inches in breadth, extremely sharp. It is held firmly by the shaft, when the beast is struck and not delivered.

బస **sub.** బస. బసలు. Temporary lodging; not in your own house. బస యిల్లు The house in which you *lodge.* బస చెయ్యడం or చేసుకోవడం To *lodge.* బస కుదర్చడం To furnish *lodgings.* అద్దె బస A let or hired *lodgings.* ఆ వూళ్ళో వక కోమటి అద్దె బస

కుదిర్చినాడు గనక అక్కడనే దిగినాను There being *hired lodgings* furnished at a banian's in that village, I took up my *lodging* there.

బస్తా *sub.* బస్తా। బస్తాలు. A bale. బస్తాలు కట్టడం To *bale* goods. This is a term used in the Commercial Department.

బస్తీ *sub.* బస్తీ। బస్తీలు. The name for any large populous town. ఆ పట్నము మునుపు పాడుగావున్నది గాని యిప్పుడు బస్తీ అయినది That *town* was lately in a ruinous state, but is now become a *populus city.*

బహానా *sub.* బహానా। బహానాలు. Pretence.

బహు *adj.* Many; much; a great number. బహుమంది A *great number* of people. బహు మూత్రం A *diabetes.* బహు సంతోషం *Much* pleasure. బహుమానం A *present.* బహు వచనం The *Plural Number* in Grammar.

బహుళం *sub.* బహుళపు। బహుళాలు. The decrease of the moon. A term given to the last fifteen days of the Telugu month, considered the period when the *moon* is in its *decrease.*

## బా

బాకా *sub.* బాకా। బాకాలు. A large trumpet, such as they use at feasts, consequently, sufficiently harsh and noisy.

బాకీ *sub.* బాకీ। బాకీలు. Balance due or debt. బాకీ వుండడం To owe or be in debt. అతను నాకు శానా రూపాయీలు బాకీ వున్నాడు He *owes* me a large sum of money. బాకీ దారుడు A *debtor.* బాకీ తీరడం A *debt* or *balance* to clear itself. బాకీ తీర్చడం To clear a *debt.*

బాకు *sub.* బాకు। బాకులు. A dagger or what is generally called *creese.* The *baakoo* has a curved and fluted blade and makes an uneven and therefore the more fatal wound.

బాగా *adv.* Healthy; prosperously; properly. అతను బాగా వున్నాడు He is *well.* యీమాట నాకు బాగా తెలిసినదికాదు I do not *properly* comprehend this word. అతని పని బాగా జరుగుతూ వున్నది His affairs are *getting on very well.*

బాగు *adv.* Well; properly; rightly. అలాగుచేస్తే బాగు If you do so, *well and good.* బాగు వోగులు *Good* and *bad.* బాగు చెయ్యడం To *make right*; to *repair.* యిల్లు బాగుచెయ్యడం To *repair* a house or *set* it to *rights.* మేజాబల్ల కాలు విరిగిపోయినందున బాగు చెయ్యడానకు పంపించినాను The leg of the table being broke. I have sent it to be *repaired.* మహా బాగు *Very well.* మహా బాగు, అట్లాగు చేస్తాను *Very well,* I will do so.

బాజా *sub.* బాజా। బాజాలు. Music or musical performance. బాజాగీజా The general term for the *music* brought to nautches or to feasts. బాజా వాయించడం To *perform* on *musical instruments.*

బాజారు *sub.* బాజారు। బాజార్లు. A market; better known by the name of *bazaar.* బాజారు ఖబరు *Bazaar* news. This is supposed synonymous with fabricated rumour or false report or the lie of the day.

బాడిగ *sub.* బాడిగె। బాడిగెలు. A rent. vide అద్దె.

బాడిశె *sub.* బాడిశె। బాడిశెలు. An axe. The proper word is బాడిసె.

బాణం *sub.* బాణము। బాణాలు. An arrow. బాణా కర్ర means a heavy *bar* or *stick* of wood, used to exercise the arms by the Indians.

బాణసంచా *sub.* బాణసంచా। బాణసంచాలు. A firework, the different kinds of which have each their particular name.

బాతిసీ *sub.* బాతిసీ। బాతిసీలు. A spy. అతను పట్నములో సంగతులు తనకు తెలుస్తూ వుండేగలందులకు బాతిసీలను వుంచినాడు He has placed *spies* in the town, to get information of what is happening there.

బాదడం *v. a.* బాదుతూ, బాది. To flog; to beat; to chastise. చాకలవాడు బండమీద బట్టలు బాదుతున్నాడు The washerman beats the clothes on a stone. పిల్లను బాదడం To chastise a child.

బాదంకాయ ***sub.*** బాదంకాయ, బాదంకాయలు. An almond.

బాన ***sub.*** బాన, బానలు. This is a large thick earthen pot of an oval shape, in which washermen parboil the clothes they have to wash. These pots are fixed on country cots, to float travellers across small rivers, during the rainy season.

బానిస ***sub.*** బానిస, బానిసలు. A female slave.

బాబతు ***adj.*** Respecting; regarding. లెక్క బాపతు ***Regarding*** an account.

బాబు ***sub.*** బాబు, బాబులు. Father. This term is used in the same way as అయ్య to imply respect or by way of address to a superior, in the course of conversation. అవును బాబు Yes, sir or yes, father. లేదు బాబు Not so, sir. vide తండ్రి or అయ్య.

బ్రాహ్మణుడు ***sub.*** బ్రాహ్మణుని, బ్రాహ్మణులు. A Brahmin.

బార ***sub.*** బార, బారలు. Generally called *fathom.* It is considered a measurement of six feet or the full extent of the stretched out arms. అతనితోట యాభైబారల పొడుగూ, యిరవై బారల వెడలుపూ వున్నది That man's garden is fifty ***fathoms*** long and twenty ***fathoms*** broad.

బారచాపు ***sub.*** బారచాపు, బారచాపులు. The name of what we term ***long cloth.***

బారు ***sub.*** బారు, బార్లు. A load or charge of a gun. బారు చెయ్యడం To load or charge. తుపాకులూ, ఫిరంగీలూ బారుచేసి సిద్ధముగా వుంచినారు They have ***loaded*** the musketry and cannon and have them all in readiness. చతురంగ బలాలను బారు తీర్చడం To ***prepare*** the troops or ***draw out*** the line for

action. చెట్లు బారుగా వెయ్యడం To *plant* trees in a *line* or *row*. బారు జవానులు A term applied to sepoys. బారు also means, *liberality*.

బాల్యం *sub.* బాల్యపు। బాల్యాలు. Infancy.

బావ *sub.* బావ। బావలు. A brother-in-law.

## బి

బిగించడం *v. a.* బిగిస్తా। బిగించి. To cause to tighten or make fast. మంచపు నవారు బిగించడం To cause the strings of the cot *to be tightened*. ఆ మూట బిగించి కట్టు *Tighten* and *tie* that parcel: that is, let it be *bound tight*.

* బిగియడం *v. a.* బిగిస్తా। బిగిసి. To tighten; to make fast; to shew pride. అతను పిలిచినకొద్ది బిగుస్తాడు If you call him ever *so* much he keeps *tight* or fast: that is, proud in contempt.

బిగ్గరా *adv.* Loud. బిగ్గరా మాట్లాడడం To speak loud; to vociferate.

బిగువు *sub.* బిగువు। బిగువులు. Tightness. బిగువుగా *Tightly* or in a *tight manner*. బిగువైన *Tight*. అంగరఖా వంటికి మహా బిగువు The jacket is extremely *tight* to the body. బిగువుగా వుండడం To be *tight*; to be *proud* or *supercilious*.

/ బిచ్చము *sub.* బిచ్చపు। బిచ్చాలు. Alms, got by begging. బిచ్చం ఎత్తుకోవడం To *beg* or to *receive alms*. బిచ్చం పెట్టడం To *give alms*. బిచ్చపు వాడు A *beggar*. యీ వూళ్ళో శానామంది బిచ్చపువాళ్ళు వున్నారు This town has got a great many *beggars*.

బిడ్డ *sub.* బిడ్డ। బిడ్డలు. A child; an offspring: that is, a person's child. నా బిడ్డ My *child*. ఆవిడెకు యెందరు బిడ్డలు వున్నారు? How many *children* has she got? N. B. This word బిడ్డ is only applicable *to child*, in the sense of a person's offspring and not to *child*, as referrible to age. బిడ్డ తల్లి A *mother*, whilst she gives milk.

బిడాయించడం *v. a.* బిడాయిస్తూ। బిడాయించి. To enclose. యీ వుత్తరంలో మీకు పదివేల రూపాయీల హుండి బిడాయించి పంపించినాను I have *enclosed* and herewith transmit you a bill for ten thousand rupees.

బిడారు **sub.** బిడారు। బిడార్లు. The name given to any number of bullocks, proceeding together, loaded with grain. It is also the name given to loads of grain, when placed in heaps. బజారుకు విస్తరించి గోధుముల బిడార్లు తీసుకుని వచ్చినారు They have brought a great number of *bullock loads* of wheat to the bazaar.

బిందె **sub.** బిందె। బిందెలు. A brass pot.

బియ్యం **sub.** బియ్యపు। బియ్యాలు. Rice. సన్న బియ్యం Fine *rice.* ముతక బియ్యం Coarse *rice.* వుప్పుడు బియ్యం Cargo *rice* or boiled *rice.* పచ్చిబియ్యం Fresh or raw *rice*: that is, the *rice* produced from the crops of the season. అచ్చు బియ్యం Clean, unmixed *rice.* చే బియ్యం Half-beat *rice.* దంపుడు బియ్యం Full-beat *rice.* N.B. The former is generally kept for exportation, the other or full-beaten rice is made use of for home-consumption. పిట్టు or వాశన బియ్యం *Fine rice*, eaten with ghee and sugar. వెదురు బియ్యం A name given to the *seeds* of the bamboo, which the Indians in the jungles boil and eat in lieu of *rice.* In this manner the word బియ్యం is used for the *seeds* of other grains, capable of being eaten like *rice.*

బిరడా **sub.** బిరడా। బిరడాలు. The name of the *peg*, on which the string is tied, in a musical instrument. It is also the name of the *peg*, put into the wooden bottles, used by the Indians. Also in leather-vessels.

బిరదావళి **sub.** బిరదావళి। బిరదావళ్ళు. The name given to the *head* of a *letter*, in the style of eastern addresses, in which titles are commonly inserted. ఆ వుత్తరంలోను అతనికి వ్రాసే మర్యాద చొప్పున బిరదావళి వ్రాయి Let the *head* or *title* to

that letter contain every thing, which he is by custom entitled to.

బిరుదు *sub.* బిరుదు। బిరుదులు. A title, such as the zemindars are possessed of, as derived from ancient authorities of their Kings or from the time of the Mogul Government. బిరుదు is also the name given to those *marks* of *merit*, bestowed by Rajahs on their servants, in the shape of *Gold hand rings* and sometimes *rings* on the *leg*.

బిలమక్తా *sub.* బిలమక్తా। బిలమక్తాలు. This is a revenue term signifying a *fixed quit rent*.

బిళ్ల *sub.* బిళ్ల। బిళ్లలు. The name given to the *flat tiles*, placed under the round tiles and also, for the *round tile* itself. బిళ్ల is also a peon's *badge*. నాటు బిళ్ల A name given to the ***round tiles*** or ***pantiles***. పలాస్త్రి బిళ్ల The *flat tile*. బంట్రోతులు వేసుకునే బిళ్ల A *peon's badge*. They are commonly round, made of silver or brass and the name of the master or the office of the peon, written on them. బిళ్ల means also a *bump* or *swelling*, in any part of the body.

బీ

బీటిక *sub.* బీటిక। బీటికలు. A crack. బీటిక వాయడం To *crack*. ఆ అద్దం రెండుమూడు చోట్ల బీటిక వాశినది That looking glass is ***cracked***, in two or three different places.

బీడు *sub.* బీటి। బీళ్ళు. Pasture land.

బీద *adj.* Poor; needy. బీదవాడు A *poor* man. బీదరిలడం To grow *poor*. బీదతనం *Poverty*. అతను బీదతనంచాత చిక్కిపొయ్యినాడు He is quite thin in consequence of his *poverty*.

బీర *sub.* బీర। బీరలు. The name of a *plant*, that produces a ***vegetable*** very much used in India, of a long shape and

grooved. బీరకాయ the *beerakaye* or the sharp-angled cucumber.

## బు

బుక్కా **sub.** బుక్కా, బుక్కాలు. The name given to certain *aromatic roots* of an agreeable flavour that are reduced to a *powder* of a whitish colour, which, at marriages or feasts and entertainments amongst the Indians, is thrown at each other and particularly at the nautch girls. బుక్కావాడు The *person* who *makes* and disposes of the *powder*.

బుగ్గ **sub.** బుగ్గ, బుగ్గలు. The cheek; also, a water bubble. నీళ్ళబుగ్గ A *water bubble.* బుగ్గ means also a *body* of *water*, suddenly forced up as in the digging of a well.

బుజ్జగించడం *v. a.* బుజ్జగిస్తూ, బుజ్జగించి. To caress; to fondle; to pacify. ఆ చిన్న వాణ్ని ఏడవకుండా బుజ్జగించు *Fondle* that child and keep it from crying. ఆ ఆడది విచారంగా వున్నందున నేను బుజ్జగించి, సమ్మతిచేశాను That woman being in great tribulation, by soothing words I *pacified* her.

బుజం **sub.** బుజపు, బుజాలు. The shoulder. ఆ బోయీలకు బుజం కలిశనది కాదు Those palanquin boys' *shoulders* do not agree.

బుట్ట **sub.** బుట్ట, బుట్టలు. Any small basket. తోటమాలి బుట్టతో పండ్లు తెచ్చినాడు The gardener has brought some fruit in a *basket.* N. B. They are small and round.

బుడ్డి **sub.** బుడ్డి, బుడ్లు. An *earthen pot* with a small mouth to it, generally used by gardeners. బుడ్డి చెంబు A *small* round *brass pot.* సిరా బుడ్డి An *ink-bottle* generally made of brass, used by the Hindoos.

బుడిబుక్కలవాడు **sub.** బుడిబుక్కలవాని, బుడిబుక్కలవాళ్ళు. A kind of *fortune-tellers*, who dress themselves fantastically and carry a small noisy drum in their hands, which is agitated

and makes a constant noise, to imitate the sound of which this word has been framed.

బుధవారం *sub.* బుధవారపు। బుధవారాలు. The day we call Wednesday.

బుద్ధి *sub.* బుద్ధి। బుద్ధులు. Sense; reflexion. యీలాగంటి పనులు చెయ్యడానికి నీకు బుద్ధి లేదా? Have you no *sense*, that you should do such an act as this? బుద్ధితప్పి నేను యీ నేరం చేసినాను I lost my *senses* and did this crime. బుద్ధిమంతుడు A *sensible* man. బుద్ధికల *Sensible; clever.* బుద్ధిలేనివాడు or బుద్ధిహీనుడు A *stupid* fellow. బుద్ధిహీనత *Stupidity.* బుద్ధిచెప్పడం To *admonish.*

బుంగ *sub.* బుంగ। బుంగలు. The name of a *basket* of a *long shape*, in which fruit is commonly transported for sale from one country to another.

బుర్ర *sub.* బుర్ర। బుర్రలు. A nut or shell. It is generally applied to the *nut* of a *fruit* such as the *cocoanut*, after the meat or inside is scooped out. కొబ్బరికాయ బుర్ర The *shell* of a *cocoanut.* సొరకాయ బుర్ర The *empty shell* of a very large species of water melon or pumpkin, which, being dried, is used in rivers when the rains swell them by people who support themselves on them and swim into the middle of the stream to seize on timbers.

బురకా *sub.* బురకా। బురకాలు. A covering. పాలకీ బురకా A palanquin *covering* or *boorka.*

బురద *sub.* బురద। బురదలు. Mud; mire. నీళ్ళు, బురదా *Mud* and water. బురద నేల *Muddy ground.*

బురుజు *sub.* బురుజు। బురుజులు. An outwork in a fort; a *bastion.*

బులాకీ *sub.* బులాకీ। బులాకీలు. An *ornament* of women, fixed by a small pin through the gristly part *of the nose,* immediately between the two nostrils.

బువ్వ *sub.* బువ్వ। బువ్వలు. Victuals. This word is proper Telugu,

but is now used only by common people or when speaking to children.

## బూ

బూచి **sub.** బూచి। బూచులు. The term given to the ***demon***, called upon by nurses in India to frighten children. It is meant for ***the devil.***

బూజు **sub.** బూజు। బూజులు. Mildew. బూజు పట్టడం To ***get mildewed.*** శిరా బూజుపట్టినది The ink has ***got mildewed.***

బూడిద **sub.** బూడిదె। బూడిదెలు. Ashes. కర్ర బూడిద The ***ashes*** of wood. అతణ్ని దహనంచేశిన తరువాత అతని బూడిద కృష్ణలో కల్పినారు After burning that man's body, they mingled his ***ashes*** with the waters of the river Kistnah.

బూతు **sub.** బూతు। బూతులు. Abuse or bad language. అతను నన్ను బూతులు తిట్టినాడు He ***abused*** me by giving me ***bad language.***

బూర **sub.** బూర। బూరలు. A blowing horn, which is of different sizes, some made of horn and some brass. బూర వూదడం To ***blow*** or ***wind*** a ***horn.***

## బె

బెణకడం **v. a.** బెణుకుతూ। బెణికి. To sprain. అతను నడుస్తూవుండగా కాలుజారి బెణికినది As he was going along, his foot slipt and got ***sprained.***

బెత్త **sub.** బెత్త। బెత్తలు. The name given to the ***thing measured*** by the ***palm***, in contradistinction from the measurement itself, which is called బెత్తెడు.

బెత్తం **sub.** బెత్తము। బెత్తాలు. A ***rattan***, commonly used in India to inflict punishment with. The bottoms of chairs are

twisted with them. బెత్తం అల్లడం or వెయ్యడం To *rattan*. బెత్తపు చాప A *rattan* mat.

బెత్తెక *sub.* బెత్తెక, బెత్తెకలు. A word applied to the *flakes* of *chunam*, which sometimes fall off a wall or ceiling.

బెత్తెడు *sub.* బెత్తెడు, బెత్తెళ్ళు. A measurement of *four fingers* or *four inches* called a *hand* or a *palm* in English.

బెదరడం *v. n.* బెదురుతూ, బెదిరి. To start; to fear; also applied to a person's nose suddenly bleeding. గుర్రం బెదరడం A horse to be *frightened* and *start*. అతను నామీద కోపం చేసినందున నేను మహా బెదిరినాను He was angry with me, at which I was very much *frightened*. ముక్కు బెదరడం The *nose* to *bleed*.

బెదిరించడం *v. a.* బెదిరిస్తూ, బెదిరించి. To frighten; to alarm. అతను నన్ను కొట్టుతానని బెదిరించినాడు He *frightened* me by saying he would beat me.

బెదురు *sub.* బెదురు, బెదుళ్ళు. Fear; alarm. ఆ గుర్రముకు మహా బెదురు వున్నది That horse seems to be under great *alarm*.

బెల్లం *sub.* బెల్లపు, బెల్లాలు. The name for a coarse kind of sugar manufactured in India, almost black, very clammy and little better than molasses brought to a state of consistence. It is commonly known by the name of *jaggery*.

## బే

బేడ *sub.* బేడ, బేడలు. Is a term in *money*, meaning *one eighth* or the *half* of a *quarter*, calculated by the rate at which the pagoda or rupee exchanges in the bazaar. బేడ డబ్బులు *One eighth*, in dubs. బేడ also means, a description of *gold beads*, worn in women's necklaces.

బేరం *sub.* బేరపు, బేరాలు. A cheapening; a lessening of the price. బేరం చెయ్యడం To *cheapen*; to *bid* for a thing. ఆ కొండ్రుకు

అతను పదిరూపాయీలు చెప్పితే నేను యెన్మిది రూపాయీలకు బేరంచేశి పుచ్చుకున్నాను That man having asked ten rupees for his bullock, I *cheapened* him down and only gave him eight.

బేరిజు *sub.* బేరిజు। బేరిజులు. A revenue term, signifying the *total* of an account. It is also understood for the *amount* of *revenue* in a district. లెక్కబేరిజు *Total* of an account. తాలూకా బేరిజు The *total revenue* of a district.

బేసరి *sub.* బేసరి। బేసర్లు. The name of a *gold ornament* in the shape of a broach worn by women in India, fixed on the right side of the nose and kept close to the flesh, generally in the resemblance of a flower.

## బై

బైట *adv.* Out; outside. బైట వెళ్ళడం or బైటికి వెళ్ళడం To go *outside*. నీవు బైటవుండు, నేను యిక్కడ వుంటాను You stay *outside*, whilst I remain here.

బైరాగి *sub.* బైరాగి। బైరాగులు. A *byraggy*: a term given to a religious association of mendicants of the Hindoo persuasion whose principal residence is at *Benares* or *Kasi*, from whence they emerge into every part of India, in various garbs or rather without a garb, as most of them appear nearly in a state of nature.

బైరి *sub.* బైరి। బైరిలు. The name of a large hawk, very fierce and trained to fly at very large birds, but particularly at the *heron*. They *rake* their game or prey.

బైలు *sub.* బైటి। బైళ్ళు. The name of any open place, outside of a town. బైటి వైపు *Outside*. బైటి యిల్లు A house *outside*.

## బొ

బొక్క *sub.* బొక్క, బొక్కలు. A hole. బొక్క చెయ్యడం To *make a hole.* బొక్క తవ్వడం To *dig* a *hole* or to *burrow.* బొక్క పూడ్చడం To *fill up* a *hole.*

బొక్కడం *v. a.* బొక్కుతూ, బొక్కి. To gorge; to swallow without chewing; to gulp.

బొక్కెన *sub.* బొక్కెన, బొక్కెనలు. The name of the *water buckets* used in India, to draw water up from deep wells by means of bullocks. They are made of leather, brass or iron.

బొగ్గు *sub.* బొగ్గు, బొగ్గులు. Charcoal.

బొచ్చు *sub.* బొచ్చు, బొచ్చులు. Hairiness; wool. అతనికి ఒంటినిండా మహా బొచ్చు వున్నది That man's body is very *hairy.* గొంగళ్ళు గొర్రెబొచ్చుతో చేస్తారు *Blankets* are made of the wool of sheep.

బొజ్జ *sub.* బొజ్జ, బొజ్జలు. A big belly or pot-belly. బొజ్జ కలవాడు A *pot-bellied* man.

బొట్టనవేలు *sub.* బొట్టనవేలి, బొట్టనవేళ్ళు. The thumb. This word is also written బొటమన వేలు.

బొటిమె *sub.* బొటిమె, బొటిమెలు. A pimple. vide చెమట కాయ. మొటిమ Item.

బొట్టు *sub.* బొట్టు, బొట్లు. The name of the *mark* on the *foreheads* of the Hindoos. Some have them punctured into the flesh with a needle and an infusion applied, which leaves a dark green mark. That in men is long, up the fore-head from betwixt the eyebrows, that of women, a small dot as big as a pea exactly between the eyebrows. బొట్టు is also the name of the *coloured marks,* some red, some yellow or brown, daily painted on the fore-head by

Hindoos. నీళ్ల బొట్టు A *drop of water.* తాళి బొట్టు means the *necklace,* commonly of gold, put round the bride's neck at *marriages,* as we put on a ring, at our marriages, on the finger.

బొడ్డు *sub.* బొడ్డు। బొడ్డు. The navel.

బొత్తిగా *adv.* Entirely; completely. అతను యీ సంగతి బొత్తిగా తెలియదు He is *entirely* ignorant of this circumstance.

బొరి *sub.* బొరి। బొరులు. The name of the *places* in a *river* or *creek,* dug out of the bank, where country vessels are fastened and get repaired, in the manner of a *dock.*

బొంకడం *v. n.* బొంకుతాను। బొంకి. To speak false; to deceive; to pervert the truth. అతను అక్కడికి వెళ్ళిన్ని వెళ్ళలేదని బొంకినాడు Although he was known to have gone there, he *falsely maintained* that he had not.

బొంకు *sub.* బొంకు। బొంకులు. A falsity. vide అబద్ధం.

బొంగరం *sub.* బొంగరపు। బొంగరాలు. A top, much the same as those used in our schools in England.

బొంగు *sub.* బొంగు। బొంగులు. The general name given to the *long thick bamboos,* cut in the hills and brought to towns for sale, to serve for tent poles or for palanquins or roofs of houses. పాలకీ బొంగు A palanquin *bamboo.* డేరా బొంగు A tent *bamboo.* వెదురు బొంగు A bamboo *pole.* బొంగు పోవడం To be *hoarse,* used in a figurative sense.

బొండ *sub.* బొండ। బొండలు. On apprehending a thief, his hands are put into *pieces* of *wood* tied down upon them, which they call a *bonda.* The Indians had also the practice of fixing the feet in *wood,* in the manner of our stocks, which they also call *bonda.*

బొంత *sub.* బొంత। బొంతలు. The name of the *quilted jackets* worn by the Hindoos in rainy and cold weather; also, the name of the jackets made of broad cloth. *పాంయీలు

బొంతలు Sepoys' *jackets.* బొంత అరటికాయ A ***plantain*** of a ***long shape.***

బొంది ***sub.*** బొంది। బొందులు. The body. vide శరీరం.

బొబ్బ ***sub.*** బొబ్బ। బొబ్బలు. A noise or disturbance, as applied to loud words. బొబ్బ is also the name of a ***blister.*** బొబ్బలు పెట్టడం To ***make*** a ***noise;*** to ***raise*** the ***voice.*** బొబ్బ లేవడం A ***blister*** to ***rise.***

బొమ్మ ***sub.*** బొమ్మ। బొమ్మలు. An image, such as are made by the ***moochy*** people, as ***toys.*** బొమ్మ is also a ***picture,*** in which figures constitute the subject.

బొమికె ***sub.*** బొమికె। బొమికెలు. A bone. vide ఎముక.

బొర్ర ***sub.*** బొర్ర। బొర్రలు. Pot-belly. vide బొజ్జ.

బొరిగె ***sub.*** బొరిగె। బొరిగెలు. A hoe, used for cutting grass for horses in India. vide కోల.

బొల్లి ***sub.*** బొల్లి। బొల్లులు. The leprosy. The appearances of this disorder are not unfrequent in India, but with little other consequence than that of disfiguring the person diseased.

## బో

బోగంది ***sub.*** బోగందాని। బోగంవాళ్ళు. A dancing woman. Properly speaking, a woman of pleasure, from the Sanskrit word భోగం signifying ***pleasure.*** బోగం వాడు A ***dancing man.*** బోగంవాళ్ళు యీరాత్రి ఆడడానికి వస్తారు The ***dancing girls*** are coming to dance to night.

బోడి ***sub.*** బోడి। బోళ్లు. Baldness. బోడితల A ***naked head*** or ***when bare,*** after the hair has been shaved off.

బోధ ***sub.*** బోధ। బోధలు. Intelligence; communication. బోధ పడడం or కావడం To be ***represented;*** to be ***communicated*** or ***made intelligible.*** మీరు చెప్పిన సంగతి యీవత్తూ నాకు బోధ

పడ్డది All the *circumstances* which you have stated, I *understand*: that is, they have become *intelligible* to me. బోధపరచడం or చెయ్యడం To *represent; to render intelligent.* అతను చేసినపని మంచిదికాదని నానావిధాల బోధ పరిచినాను I *stated* to him in a variety of ways, how bad his conduct had been.

బోను *sub.* బోను। బోనులు. A rat-trap or one in which the *bandicoot* (as we term it) is commonly caught. పెద్ద బోను A large *trap,* which is sometimes used for catching tigers. బోను వుంచడం To *set* a *trap.* బోనులో పడడం To be *caught* in a *trap.* నిన్నటిరాత్రి వక పెద్దయెలుక బోనులో పడ్డది Last night, a very large rat was *caught* in the *trap.*

బోయీ *sub.* బోయీ। బోయీలు. A *boey,* commonly called a *palanquin boy.*

బోర్లపడడం *v. a.* బోర్లపడుతూ। బోర్లపడి. To turn over. అతను మంచం మీదను బోర్లపడి నిద్ర పోయినాడు He *turned over* in his bed and fell fast asleep.

బోర్లించడం *v. a.* బోర్లిస్తూ। బోర్లించి. To turn down or to turn over. ఆ గిన్నె బోర్లించు *Turn* that cup *over.*

బోసి *adj.* Toothless. బోసివాడు A *toothless* man.

## భ

భగవంతుడు *sub.* భగవంతుని. (No plural.) The name given to the *supreme being,* who, according to the Hindoos, is comprehended in the three divine powers called *Brahma, Siva* and *Vishnu.*

భత్యం *sub.* భత్యపు। భత్యాలు. Generally known by the name of *batta* in India. It is an *allowance* granted to troops above their stated pay, when employed on service. భత్యం is also the name for *allowance* given to persons or

coolies, to defray *expenses* likely to be incurred on extraordinary occasions.

భద్రం **sub.** భద్రపు। భద్రాలు. Carefulness; attention. భద్రం చెయ్యడం To *take care*; to be *attentive*. vide జాగ్రత.

భంగం **sub.** భంగపు। భంగాలు. Deceit. భంగపడడం To be *deceived*. అతను అబద్ధాలు చెప్పినందువాత నేను భంగపడ్డాను I was *deceived* by the falsehood which he told me. భంగపర్చడం To *deceive*.

భంగించడం *v. a.* భంగిస్తూ। భంగించి. To deceive. అతను యీ పనిలో నన్ను భంగించినాడు He has *deceived* me in this business.

భయం **sub.** భయపు। భయాలు. Fear; alarm; dread. భయపడడం To be *afraid*; to *fear*. భయపెట్టడం To *terrify*; to *frighten*. నేను అక్కడికి వెళ్ళను, నాకు మహా భయంగా వుంటుంది I will not go there, I am too much *afraid*. భయంకరం *Dreadfulness; frightfulness; terribleness.* భయంకరమైన *Dreadful*; *frightful.* భయంకరంగా *Frightfully* or *frightful-like*. నాకు చీకట్లో వెళ్ళడం మహా భయంకరంగా వుంటుంది To me, going in the dark has something *frightful* in it.

భరతపిట్ట **sub.** భరత పిట్ట। భరత పిట్టలు. A species of degenerate *larks* that never rise, nor have they any compass or variety of note. The proper word is బరతు పిట్ట.

భర్తీ **sub.** భర్తీ। భర్తీలు. Fullness. vide నిండా.

భరిణె **sub.** భరిణె। భరిణెలు. The name of a small *round case* or *box* generally kept by women for holding any small trinkets and jewellery. Properly బరిణె.



భాగం **sub.** భాగపు। భాగాలు. A share; a portion. vide పాలు.

భాగ్యం **sub.** భాగ్యపు। భాగ్యాలు. Riches; wealth; fortune. భాగ్యవంతుడు A *rich man*; a man of a *large fortune*.

భాగవతం **sub.** భాగవతపు। భాగవతాలు. This is the title of a

Sanskrit book, translated into Telugu *paddiums*, containing a history of *Lord Sri Krishna*. Out of this book various religious events are extracted, which are framed into the subjects of so many theatrical representations. The goldsmiths and brahmins and *jungom* people and a few dancing people act these plays. They are performed with dancing, recitative songs and music and are the favourite amusement of all ranks of people in India. They are acted only by men, unless where dancing women can be got, sufficiently instructed.

భాగవతుడు ***sub.*** భాగవతుడి. భాగవతులు. A performer of plays. భాగవతుల మేళం A set of *theatrical performers*.

భాగారం ***sub.*** భాగారపు. భాగారాలు. Subtraction in arithmetic. భాగారించడం To *subtract*. ఆ లెక్క పద్దు భాగారించి చెప్పు Make a *subtraction* from the item of that account and tell me what is the remainder. ఆరింట్లో నాలుగు భాగారిస్తే రెండు వుంటవి If you *subtract* four from six, two will remain.

భాట ***sub.*** భాటి. భాటలు. A road. భాటసార్లు A *traveller*. vide బాట. This word should be written బాట.

భాద్రపదం ***sub.*** భాద్రపదపు. భాద్రపదాలు. One of the Telugu months, nearly answering to *September*.

భార్య ***sub.*** భార్యె. భార్యలు. A wife. vide పెళ్లాము.

భావ ***sub.*** భావ. భావలు. A brother-in-law. Properly బావ.

భావి ***sub.*** భావి. భావులు. A well. The proper word is బావి.

భాష ***sub.*** భాష. భాషలు. The Sanskrit for *language*. తెనుగుభాష The Telugu language. భాష also means a provincial dialect and is also applied to a sort of by-speech, adopted by several castes or associations in India, to make their words understood only amongst themselves. These modes of speech are named సాభాష or పుల్లభాష or కాభాష and so on. The words *sa*, *poolla* and *kaa* are added to

each syllable, when they speak, in order to obscure the sound. The banians, silversmiths and some other meaner castes than these, have a distinct mode of speech amongst them called by the name of each trade, such as కంసాల భాష The Goldsmith's *speech.* కోమటి భాష The banian's *speech.*

## భూ

భూకంపం *sub.* భూకంపపు। భూకంపాలు. An earthquake. భూకంపం చాత ఆ వూళ్లో శానా యిళ్ళు బోర్ల పడ్డవి A number of houses have tumbled down due to the *earthquake* in that village.

భూమి *sub.* భూమి। భూములు. The ground. భూమిదున్నడం To cultivate the *ground.* రాతి భూమి Stony *ground.* చవటి భూమి Rank or salt *ground.* పల్లపు భూమి Low *ground.* మెరకభూమి High *ground.* భూమి also means the *whole earth* or the *universe.* యీలాగంటి మనిషిని భూమిలో యెక్కడా చూడలేదు I never saw such a fellow as this in all the *universe.*

భూషణ *sub.* భూషణ। భూషణలు. Flattery; adulation; praise. భూషణచెయ్యడం To *flatter;* to *praise.* అతణ్ని నేను చాలా భూషణ చేసినందున నాకు పదివరహాలు యిచ్చినాడు After having *flattered* him a good deal, he at last gave me ten pagodas.

భూషించడం *v. a.* భూషిస్తూ। భూషించి. To flatter. vide భూషణ.

## భే

భేదం *sub.* భేదపు। భేదాలు. Difference; distinction. నీవు చేసిన పనికి మరియేమీ భేదంలేదు No *difference* can arise from what you have done: that is, what you have done is all *right.* అతనికి నాకూ యేమిన్ని భేదంలేదు There is not any thing *different* between him and me: that is, we are on equal

footing of acquaintance.

భోజనం ***sub.*** భోజనపు, భోజనాలు. A meal. భోజనం చెయ్యడం To ***take*** a ***meal.*** పగటి భోజనం ***Morning meal.*** రాత్రి భోజనం ***Evening meal.*** The ***sudras*** make three ***meals,*** the breakfast at six in the morning, the dinner at twelve and the supper at eight. The other three castes are supposed to make only two meals in the day, about eight or nine o'clock in the morning and about eight o'clock in the evening.

## మ

ముక్తా ***sub.*** ముక్తా, ముక్తాలు. Rent, of which there are several in revenue. బిల్లు ముక్తా *Billmuctah*: a rent for a specific sum.

మకిల ***sub.*** మకిలి, మకిలలు. Dirt; filth. మకిలబట్ట. A ***dirty*** cloth. మకిలకావడం To acquire ***dirt*** or to become ***dirty.*** ఆ యింట్లో మహా మకిలవున్నది, బాగా తుడిచివెయ్యి There is a great deal of ***dirt*** in that house, which, pray! clean out. మకిల చెయ్యడం To make ***dirty.*** మకిలగా. ***Dirtily; dirty-like.***

మక్కువ ***sub.*** మక్కువ, మక్కువలు. Desire; cupidity; inclination ఆ వస్తువమీద నాకు చాలా మక్కువ వున్నది I feel a great ***desire*** for that article. ఆ స్త్రీమీద నేను చాలా మక్కువ పడ్డాను I felt great ***inclination*** for that woman.

మగడు ***sub.*** మగని, మగళ్లు. A husband. This word is generally written మొగుడు.

మగ్గం ***sub.*** మగ్గపు, మగ్గాలు. A loom. మగ్గాన వెయ్యడం To fix a ***loom.***

మచ్చ ***sub.*** మచ్చ, మచ్చలు. A scar. అతను విస్తరించి యుద్ధాలలో పోట్లాడినందున వంటినిండా చాలా నరుకులుతగిలి మచ్చలు అగపడుతూ వున్నవి That man having fought in a number of battles, his body is covered with ***scars,*** from a number of wounds.

ఉట్టుమచ్చ A *mole* on the *skin*.

మచ్చిక *sub*. మచ్చికవు। మచ్చికలు. Affection; attachment; preference. ఆడదానికి మచ్చిక Female affection or love. పిల్లకాయ మచ్చిక A child's attachment or preference.

మచ్చు *sub*. మచ్చు। మచ్చులు. A sample; also, model or as it is termed in India a *muster*. ధాన్యపు మచ్చు *Samples* of grain. బట్టలమచ్చు A *sample* or *muster* of cloth. యీ మేజాబల్ల మచ్చు తీసుకొనికల్లి యీలాగున వకటి చెయ్యి Take this table as a *model* and make one exactly the same.

మజ్జిగ *sub*. మజ్జిగ। మజ్జిగలు. Butter-milk. vide చల్ల.

మజిలీ *sub*. మజిలీ। మజిలీలు. A stage or proposed distance in travelling or marching. మజిలీ మజిలీ *Every stage*. నేను మజిలీ మజిలీకి పదికోసులు నిర్నయించినాను I have arranged *every stage*, to be ten coss. మజిలీ చెయ్యడం To *make* a *stage* or to *arrive* at the *stage*.

మజాకూరు *adj*. Before mentioned; before stated.

మట్ట *sub*. మట్ట। మట్టలు. The leaf of some particular trees that are extremely thick and large. కొబ్బరిమట్ట A cocoanut *leaf*. పొగనారమట్ట The aloe *leaf*. తాటిమట్ట The name given to *palmyra plants*.

మఠం *sub*. మఠవు। మఠాలు. *Place* of *residence* of fakirs, *byraggies* and other religious mendicants of this description. సన్యాసుల మఠం The *mottum* of the *sannyashies* and so of the rest.

మడత *sub*. మడత। మడతలు. A plait; a fold. vide మడుపు.

మడమ *sub*. మడమ। మడమలు. The heel, applied to the human species only.

మడవడం *v. a*. మడిచాను। మడిచి. To fold; to plait; to double down. పత్రం మడవడం To *fold* a letter. ఆ రాజు అంగరకా చేతులు మహా సొగసుగా మడిచినారు They have *plaited* the sleeves of that Rajah's dress with great taste.

మడి *sub.* మడి। మళ్లు. A bed or partition, in a garden or piece of ground. వుల్లి మడి A *bed* of onions and so, of others. మడిలో వుండడం To be dressed after washing.

మడ్డి *sub.* మడ్డి. (No plural.) It means the *grounds* or thick part in ink or oil or other liquid.

మడ్డు *sub.* మడ్డు। మడ్లు. Heat; a burning. ఆ నీళ్లు మహా మడ్లుగా వున్నవి That water is *burning hot*. మడ్డుకత్తి A hatchet or wood-cutter's knife.

మడుపు *sub.* మడుపు। మడుపులు. A fold or plait.

మణికట్టు *sub.* మణికట్టు। మణికట్లు. The wrist.

మణిగె *sub.* మణిగె। మణిగెలు. A shop. కోమటి మణిగె A banian's *shop*. మణిగె means also, *large pots*, in which painters soak the cloth, to prepare it for being painted.

మణుగు *sub.* మణుగు। మణుగులు. A measure called a *maund*; measuring forty *kutcha seers*.

మతం *sub.* మతపు। మతాలు. Religion or sect. The Hindoo religion is divided into six different sects, as authorised by the shasters. These are వైష్ణవ మతం The *Vaishnava* sect who worship the God *Vishnu*. శైవ మతం The *Saiva* sect who worship the God *Sivudu*. శాక్త మతం The *Saaktam* sect who worship the Goddess *Sakty*. సౌర మతం The *Sowraum* sect who worship the *Sun*. గాణాపత్య మతం The *Gannapettyum* sect who worship the deity named *Gannapatty* supposed to be a descendant of *Siva*. There is a sixth sect called స్మార్త మతం. The *Smaartum* sect are considered to worship all the different deities that are worshipped by each of the five sects.

మత్తు *sub.* మత్తు। మత్తులు. A state of intoxication; drunkenness. నిద్ర మత్తు *Drowsiness*; *heaviness*. మత్తు తొక్కడం To be *intoxicated* either with *liquor* or with *pride*.

మద్దత్ *sub.* మద్దత్। మద్దతులు. Assistance; help; support. మద్దత్ చెయ్యడం To *assist*; to *support*. మద్దతుదారు One who gives assistance. vide సహాయం.

మదము *sub.* మదము। మదములు. Arrogance; haughtiness. It is also applied to an elephant wanting the female. Better known by the Persian word *mustt.* మదం యెక్కడం To *become arrogant* or *mustt.* ఆ మనిషికి విస్తరించిన డబ్బు ప్రాప్తించినందున మదము యెక్కినది That man accumulated a large fortune and is *become arrogant* in consequence. యేనుగకు మదంయెక్కి యిద్దరు ముగ్గురు మనుష్యులను చంపినది An elephant *having* got *mustt* has killed two or three people.

మదుము *sub.* మదుము। మదుములు. This means a *stone sluice,* commonly constructed at the bank of large tanks, for allowing particular portions of the water to go into channels, for watering the fields. తూము Item.

మదురు *sub.* మదుటి। మదుళ్లు. The name given to a *narrow covering,* either of turf or cadjan leaves or of tiles, fixed on the top of a wall.

మద్దెల *sub.* మద్దెల। మద్దెళ్ళు. This is the name of an instrument used at *nautches* on the principle of a drum, but hung horizontally in front of the performer and beat with the fingers at both ends, instead of sticks. It regulates the steps and cadence in the dance and a nautch girl before she begins, commonly makes a *dundum* to it, as depending for aid on the correctness of its measures.

మధ్య *adv.* Midway; centrally; between. ఆ చెరువు మధ్యను ఒక గుడి వున్నది There is a small chapel to the idol placed *centrally* in that tank. బందరునుంచి చెన్నపట్నం వెళ్ళడానికి రామాయపట్నం మధ్యను వున్నది To go from Masulipatam to Madras, you find Ramapatam midway. వారి వుభయులమధ్యను కలహ వచ్చినది A dispute has arisen *between* those two. మధ్య

వర్తి A mediator. N. B. This word may be used as adverb substantive or adjective.

మధ్యాహ్నం *sub.* మధ్యాహ్నపు। మధ్యాహ్నములు. The afternoon or mid'day. భోజనంచేసి మధ్యాహ్నానికి వస్తాను I shall eat my victuals and come in the *afternoon.* మధ్యాహ్నపు కూలి *Half-day* labour.

మనడం *v. n.* మనుతూ। మని. To live; to exist. vide బ్రతకడం.

మన్నన *sub.* మన్న। మన్ననలు. Respect; civility. మన్నన చెయ్యడం or మన్నించడం To *respect.* అతను తన యింటికి యెవరు వచ్చినా మన్నన చేస్తాడు He pays *respect* to every body, that comes to his house. మన్ననకల Respectful. మన్నన కలవాడు A *respectful* person.

మనమడు *sub.* మనమని। మనములు. A grand son.

మనమరాలు *sub.* మనమరాలి। మనమరాళ్లు. A grand daughter.

మనవి *sub.* మనవి। మనవులు. A representation; a request. మనవి చెయ్యడం To make a *request.* మనవి దయచెయ్యడం To grant a *request.* మనవి వినడం To attend to a *request.*

మనస్సు *sub.* మనస్సు। మనస్సులు. The mind; sense; the soul; inclination; attachment. నామీద నీకు మనస్సు లేదు You have no *attachment* for me. అతని మనస్సు వచ్చినట్టు చేస్తాడు He will act agreeable to his own *inclination*: that is, he will do *as he pleases.* అతని మనస్సు మంచిది He has a good *disposition* or *mind.* నీ మనస్సు As you *please.*

మన్నా *sub.* మన్నా। మన్నాలు. Hindrance; prevention. మన్నా చెయ్యడం To *hinder*; to *prevent.* vide అటకాయ.

మనిషి *sub.* మనిషి। మనుషులు. A person, applied both to male and female. ఒక మనిషి వచ్చినాడు, అతనిపేరు రాముడు A certain *person* has come, his name is Ramudoo. యిక్కడినుంచి ఒక మనిషి వెళ్లినది, దానిపేరు లక్ష్మి A *person* has gone from hence, her name is Lakshmi. ఆడమనిషి A *woman.* మొగ మనిషి A *man.* This last word is seldom used, but the

former always.

మన్ను *sub.* మంటి। మన్నులు. Dirt; the earth; the soil. తోట మన్ను Garden *earth.* మన్ను పడడం To get *dirty.* నా బట్టలమీద మన్ను పడ్డది My clothes have got *dirty.*

మనుష్యుడు *sub.* మనుష్యుని। మనుష్యులు. A man. This word is seldom used. మనిషి is commonly used instead of it.

మనోవృత్తి *sub.* మనోవృత్తి। మనోవృత్తులు. An allowance; pension; stipend. నా మనోవృత్తి తీసివేసినారు గనక నేను చాలా శ్రమ పడుతున్నాను They have taken away my *allowance,* which has greatly distressed me.

మంగలం *sub.* మంగలపు। మంగలాలు. The name given to a *common earthen pot,* when applied to the baking or parching of gram, as used by the Indians.

మంగలి *sub.* మంగలి। మంగళ్లు. The barber caste; also, a barber. మంగలవాడు A *barber.* మంగలికత్తి A *barber's* knife, made in the shape of a cleaver, but of course the size only of a razor, the blade being fixed into a handle, like a cleaver.

మంగళవారం *sub.* మంగళవారపు। మంగళవారాలు. Tuesday.

మంచం *sub.* మంచపు। మంచాలు. A bedstead or bed, better known in India by the name of *cot.* ఆ మంచంమీద పరుండు Sleep upon that *bed* or *cot.* మంచంకోసం నవారు తెచ్చినావా? Have you brought tape for the *cot*?

మంచి *adj.* Good. మంచివాళ్లు *Good* people. మంచివాడు A *good* man. మంచిది A *good* woman or a *good* thing. Hence arises the word మంచిది *well,* which is used as an adverb and is evidently a compound of మంచి *good* and a contraction of ఉన్నది *it is.* మంచిది is of very extensive use meaning not only *well, proper, &c.* but implying our word *very well,* when we would dismiss any person after a visit. మంచిదికాదు *Improper.* మంచిది, రేపు తిరిగి రండి *Very well,* come again to-morrow. మంచిపని చేసినావు You have done a

*pretty* business. నీవు యేలాగంటి మంచి వాడవు? What sort of a *fine fellow* are you? మంచితనం *Goodness*; *excellence*.

మంచి గంధం *sub.* మంచి గంధపు। మంచి గంధాలు. Sandal wood. గంధపుచెక్క Item.

మంచు *sub.* మంచు। మంచులు. A fog; a mist. మంచు కురవడం or పడడం A *fog* to *fall* or *gather*. శీతాకాలంలో యీ వూళ్లో విస్తారం మంచు కురుస్తుంది A very heavy *fog gathers* about this town, in the cold season.

మంచె *sub.* మంచె। మంచెలు. A sort of stand, erected in a field for keeping watchers over the ripe grain. It stands on four long posts, raised a good way above the crop and the watcher has a covering over him. గడమంచె A ***stand***, as applied to the use in a house, for holding clothes, &c.

మంట *sub.* మంట। మంటలు. A smart; an acute pain; also, a flaming-out. మంట పుచ్చుకోవడం To receive *pain*; to smart. మంట పెట్టడం To *give pain*; to smart.

మండ *sub.* మండ। మండలు. The branch cut down from a tree. మండ is also an *earthen vessel* used by the Indians. శీలమండ The *ancle* or *ankle*.

మండడం *v. n.* మండుతూ। మండి. To smart; to feel acute pain; to burn; to flame. కత్తితో వేలు తెగినందున మండుతూ వున్నది The cut in my finger *smarts* a good deal. పొయి మండుతూవున్నది The fire-place *flames* out.

మంత్రం *sub.* మంత్రపు। మంత్రాలు. The name of a sort of ***incantation*** or ***invoking*** addressed to particular deities, which the Indians frequently practise on any occasion of sickness or sudden accident or pain or in the case of being bit by a snake. దయ్యాల మంత్రాలు *Incantations* to the ***demon***. పాము మంత్రం ***Invocation*** upon the bite of ***snakes***. తేలు మంత్రం The same for ***scorpions***. మంత్రించడం To ***charm*** with the ***muntrum***. మంత్రపు తాయెత్తు The ***charm*** of the ***muntrum***.

నా వంక చూడు Look *towards* me.

వంకర *sub.* వంకరి। వంకరలు. Crookedness; unevenness. కఱ్ఱ వంకర *Unevenness* in wood. Also వంకర కఱ్ఱ A *crooked* piece of wood. వంకర మాటలు *Crooked* words: that is, *disagreeable* words. వంకర పనులు *Crooked* acts: that is, *improper* acts.

వంకాయ *sub.* వంకాయ। వంకాయలు. The name of the vegetable which in Europe is termed the *egg-plant* and in India is generally called the *brinjaal.* కర్పూరపు వంకాయ The name of a vegetable bearing a red head when ripe, used in soups. It is commonly called the *love-apple.*

వంకె *sub.* వంకె। వంకెలు. A hook. కఱ్ఱ వంకె A wooden *hook.* యినుప వంకె An iron *hook.* వంకె means also an *arm-ring,* worn by women and children.

వంగడం *v. a.* వంగుతూ। వంగి. To bend; to become crooked. అతను ముసలితనంచేత వంగినాడు He is *bent down* with old age.

వంచకుడు *sub.* వంచకుడి। వంచకులు. A man that disgraces another.

వంచడం *v. a.* వంచుతూ। వంచి. To bend. విల్లు వంచడం To *bend* a bow. మనిషిని వంచడం To *force* a man *down*; to *humble* a man. వాడు మహా గర్వంగా వున్నందున ఆ గర్వం అణిగేటట్టుగా వంచినారు That man having shewn a great deal of ostentation, they took occasion to *humble* his pride.

వంచన *sub.* వంచనపు। వంచనలు. A disgrace or humiliation. వంచకత్వం Item.

వంట *sub.* వంటి। వంటలు. A dressing or preparing victuals. వంట చెయ్యడం To *dress victuals.* వంటచేసిన తరువాతను తిని, యిక్కడికి వచ్చినాను I came here immediately after *dressing* and eating my *victuals.*

వంటకం *sub.* వంటకపు। వంటకాలు. Victuals. vide అన్నం.

వంటచెరుకు *sub.* వంటచెరుకు। వంటచెరుకులు. The general name given to *fuel* or *firing.* యింట్లో వంటచెరుకు యేమీలేదు There is no *fuel* in the house.

వండడం *v. a.* వండుతా। వండి. To *dress victuals.* vide వంట.

వంతు *sub.* వంతు। వంతులు. A share; a portion. vide పాలు. It means also, a turn in gradation or period.

వంతెన *sub.* వంతెన। వంతెనలు. A bridge. This word is applicable to the *bridge* over the ditch of a fortress. The Hindoos never build bridges over rivers but trust to boats or rafts, when they cannot ford them.

వంపు *sub.* వంపు। వంపులు. A bend or curve.

వ్యవసాయం *sub.* వ్యవసాయపు। వ్యవసాయాలు. A cultivation. వ్యవసాయం చెయ్యడం To *cultivate* or *plough* the ground. ఆ వూరి పొలములో యింకా వ్యవసాయం చెయ్యలేదు They have not yet *ploughed* the fields of that village. వ్యవసాయం is also applied to the *cultivation* or *improvement* of the *mind.*

వ్యవహారం *sub.* వ్యవహారపు। వ్యవహారాలు. Office; business; management or direction. తాలూకా వ్యవహారం The *management* or *direction* of a country. వ్యవహారం చెయ్యడం To be *employed;* to manage. vide వుద్యోగం.

వయస్సు *sub.* వయస్సు. (No plural.) Age. నా వయస్సు నేను యెరగను I do not know my *age.*

వ్రయం *sub.* వ్రయపు। వ్రయాలు. Expense or disbursement. వ్రయం చెయ్యడం To make *disbursements.* ఆ వూళ్లోకి వచ్చి పది వరహాలు వ్రయం చేశినాను I came to that village and laid out ten pagodas in *disbursements.*

వృథా *adj.* Vain; fruitless. వృథాగా Item.

వర *sub.* వర। వరలు. A sheath or scabbard. It also means the earthen *rims* or *rings* fixed round what are termed, *pot-wells* in India. వర is also the name of the *proof* in gold, as produced *on the stone.* కత్తి వర The *scabbard*

of a sword or knife. నూతి వరలు The *earthen rims* of a well. వర దుయ్యడం To draw a sword.

వర్తకం *sub.* వర్తకపు। వర్తకాలు. Merchandise; traffic. వర్తకం చెయ్యడం To *trade*; to *traffic.* వర్తకుడు A *merchant.* ఆ వర్తకుడు బట్టల వర్తకం విస్తరించి చేస్తాడు That *merchant* carries on a considerable *traffic* in cloths.

వర్ణం *sub.* వర్ణపు। వర్ణాలు. Caste; *colour*; a *letter* of the alphabet. నాది బ్రాహ్మణ వర్ణం I am of the Brahmin *caste* ముచ్చివాడు వచ్చి యే వర్ణం చేశేది అని అడిగినాడు The *Mootchy* man came to know, what *colour* he must apply. వర్ణం is also the name of a *particular song*, amongst the Hindoos.

వర్తమానము *sub.* వర్తమానపు। వర్తమానాలు. A message; an intimation; a notice. అతను బంగాళాకు వెళ్లుతానని నాకు వర్తమానం పంపించినాడు He sent me a *message*, that he was going to Bengal. యీపని చెయ్యమని నాకు యేమీ వర్తమానం రాలేదు I have received no *notice*, to do this business. వర్తమానము In Sanskrit, means the *present time.*

వర్షం *sub.* వర్షపు। వర్షాలు. Rain. వర్షం కురవడం To *rain.* వర్షం వెలియడం To *stop raining.* ప్రొద్దుటినుంచి వర్షం కురిసి యిప్పుడు వెలిసినది It has been *raining* ever since the morning, but now it has *stopped.* వర్షాకాలం The *rainy* season, commonly termed, the *monsoon.*

వరహా *sub.* వరహా। వరహాలు. A pagoda. కరుకు వరహా The *Karookoo* pagoda, commonly called the *Madras* or the three *Swamy* pagoda. పువ్వు వరహా The *Flowered* pagoda or what we call the *Star* pagoda. The *Madras* pagoda is the largest and is current to the Northward; the *Star* pagoda is ten per cent less of intrinsic value and is current at Madras.

వరి *sub.* వరి। వరులు. The grain, commonly called *paddy grain.* వరి గడ్డి *Paddy* straw. వరిచేను A *paddy* crop: free

from the husk, it is rice.

వరుగు *sub.* వరుగు । వరుగులు. The name given to *vegetables dried* and kept for use. దోస వరుగు *Dried* cucumber. వుచ్చిత వరుగు *Dried voochita.* వరుగు also means, the partial *leaning* or *bending* of a tree, or of palanquin to one side.

వరుస *sub.* వరుస । వరుసలు. A line or strait mark, applicable to *letters* in writing, or to *lines* made on paper, or on the ground. శిపాయీలు మూడు వరుసలను నిలుచున్నారు The sepoys are standing in three *lines.*

వల *sub.* వల । వలలు. A net. వల వెయ్యడం To *throw* or *cast* a *net.* వల లాగడం To *drag* or *draw* a *net.*

వలకడం *v. n.* వలుకుతూ । వలికి. To drop or spill, from any thing over-full. వలకపొయ్యడం To spill, &c. by throwing any thing over.

వల్లకాడు *sub.* వల్లకాటి । వల్లకాళ్లు. Burning or burying place of the dead.

వల్ల *pre.* By; with. This Preposition is often attached to the Ablative Case of Nouns. గుర్రం వల్ల *By* or *with* the horse. నావల్ల కాదు Not *by me*: meaning, that it *cannot be done* by me. అతను యీపని చెయ్యమని చెప్పితే నావల్ల కాదని అన్నాడు When he was desired to do this business, he said *he could not.* నావల్ల అతనికి యేమీ పనిలేదు He has no business *with* me.

వలచడం *v. n.* వలుస్తూ । వలచి. To wish; to desire; to covet. నీవు ఆపని యీవేళ తయారు చెయ్యవలసినది It is *desirable* you *should* or you *must* finish that business to-day. అతను యీవూళ్లోకి యీరాత్రి రావలసినది It is *wished* he *should* or he *might* arrive in this town to night. ఆ స్త్రీని వాడు వలచినాడు He *covets* the possession of that woman.

వశము *sub.* వశపు । వశాలు. Custody; charge. ఆ గుర్రం నా వశాన అప్పగించినారు They have put that horse under my *charge.* ఆ

సామాను నా వశాన లేదు That thing is not in my *custody*.

వసతి ***sub.*** వసతి। వసతులు. An allowance. నాకు వసతి ఏమీ లేదు I have not got any *allowance*. The proper meaning in Sanskrit is *residence*.

వసనాభి ***sub.*** వసనాభి. (No plural.) Arsenic. Properly the word is వత్సనాభి.

వస్తువు ***sub.*** వస్తువు। వస్తువులు. An article; a thing, applicable to any solid, inanimate body. నా వస్తువులు యెక్కడ వున్నవి? Where are my *things*? ఆ వస్తువు నాది కాదు That *article* does not belong to me.

వసూలు ***sub.*** వసూలు। వసూళ్లు. A revenue term, signifying the *collections*. వసూలు చెయ్యడం To *collect*.

వరాగ్రం ***sub.*** వరాగ్రపు। వరాగ్రాలు. A superior kind of *betel nut*. There are several other kinds.

## వా

వాకర ***sub.*** వాకర। వాకరలు. A vomit, or the act of vomiting. vide వాంతి.

వాకిలి ***sub.*** వాకిలి। వాకిళ్లు. A gate. vide ద్వారం.

వాగడం ***v. n.*** వాగుతూ। వాగి. To speak continually; to jabber. అతను యెప్పుడుచూచినా వాగుతూ వుంటాడు You always see that man *jabbering*.

వాగు ***sub.*** వాక। వాగులు. A torrent or current of water. కొండ వాగు A *torrent* from a hill.

వాడిక ***sub.*** వాడిక। వాడికలు. Custom; rule; right. vide మర్యాద.

వాడ ***sub.*** వాడ। వాడలు. A ship; a vessel. మూడుకొయ్యల వాడ A three masted *ship*. వాడ నడవడం A *ship* to sail. ఆ వాడ త్వరగా నడుస్తూ వున్నది That *ship* sails well. వాడ మునిగిపోవడం A *ship* to sink. వాడ రవానా చెయ్యడం To despatch a *ship*. వాడమీద సరుకు కెయ్యడం To load a *ship*. వాడ తెరచాపలు

The sails of a *ship*. వాడ కొడి A *ship's* colour. వాడ is also the name of any small assemblage of houses, or a small town composed of people of one caste. పల్లె వాడ A *fishing town*. వాడ కట్టు means the *side* of a *street*, or the *range* of *houses* in a street.

వాడడం *v. n.* వాడుతూ, వాడి. To wither; to shrivel up; to wear. ఆ పువ్వులు యెండచేత వాడినవి Those flowers are all *shrivelled up*, by the heat. అతను నా నగలు చాలా దినములు వాడినాడు He has *worn* my jewels a long time. యీ మాటలు పూర్వులు వాడినారు These words are *derived* from *former authority*.

వాడి *sub.* వాడి. (No plural.) Sharpness, as applied to weapons. వాడి కల *Sharp*; *culting*. వాడికల కత్తి A *sharp* sword or knife.

వాడిక *adj.* Current; in circulation; in use. మీరు చెప్పినమాట మన తెనుగులో వాడిక లేదు The word which you have mentioned is not *current* amongst us in the Telugu. ఆ సామాను కొత్తది, వాడికలోకి రాలేదు That thing is new, and has not *been* in use yet.

వాడు *pro.* వాని, వారు. He; that man. vide అతను.

వాత *sub.* వాత, వాతలు. Firing; the *actual cautery*, as it is used upon cattle in India. వాత వెయ్యడం To fire. The word రక్షు వెయ్యడం is applicable to this operation, on human beings.

వాదం *sub.* వాదపు, వాదాలు. Matter in dispute or discussion. మా యిద్దరికి యీ భూమిని గురించి వాదం జరిగినది There has happened a dispute between us two, regarding this ground.

వాది *sub.* వాది, వాదులు. Complainant; disputant or plaintiff in a suit.

వాదించడం *v. a.* వాదిస్తూ, వాదించి. To hold dispute with, or to

advocate for, in a cause or matter of difference.

వాదు *sub.* వాదు । వాదులు. A blame, or accusation. ఒకరిమీదనైనా వాదు రావడం Blame to fall upon any one.

వాన *sub.* వాన। వానలు. Rain. vide వర్షం.

వాంతి *sub.* వాంతి । వాంతులు. A vomiting. వాంతి చేసుకోవడం To *vomit.*

వాపు *sub.* వాపు । వాపులు. A swelling; a protuberance. vide పుబ్బు.

వాము *sub.* వాముపు. (No plural.) The name of a *small seed,* taken by the Indians to cure the belly-ache.

వామి *sub.* వామి । వాములు. A heap of grass, or a *hay-stack.*

వ్యాజ్యం *sub.* వ్యాజ్యపు । వ్యాజ్యాలు. A complaint or reference; a dispute. నా బాకీ యివ్వనందున అతనిమీద వ్యాజ్యం వేశివాను As he did not pay me my balance, I have made a *complaint* against him. అతనికీ నాకూ భూమిని గురించిన వ్యాజ్యం వున్నది There is a *dispute* between him and me regarding a piece of ground. The proper word in Sanskrit is వ్యాజం.

వాచడం *v. n.* వాస్తూ। వాచి. To swell. అతని వళ్లు అంతా వాచినది His whole body is *swelled up.* vide పుబ్బడం.

వాయిదా *sub.* వాయిదా। వాయిదాలు. A revenue term, signifying a *limited period* or *date.* ఆ ముస్తాజరు కిస్తీలు వాయిదా చొప్పున చెల్లించలేదు That renter has not discharged his instalments, agreeable to the *limited period*: that is, according to *dates.*

వాయించడం *v. a.* వాయిస్తూ। వాయించి. This Verb is applicable to the different modes of producing sound from instruments, whether with sticks, with the fingers, or the bow. It does not apply to wind instruments for which the Verb ఊదడం is used. వీణె వాయించడం To *play* on the *veena,* performed with the fingers. తంబురా వాయించడం To *play*

on the *tomboora*, also with the fingers. మద్దెల వాయించడం To *beat* the *maddela*, also done with the fingers. డోలు వాయించడం To *beat* the *doloo* or *tom-tom*, which is done with a thin stick.

వాయువు *sub.* వాయువు. (No Plural.) This is the name given by the Indians to complaints which affect the limbs or joints, with any fixed pain. వాయువు సంకటం Item.

వ్రాత *sub.* వ్రాత। వ్రాతలు. Writing; hand-writing. ఆ పుత్తరం చూస్తే అతని వ్రాతకాదని తోస్తుంది On examining that letter, I do not think it is his own *hand-writing*.

వ్రాయడం *v. n.* వ్రాస్తూ। వ్రాసి. To write. పుత్తరాలు వ్రాయడం To *write* letters or to *copy*. లెక్క వ్రాయడం To keep *accounts*. బాగా వ్రాయడం To *write* well: that is, to *write* a *good-hand*.

వ్రాలు *sub.* వ్రాయి। వ్రాలు. Letters; impressions. By use this word is understood for *signature*. చేవ్రాలు Item.

వార *sub.* వార। వారలు. The name of a *bundle* of *thread* for weaving, containing eight *punjums*. వార also means, a *difference* or *variance* in any thing. లెక్కలో వార A *difference* in an account.

వార్చడం *v. a.* వారుస్తూ। వార్చి. To strain the water from the boiled rice. This constitutes what is called *conjee*. It is from hence called వార్పు. vide సంధ్య for the use of this Verb, as to prayers.

వారం *sub.* వారపు। వారాలు. A week. The days of the week are referred to the *week* and not to the *day*. ఆదివారం *Sunday*. So of all the other days of the week.

వారంటు *sub.* వార్యంటు। వారంట్లు. Warrant; order of attachment, in the Courts.

వారు *sub.* వారు। వార్లు. A leather belt, or any strap, or long piece of leather.

వార్పు *sub.* వార్పు। వార్పులు. The drink, commonly called *conjee.* vide గంజి.

వాలడం *v. n.* వాలుతూ। వాలి. To roost; to sit or light upon any thing, as a bird. ఆ చెట్టుమీదనుంచి వకపక్షి యెగిరివచ్చి యింటిమీద వాలినది A bird has flown from that tree and is come to *settle upon* the house. ఆ చెట్టుమీద రాత్రిళ్లు నానా పిట్టలు వాలుతున్నవి A great number of birds *roost upon* that tree at nights. వాలడం also means to *bend down,* as a tree, by the wind.

వాలు *sub.* వాలు। వాళ్లు. Low ground, where the water generally lodges.

వాసన *sub.* వాసన। వాసనలు. Scent; flavour; smell. మంచి వాసన A good *flavour.* చెడ్డ వాసన A bad *smell* or *flavour.* వాసన చూడడం To perceive a *smell*: that is, *to smell.* వాసన కొట్టడం or తగలడం or వెయ్యడం To *scent*; to *yield* a *flavour* or *smell.*

వాసం *sub.* వాసపు। వాసాలు. A rafter, as applied to house building.

## వి

వికసించడం *v. n.* వికసిస్తూ। వికసించి. To blow, as a flower.

వికారం *sub.* వికారపు। వికారాలు. Languor; lassitude. Figuratively వికారపు మనిషి A week or foolish man. వికారపు మాటలు Silly words.

విగ్రహం *sub.* విగ్రహపు। విగ్రహాలు. The name given to the *images* or *idols,* preserved for worship at the different pagodas, some made of stone, and others of a mixed metal.

*విచ్చడం *v. n.* విచ్చుతూ। విచ్చి. To burst; to break in two. కడుపు విచ్చేటట్టుగా అన్నం తిన్నాడు He has eaten victuals enough to make him *burst.* విచ్చిపోవడం Item.

విచ్చలవిడి *sub.* విచ్చలవిడి Lavishment; profusion; prodigality. విచ్చలవిడి చెయ్యడం To lavish; to squander.

విచారం *sub.* విచారపు। విచారాలు. Grief; sorrow; lamentation. విచారపడడం To *grieve*; to *lament*; to *reflect*. అతను తన భార్య చచ్చినందున మహా విచారపడుతున్నాడు He *grieves* very vehemently for the loss of his wife. విచారం చెయ్యడం To *consider*; to *enquire*. ఆ మాటను గురించి విచారం చేస్తాము We will *take* those words into *consideration*.

విచారించడం *v. a.* విచారిస్తూ। విచారించి. To enquire; to investigate; to be grieved.

విచిత్రం *sub.* విచిత్రపు। విచిత్రాలు. Beauty; admiration.

విడడం *sub.* విడుతూ। విడి. To come untied; to get loose; to separate or part. మూట విడడం A bundle to come untied. దారి విడడం To part in the way. స్నేహం విడడం To separate in friendship. విడిపోవడం Item.

విడిచిపెట్టడం *v. a.* విడిచిపెట్టుతూ। విడిచిపెట్టి. To release; to liberate. vide వదలడం.

విడిది *sub.* విడిది। విడుదులు. A temporary lodging. vide బస.

విడిపించడం *v. a.* విడిపిస్తూ। విడిపించి. To separate; to release; to loosen.

విత్తడం *v. a.* విత్తుతూ। విత్తి. To sow seed.

విత్తనము *sub.* వత్తనపు। విత్తనాలు. Seed. విత్తనాలు చల్లడం or వెద వెయ్యడం To *sow seeds*. This applies to seed sown in the ground for produce.

విత్తు *sub.* విత్తు। విత్తులు. The seed of fruit or vegetables. It also means, the seed used for the soil.

విద్య *sub.* విద్య। విద్యలు. Language. సంస్కృతపు విద్య The Sanskrit *language*. తెనుగు విద్య The Telugu *language*. అరవ విద్య The Malabar *language*. ఫారసీ విద్య The Persian *language*. వడియా విద్య The Woddiah *language*. తురక విద్య The Hindustani *language*. ఇంగిలీజు విద్య The English

*language.* విద్య also means an *art.* దొమ్మర విద్య The *art* of tumbling. గారడీ విద్య The slight-of-hand *art.*

**వినడం** *v. a.* వింటూ। విని. To hear; also, to make another hear. నా మాటలు విను *Hear* my words. నేను ఆలాగున విన్నాను So, I have *heard.* ఆ మాటలు విన్నాడుకాడు He did not *hear* those words.

**విన్నపం** *sub.* విన్నపపు। విన్నపాలు. A representation; a statement of facts. ఆయన వచ్చినప్పుడు నా సంగతులు యావత్తు విన్నపం చేసినాను When he came, I laid a *statement* of all my circumstances before him.

**వినయం** *sub.* వినయపు। వినయాలు. Respectfulness; humbleness.

**వింత** *sub.* వింత। వింతలు. Estimation; repute; celebrity. వింత మనిషి A man of *celebrity.* వింత వస్తువు An article of *estimation.* వింత సంగతి A circumstance of *repute*: that is, of *fame.*

**విందు** *sub.* విందు। విందులు. Invitation. విందు చెయ్యడం To invite. విందుకు పిలవడం To call for by invitation, or to invite.

**విప్పడం** *v. a.* విప్పుతూ। విప్పి. To untie; to loosen. ఆ యెద్దును విప్పు *Untie* those bullocks. ఆ మూట విప్పు *Untie* that bundle. విప్పపడడం To be *untied.*

**విభజన** *sub.* విభజన। విభజనలు. Distinction; separation. విభజన చెయ్యడం To *separate.* ఆ కాకితాలు విభజన చెయ్యి *Separate* those papers. విభజనగా *Separately*; *distinctly.* నేనూ నా తండ్రీ విభజనగా వున్నాము I and my father live *separately.*

**విమర్శ** *sub.* విమర్శ। విమర్శలు. Inquiry; investigation. విమర్శ చెయ్యడం To *inquire*; to *investigate.* నీ మీద వేసిన నేరం విమర్శ చేసినతరువాత అందున గురించి హుకుం యిస్తాము After *having inquired* into your misconduct, I will give orders respecting it. అతను విమర్శ చెయ్యక నాదగ్గిర జులుమానా పుచ్చుకున్నాడు He has levied a fine upon me and collected without making any *investigation.*

విరగడం *v. n.* విరుగుతూ। విరిగి. To break; to go in pieces. This verb is applied to the breaking of wood or iron or any article not of a brittle nature.

విరచడం *v. a.* విరుచుతూ। విరిచి. To break. ఆ నగ పుచ్చుకుని విరిచి నాడు He took hold of that trinket and *broke it.*

విరోధం *sub.* విరోధపు। విరోధాలు. Enmity; unfriendliness. నాకూ అతనికి యేమీ విరోధం లేదు There is no *enmity* between him and me. యీపని చేసినందువల్ల నీకు మరి యేమీ విరోధం లేదు You will incur no *mischief*, by doing this business. విరోధం చెయ్యడం To make *opposition* or cause *enmity*; also, to *offend* or *injure*. విరోధి An *enemy*.

విలవ *sub.* విలవ। విలవలు. Valuation; value; worth; price. ఆ వస్తువు విలవ యెంత? What is the *value* of that article? ఆ గుర్రపు విలవ యింకా చెప్పినాడు కాడు He has not yet fixed the *price* of that horse. విలవ చెయ్యడం To *estimate* or *fix* a price.

విల్లు *sub.* వింటి। విండ్లు. A bow. వింటి బద్ద and విల్లంబు Item. విల్లు యెక్కు పెట్టడం To *bend a bow*: that is, to apply the string. విల్లూ। అంబూ Bow and arrow. విల్లు వేట *Sporting* with the *bow.* This is generally practised with pellets, fired at birds, in which most Indians are very dexterous. విల్లు వేటగాడు The person who *sports with* the *bow.* విలుకాడు An *archer.* విలు విద్య *Archery.* The ల below is lost, because of the junction of the other word.

వివాహం *sub.* వివాహపు। వివాహాలు. Marriage; wedlock. వివాహం చెయ్యడం To *marry.* vide పెళ్ళి.

విశదం *sub.* విశదపు। విశదములు. Information; intelligence; communication. vide తెలివి.

విశదపర్చడం *sub.* విశదపరుస్తూ। విశదపర్చి. To inform; to communicate; to apprise. కనక యీ సంగతి నీకు విశదపర్చినాను Therefore, these circumstances are *communicated* for your

information.

విశ్వాసం *sub.* విశ్వాసపు। విశ్వాసాలు. Trustiness; confidence; faithfulness. vide నమ్మిక.

విశేషం *sub.* విశేషపు। విశేషాలు. Charitable and virtuous excellence.

విషం *sub.* విషపు। విషాలు. Poison. విషం పెట్టడం To *poison.* విషం పుచ్చుకోవడం or తినడం To be *poisoned* or *poison yourself.*

విసకడం *v. n.* విసుకుతూ। విసికి. To tire; to be uneasy.

విసనకర్ర *sub.* విసనకర్ర। విసనకర్రలు. This is a corruption of the word విసురు కర్ర A fan, commonly called a *punkah.*

విసరడం *v. a.* విసురుతూ। విసిరి. To fan; to ventilate. యెండచేత చెమటపట్టినది గనక నాకు విసురు I am perspiring with the heat, therefore, *fan* me. విసరడం To *grind.* గోధుములు విసరడం To *grind* wheat. విసరడం also means, to *blow-hard,* as a high wind.

విస్తరించి *adj.* Abundant; plenty. విస్తరించి సొమ్ము యిచ్చినాడు He has given *plenty* of money. This word is taken from the Verb విస్తరించడం.

విస్తారం *sub.* విస్తారపు. (No plural.) Abundance; plenty. అతని దగ్గర విస్తారం రూపాయీలు వున్నవి That man has got a great *abundance* of rupees. విస్తారపు దండు వచ్చినది A *large* camp is arrived.

విసికించడం *v. n.* విసికిస్తూ। విసికించి. To vex; to tire. మీరు నన్ను విసికిస్తారు You quite *tire* me out.

విసికిన *adj.* Tired; weary. విసికిన మనిషి A *tired* person.

విసుకు *sub.* విసుకు. (No plural.) Fatigue; weariness.



వీగడం *v. n.* వీగుతూ। వీగి. To turn back or yield; to be

overcome. అతని వళ్లు మహా వీగి వున్నందున నడవలేడు That man *is* so *unwieldy*, that he can hardly walk. యుద్ధంలో వారి బలము వీగినది Their army was *discomfited* in the battle.

వీడు *prp*. వీని। వీరు. He; also, this man. వీరు చేసినారు It was *these people* did it.

వీణె *sub*. వీణె। వీణెలు. This is the name of a musical instrument, on the principle of the guitar and played upon something in the same way. It has seven *strings* on the finger board and there is a separate line of strings along the left side of the finger-board, that go over a second bridge and serve as a sort of base. కస్తూరి వీణె The *musk bag*, taken from the animal.

వీధి *sub*. వీధి। వీధులు. A street. పెద్ద వీధి A large *street*. చిన్న వీధి A small *street*.

వీపు *sub*. వీపు। వీపులు. The back. వీపుమీద కొట్టడం To strike on the back: that is, to punish.

వీరముష్టివాడు *sub*. వీరముష్టివాని। వీరముష్టివాళ్లు. This is the name of a particular description of itinerant *beggars*, supposed to be possessed of the supernatural power of restoring by incantations and sacrifices, any *Lingum* which a person may have lost.

వీలు *sub*. వీలు। వీళ్లు. Arrangement; also, the *estimate* of the revenue of a village or district. వీలు చెయ్యడం To form an *estimate*. అతను చేసిన వీలు ప్రకారం సొమ్ము యిచ్చినాడు He has paid the money agreeable to the *arrangement* made with him. వీలు జాబితా An account *estimate*; a term used in revenue. ఆ వూరు వీలుచేసి జమాబంది కట్టినారు They have concluded the settlement of that village, upon inspection of the village *estimate*.

# వు

వుక్క *sub.* వుక్క. (No plural.) Closeness; sultriness, from the want of air in a room or the denseness of the atmosphere.

వుక్కు *sub.* వుక్కు. The metal called steel.

వుగ్గం *sub.* వుగ్గపు। వుగ్గాలు. A cord or string attached to any thing to support it by.

వుగ్గు *sub.* వుగ్గు। వుగ్గులు. *Wuggoo*; a drink so called, made of lamp oil and the mother's milk, which is given morning and evening to infants in India, and continued to the age of one year or till the child is allowed victuals.

వుచ్చ *sub.* వుచ్చ. (No plural.) Urine. వుచ్చ పొయ్యడం To urinate. This word is applied to people and beasts.

వుట్టి *sub.* వుట్టి। వుట్లు. This is the name given to a sort of *hanging frame*, slung over a beam in the houses of the Indians by ropes, in which they keep their pots and pans suspended after use.

వుడకడం *v. n.* వుడుకుతూ। వుడికి. To grow hot; to be heated; to boil. This Verb seems only applicable to animal heat or to the operation of heating victuals. అన్నం వుడకడం *Rice* or *victuals* to *boil.* నా వళ్ళు వుడుకుతూ వున్నది My *body* feels *heated.*

వుడగడం *v. n.* వుడుగుతూ। వుడిగి. To stop or cease breeding or producing. This is applied to all classes and all things.

వుడత *sub.* వుడత। వుడతలు. A squirrel. It means the common small squirrel, of a grey colour and two dark stripes, down its back. కొండ వుడత The *hill squirrel*, with the head very much resembling a rat, is of a chocolate colour, with a yellow belly and a long bushy tail.

వుడుకు *sub.* వుడుకు। వుడుకులు. Heat. నీళ్ళు వుడుకుచేత నా చెయ్యి కాలినది The water is so *hot*, that it has burnt my hand. వుడుకు నీళ్ళు *Hot*-water. వుడుకుగా *Hotly*; with *heat*. నా వళ్ళు మహా వుడుకుగా వున్నది My body is very *hot*.

వుడుము *sub.* వుడుము। వుడుములు. The name of a description of reptiles of the lizard species, which grow to the size of a foot or a foot and a half, commonly called the *guaana*, by Europeans in India.

వుతకడం *v. a.* వుతుకుతూ। వుతికి. To wash or cleanse clothes. చాకలవాడు బట్టలు వుతికినాడు The washer has *washed* the clothes.

వుతకాలు ఆడడం *v. n.* వుతకాలు ఆడుతూ। వుతకాలు ఆడి. To be brought to bed. ఆ చిన్నది నిన్న వుతకాలు ఆడినది That girl was *brought to bed* yesterday.

వుత్తరం *sub.* వుత్తరపు। వుత్తరాలు. A letter; an epistle. It also means the *North*. మారు వుత్తరం A *reply*. వుత్తరపు సంగతులు The contents of a *letter*. వుత్తర దేశం The *northern* districts.

వుత్సవం *sub.* వుత్సవపు। వుత్సవాలు. Celebration, as applied to the pagoda ceremonies.

వుత్సాహం *sub.* వుత్సాహపు। వుత్సాహాలు. Gladness; happiness. vide వుల్లాసం.

వుదయం *sub.* వుదయపు। వుదయాలు. A birth; the beginning; an off-spring. సూర్యోదయం *Sun rise*. చంద్రోదయం The *rising* of the moon. These words mean also certain *preparations* of medicine.

వుద్యోగం *sub.* వుద్యోగపు। వుద్యోగాలు. Employ; service; office. నాకు మంచి వుద్యోగం దొరికినది I have obtained a good *employ*. కుంపిణీ వుద్యోగం విడిచిపెట్టి రాజాదగ్గరకు వెళ్ళినాడు He has left the company's *service* and is gone to a rajah. వుద్యోగస్థుడు A person in *office*. ఆతను కల్కుటరువారి తరఫున వుద్యోగస్థుడు He is *in office* under the collector.

వునికి *sub.* వునికి। వునుకులు. Condition; state; appearance. ఆ వూరిలో అతని వునికి యెక్కడ? Where is his *situation* in that village? అతని వునికి చూస్తే సంకటపడ్డట్టుగా అగపడుతున్నది To judge by his *appearance*, he seems to be taken sick or to have got ill.

వున్ని *sub.* వున్ని. (No plural.) Wool.

వుంగరం *sub.* వుంగరపు। వుంగరాలు. A ring. వజ్రపు వుంగరం A diamond *ring*. కెంపు వుంగరం A *ring* with a ruby. శిక్కా వుంగరం A seal *ring*. The Indians commonly wear a cornelian in a ring, with their cypher or name cut in it, in the manner of a seal.

వుంచడం *v. a.* వుంచుతూ। వుంచి. To place; to put; to fix; to appoint. స్తంభం అక్కడ వుంచు *Put* the post, there. నన్ను యీ పనిలో వుంచినాడు He has *placed* me in this business. సామాను అక్కడ వుంచు *Put* the things there.

వుంచుకోవడం *v. a.* వుంచుకుంటూ। వుంచుకుని. To keep; to entertain. పదిమంది నౌకర్లను వుంచుకున్నాను I have *entertained* a number of servants. ఆ చిన్నదాన్ని పది పన్నెండు సంవత్సరములు వుంచుకున్నాడు He has *kept* that girl, for ten or twelve years.

వుండ *sub.* వుండ। వుండలు. A *pellet*, when made of clay or earth; and, a *bolus*, when composed of medicine. మంటి వుండ A clay *pellet*, such as the Indians use with the *pellet-bow*. వుండ విల్లు బద్ద A *pellet*-bow. వుండలు వెయ్యడం To shoot pellet-balls. ఔషధపు వుండ A *bolus* of physic.

వుండడం *v. n.* వుంటూ। వుండి. To be; to remain. N. B. This is the only Verb in Telugu, to use for our Verb *to have*. నీవు యింట్లో వుండు, ఆ వెనక వస్తాను You do *remain* at home and I will come by and by. ఆ మనిషి యెక్కడ వున్నాడు? Where *is* that man? ఆ పుస్తకం నాదగ్గిర వున్నది That book *is* with me. వక స్రాపు దగ్గిరమాత్రం వరహాలు వున్నవిగాని మరివకరిదగ్గిర లేవు There is only one shroff who *has* pagodas, none of the

others *have* any.

వుపకారం *sub.* వుపకారపు। వుపకారాలు. Kindness ; benevolence. అతని వుపకారం నేను మరిచిపోను I shall never forget his *kindness.* వుపకారపు మనిషి A man of *benevolence* ; a *kind* man. వుపకారం కల or అయిన *Benevolent ; kind.* వుపకారంగా *Kindly.*

వుప్పర *adj.* Of or belonging to the caste of *tank-diggers.* వుప్పర కులం The *tank-digger caste.* వుప్పరవాడు or వుప్పరి A *tank-digger.* వుప్పరిది A *female,* of the same caste. They are employed in the country, to repair water channels and tanks, or banks and are generally in companies from forty and fifty to two or three hundred.

వుపవాసం *sub.* వుపవాసపు। వుపవాసాలు. A fast; abstaining from food.

వుపాయం *sub.* వుపాయపు। వుపాయాలు. Information; instruction; intelligence. అతనికి యీ పనిలో బాగా వుపాయం వున్నది That man possesses *capacity* for this business.

వుప్పు *sub.* వుప్పు. (No plural.) Salt. వుప్పుగళ్ళు *Salt-pans,* in which the salt is produced. వుప్పు పంట *Salt produce.* వుప్పు గుత్త *Salt farm or contract.* వుప్పు చేప *Salt-fish.* వుప్పు రేవు A *salt-water* creek.

వుప్పెన *sub.* వుప్పెన। వుప్పెనలు. A term given to the rising and overflowing of the sea, which sometimes occurs on the coasts of India. వుప్పెన రావడం The *sea* to *overflow.*

వుబ్బడం *v. n.* వుబ్బుతూ। వుబ్బి. To swell; to enlarge. వాయువుచేత ఆ మనిషి కడుపు వుబ్బినది That man's belly is *swelled out* with dropsy.

వుబ్బు *sub.* వుబ్బు। వుబ్బులు. A swelling; a protuberance.

వుభయులు *adj.* Both sides. వుభయవాదులు Item. వారు వుభయులు మా యింటికివచ్చి తమతో గురించిన మాటలు మాట్లాడి వెళ్ళినారు *Both parties* came to my house and stating their several

circumstances, went away again.

ఉమ్మి *sub.* ఉమ్మి। ఉమ్ములు. Spittle. ఉమ్మి వెయ్యడం To spit.

ఉయ్యాల *sub.* ఉయ్యాల। ఉయ్యాలలు. A swing. ఉయ్యాల మంచం A cradle; also, a *swinging bed*: the beds of the Indians being frequently swung to a beam of the room. ఉయ్యాల వూగడం A *cradle* or *bed* to be *moved* or *rocked*. ఉయ్యాల వూచడం To *rock* a *cradle* or *bed*.

ఉరకడం *v. n.* ఉరుకుతూ। ఉరికి. To jump; to vault. నూతిలో ఉరకడం To jump into a well. పాలకీతో ఉరకడం To run on the side of a palanquin.

ఉరమడం *v. n.* ఉరుముతూ। ఉరిమి. To thunder. నిన్నటి రాత్రి ఆ వూరిలో ఉరుము గొప్పగా ఉరిమినంతలో పిడుగుపడి యిద్దరు మనుష్యులు చచ్చినారు Last night, after *thundering* excessively hard, a thunder bolt fell in that village, and two people were killed.

ఉరి *sub.* ఉరి। ఉరులు. A hanging: that is, by the neck. ఉరి తియ్యడం To *hang* a person. ఉరిని or ఉరిలో పడడం To be *hanged*.

ఉరుము *sub.* ఉరుము। ఉరుములు. Thunder.

ఉల్లంకి *sub.* ఉల్లంకి। ఉల్లంకులు. This is the general name given to *small birds* of various kinds, such as sand-larks, found in marshy ground and along the edges of salt or fresh waters. ఉల్లంకి పిట్ట is also, the name commonly given to the *snipe*, which abounds in all parts of India.

ఉలవ *sub.* ఉలవ। ఉలవలు. A gram crop. ఉలవ చేను Item. ఉలవలు being the plural, is applied to the grain itself called *horse gram*.

ఉల్లాసం *sub.* ఉల్లాసపు। ఉల్లాసాలు. Joy; gladness; happiness.

ఉలి *sub.* ఉలి। ఉలులు. A chisel.

ఉల్లి *sub.* ఉల్లి। ఉల్లులు. The onion. నీరుల్లి Item. తెల్లుల్లి The *garlic*. ఉల్లిపాయ also, the name of *onion*. ఉల్లి పాషాణం *Arsenic*.

వులికిపడడం *v. n.* వులికిపడుతూ। వులికిపడి. To start; to be suddenly alarmed; to *wake abruptly* from *sleep.* అతను వెనకగుండా వచ్చి జడిపించినందున నేను వులికిపడ్డాను He came behind and frightened me, which made me *start.* నేను నిద్రలో చెడ్డ కల కన్నందున వులికిపడ్డాను I had a bad dream, which made me *start* out of my sleep.

వుల్లి పాషాణం *sub.* వుల్లి పాషాణపు। వుల్లి పాషాణాలు. Arsenic.

# వూ

వూక *sub.* వూక. (No plural.) The husk of grain.

వూగడం *v. n.* వూగుతూ। వూగి. To swing or to get *rocked* in a bed or swing. అట్లతద్దెకు యీ వూరిలో అంతా వుయ్యాల వూగినారు All in this village amused themselves with *swinging*, on the occasion of the *atlatudday* feast.

వూచ *sub.* వూచ। వూచలు. The name given to the *stalks* of the *jonnaloo grain* when young and before the proper time of cutting. వూచ బియ్యం The name of *young jonnaloo grain.* వూచ also means, an *arrow*.

వూచడం *v. a.* వూస్తూ। వూచి. To rock a bed or cradle. vide. వుయ్యాల.

వూట *sub.* వూట। వూటలు. A spring. మంచినీళ్ళ నూతిలో వూట బాగా వున్నది That well has good water and a plentiful *spring.* వూట also means, a *heavy weight*; also, the liquor of any pickle.

వూడ *sub.* వూడ। వూడలు. The name of the drops from the banian tree, which reach the ground and take root.

వూడ్చడం *v. a.* వూడుస్తూ। వూడిచి. To sweep; also, to transplant. యిల్లు వూడ్చడం To *sweep* a house. వరి అకు వూడ్చడం To *transplant* paddy.

వూడడం *v. n.* వూడుతూ। వూడి. To separate; to come undone.

ఆ కలందాను మూత వూడినది The lid of that writing-case *is come undone.*

వూడిపోవడం *v. n.* వూడిపోతూ। వూడిపోయి. To separate; to be unfastened. vide వూడడం.

• వూడుపు *sub.* వూడుపు। వూడుపులు. Transplantation. ఆ వూరిలో యింకా వూడుపులు కాలేదు The *transplantation* is not yet finished in that village.

వూదడం *v. a.* వూదుతూ। వూది. To blow out: that is, with the breath. పొయి వూదడం To *blow* the fire place. దీపం వూదడం To *blow* out the light: seldom used in this sense.

• వూనడం *v. a.* వూనుతూ। వూని. To stand firm; to fix yourself firmly. ఆ మనిషి బాగా కాలు వూని నిలుచున్నాడు That man ***stands*** in a *firm erect* posture, upon his feet.

వూపిరి *sub.* వూపిరి। వూపిర్లు. The breath; respiration. వూపిరి పుచ్చడం or విడడం To *breath.* వూపిరి పట్టడం To ***hold*** the *breath.*

వూబి *sub.* వూబి. (No plural.) Mud; mire. vide బురద.

• వూరడం *v. n.* వూరుతూ। వూరి. To *rise,* as water in a spring; to ripen or mature, as a pickle. ఆ నూతిలో నీరు వూరినది The water has risen in that well. వూరగాయ యీవేళకు వూరినది The pickle has by this time got strong, or matured. మనిషి వూరడం A man to swell out with good living.

వూరబెయ్యడం *v. a.* వూరబేస్తూ। వూరబేసి. To pickle, either with salt or vinegar; also, to soak or steep. కర్ర వూరబెయ్యడం Wood to soak or be immersed, to preserve it.

వూరికె *adv.* Only; unnecessarily; without reason. వూరికె నన్ను అన్యాయం చేసినాడు He did me injustice *without reason.* నన్ను వూరికే పిలిపించి తిరిగీ పంపించినారు They called me unnecessarily and sent me away again.

వూరు *sub.* వూరి। వూళ్లు. A village.

వూరుకోవడం *v. n.* వూరుకుంటూ। వూరుకుని. To be quiet; to be

silent; not to hinder or prevent. యింతటనుంచి మాట్లాడక వూరుకో From hence forward be *quiet* and speak no more. అతను యింట్లో దొంగ జొరపడగా చూచి వూరుకున్నాడు He saw a thief enter the house and kept quiet without preventing him. నన్ను కొట్టితే నేను వూరుకుంటానా? If you beat me, do you think I will *remain quiet*?

వూష్ణం *sub.* వూష్ణపు। వూష్ణాలు. Fever. vide జ్వరం.

## వె

వెక్కసం *sub.* వెక్కసపు। వెక్కసాలు. Repletion. వెక్కసంగా వుండడం To be replete; figuratively it means, to be angry.

వెక్కిరించడం *v. a.* వెక్కిరిస్తూ। వెక్కిరించి. To ridicule; to mock; to jeer at. This Verb is vulgarly pronounced యెక్కిరించడం. But this వెక్కిరించడం is the proper way. అతణ్ని యీ సంగతిని గురించి మాట్లాడితే మమ్మున వెక్కిరించినాడు గాని, జవాబు యిచ్చినాడు కాడు Speaking to him upon this subject, he *jeered at me* and would give no answer.

వెక్కిరింత *sub.* వెక్కిరింత। వెక్కిరింతలు. A jeering; a jesting.

వెగటు *sub.* వెగటు। వెగటులు. Roughness or harshness of taste.

వెచ్చన *sub.* వెచ్చన. (No plural.) Warmth; heat. శరీరపు వెచ్చన Heat of body. వెచ్చన చెయ్యడం To make warm.

వెచ్చని *adj.* Hot; warm. వెచ్చని నీళ్ళు *Warm* water. వెచ్చని బట్టలు *Warm* clothes.

వెచ్చం *sub.* వెచ్చపు। వెచ్చాలు. Any articles of provision taken up, on credit. కోమటిదగ్గిర వెచ్చం పుచ్చుకున్నాను, కాని నెలసరి అయిన తరువాత రూపాయీలు యిస్తానని చెప్పినాను I have *taken up* some articles on *credit*, from a banian and told him, I would pay at the end of the month.

వెట్ట *sub.* వెట్ట. (No plural.) Heat of the body. vide కాక.

వెడల్పు *sub.* వెడల్పు। వెడల్పులు. Breadth. ఆ యింటి వెడల్పు యెన్ని

మూర్లు వుంటుంది? How many cubits is the ***breadth*** of that house? వెడల్పు బట్ట *A* ***broad*** piece of cloth.

వెతకడం *v. n.* వెతుకుతా। వెతికి. To search; to seek. వక దొంగ పారిపోయినాడని వూరిలో వెతికినారు గాని, దొరికినాడు కాడు A thief has made his escape whom they have searched for through the town, but could not find.

వెద ***sub.*** వెద। వెదలు. A cast, applied to scattering or sowing seeds. వెద వెయ్యడం To ***cast*** or *sow* seeds.

వెదురు ***sub.*** వెదురు। వెదుళ్ళు. A bamboo. వెదురు చెట్టు A bamboo tree or bush. వెదురు బొంగు A bamboo pole. వెదురు చాప A bamboo mat. వెదురు అడవి A bamboo jungle.

వెధవ ***sub.*** వెధవ। వెధవలు. A widow. The proper word is విధవ.

వెన్న ***sub.*** వెన్న. (No plural.) Butter. వెన్నపూస Item. వెన్న తియ్యడం To make butter.

వెనక ***adv.*** Behind; after. వెనక వస్తాను I shall come after. నేను ముందర వెళ్ళినాను, అతడు వెనక వచ్చినాడు I went first and he came after. వెనక తియ్యడం To hesitate; to draw back; to prevaricate. వెనక is also frequently called అవక, being a contraction of అ and వెనక.

వెన్ను ***sub.*** వెన్ను। వెన్నులు. The back, either of human beings or of animals. వెన్నుపూస The back bone. vide బిపు. This word also means the ear of the grain. జొన్న వెన్ను విడుస్తా వున్నది The jonna crop is shooting into ears. వెన్ను is also applied to the ***seed*** in vegetables.

వెన్నెల ***sub.*** వెన్నెల. (No plural.) Moon'light. యీ రాత్రి మబ్బుచేత వెన్నెల బాగా వున్నది కాదు Owing to the clouds last night, there was no proper *moon'light.*

వెంట్రుక ***sub.*** వెంట్రుక। వెంట్రుకలు. The hair. వెంట్రుకలు దువ్వడం To ***comb*** the ***hair*** or ***dress*** the ***hair.***

వెండి ***sub.*** వెండి. (No plural.) Silver. వెండి సామాను ***Silver things.*** వెండి కరగడం To melt ***silver.***

వెంబడి *adv.* Along with; accompanying. ఆ గుఱ్ఱపు సవారు నా వెంబడి వచ్చినాడు That horseman came *along with* me.

వెంబడించడం *v. a.* వెంబడిస్తూ। వెంబడించి. To pursue. అతను పారిపోతూ వుండగా పట్టుకోవలెనని వెంబడించినారు As he was running away they *pursued* him in order to apprehend him.

వెయ్యడం *v. a.* వేస్తూ। వేసి. To put; to place; to arrange. ఆ రూపాయీలు తెచ్చి పెట్టెలో వేసినాడు He brought the rupees and *put* them in the box. ఆ కాకితాలు బల్లమీద వెయ్యి *Put* those papers on the table.

వెయ్యి *adj.* A thousand. వెయ్యి రూపాయీలు A *thousand* rupees. వెయ్యింటికి పది రూపాయీల చొప్పున వడ్డీ పుచ్చుకుంటారు They take interest at the rate of ten rupees to the *thousand.*

వెరసి *sub.* వెరసి। వెరసులు. Total. లెక్క వెరసి The *total* of an account. vide మొత్తు.

వెఱ్ఱి *adj.* Mad. వెఱ్ఱి వాడు A *mad*-man. వెఱ్ఱి కుక్క A *mad*-dog. వెఱ్ఱి యెత్తడం To *turn* or *run mad.* వెఱ్ఱితనం *Madness.* వెఱ్ఱి పని A *mad, silly* business.

వెల *sub.* వెల। వెలలు. Price; valuation. vide విలువ.

వెలగ *sub.* వెలగ। వెలగలు. This is the fruit called by Europeans, the *wood-apple.* వెలగ పండు Item. వెలగ చెట్టు The *wood-apple* tree. This fruit is of a round shape, about the size of an apple and of an apple-green colour. It has a hard brittle shell, the inside of which contains the fruit.

వెలగడం *v. n.* వెలుగుతూ। వెలిగి. To give light. దీపం బాగా వెలుగుతూ వున్నది The lamp *gives* a good *light.*

వెలమ *sub.* వెలమ। వెలమలు. The *vellama* people. వెలమ కులం *Vellama caste.* వెలమ వాడు A *vellama caste* man. వెలమది A *female* of that *caste.* This caste is reckoned among the Sudras. There are many professions among the Sudras, who have the name of వెలమ annexed to their occupation,

such as ఆది వెలమ *Aadi vellama.* గూన వెలమ *Goona vellama.* Most of them are painters of cloth and others are traders in different articles.

వెలి *sub.* వెలి । వెలులు. The term for being turned out of caste: that is, *excluded* or *excommunicated.* వెలి వేయడం To *expel* from the *caste.* వెలి పెట్టడం To *exclude* from society, though not expelled from the caste. వెలి వాడ The name of the *abodes* or *village,* occupied by the *chucklers* and *pariahs,* considered of no caste.

వెలిగారం *sub.* వెలిగారపు. (No plural.) Borax, used in the soldering of metals and also to mix in some medicines.

వెలిగించడం *v. a.* వెలిగిస్తూ। వెలిగించి. To make or cause light. దీపం వెలిగించడం To *light* a candle. మశాలు వెలిగించడం To *light* a *mashaal.* This verb seems only applicable in this sense.

వెలితి *adv.* Less; inferior. వెలితిగా Item. vide తక్కువ.

వెలియడం *v. n.* వెలుస్తూ। వెలిసి. To *hold up,* as the rain; to *fade,* as a colour. వర్షం మొన్న ప్రొద్దున పట్టి సాయంతనం వెలిసినది The rain began the day before yesterday in the morning and *stopped again* at night. ఆ పాలకీ రంగు బొత్తుగా వెలిసినది The colour of that palanquin is completely *faded.*

వెలుగు *sub.* వెలుగు. (No plural.) Light, as opposed to darkness. యిప్పుడు మూడు ఘంటల రాత్రి గనక యింకా వెలుగు లేదు It is only three o'clock of the morning now, it is therefore not yet *light.* వెలుగు రాచడం To be *hoarse.*

వెలుగుబంటి *sub.* వెలుగుబంటి । వెలుగుబంట్లు. A bear.

వెలుతురు *sub.* వెలుతురు. (No plural.) Light. vide వెలుగు.

వెల్లుల్లి *sub.* వెల్లుల్లి. (No plural.) Garlic.

వెసనం *sub.* వెసనపు । వెసనాలు. Sorrow. vide విచారం.

వెళ్ళడం *v. n.* వెళ్ళుతూ। వెళ్ళి. To go; to proceed; to depart. అతను పూరికి వెళ్ళాడు He is *gone* into the country. అతను అయిదు ఆరు నెలలకిందట యిక్కడినుంచి వెళ్ళాడు He departed

from this place about five or six months ago.

## వే

వేగడం *v. n.* వేగుతూ। వేగి. To fry, as rice or fish, in a frying pan.

వేగిరం *adv.* Quickly; expeditiously. అక్కడికి వెళ్ళి తిరిగి వేగిరం రా Go there and return *quickly* again.

వేగు *sub.* వేగు। వేగులు. A secret search or enquiry; a prying. వేగు చూడడం To spy; search privately.

వేట *sub.* వేట। వేటలు. The sport; the chase; a hunt. పంది వేట A wild-hog *hunt.* పిట్ట వేట The *sport* after birds. The common people also call it చేపల వేట for *fishing.* Wild-hog hunting is performed with dogs bred for the purpose and with spears, on foot. As to birds, they are killed with match'locks by people for sale but, otherwise, always taken in nets or with hawks, or bird-lime, and never fired at, in the way of sport or amusement. Fishing is left to the fishermen, and seldom pursued by those in a superior line of life. వేట is also the name for a *sheep.*

వేటుబడి *sub.* వేటుబడి। వేటుబడులు. An advance, as applied to merchandise. వేటుబడి చెయ్యడం To make an advance.

వేడి *sub.* వేడి. (No plural.) Heat. వేడి చెయ్యడం To *heat*; to *make hot.* vide కాక.

వేడుకోవడం *v. n.* వేడుకుంటూ। వేడుకుని. To pray; to say prayers. అతను ప్రతిదినము స్వామిని వేడుకుంటాడు That man *says* his daily *prayers* to God.

వేదం *sub.* వేదపు। వేదాలు. The name of the sacred volume, in which the religion of the Hindoos is written. The Veda is comprised of four parts, called ఋగ్వేదం The *Rigveda.* యజుర్వేదం The *Yajurveda.* సామవేదం The

*Samaveda* and అథర్వణవేదం The *Atharvanaveda.*

వేము ***sub.*** వేము। వేములు. The margosa tree. వేప చెట్టు Item. The bark of this tree is used in fevers, like the Peruvian bark. వేపచెక్క or బెరడు *Margosa bark.*

వేయించడం *v. a.* వేయిస్తూ। వేయించి. To fry, applied to all articles.

వేరు *sub.* వేరు। వేళ్లు. The root of a tree or plant. చెట్టు వేరు Item.

వేరే *adj.* Different; separate; distinct. నాతో వకమాట చెప్పి అతనితో వేరే మాట చెప్పినాడు He spoke in one way to me and in a *different* way to him. యిది వేరే పని, మునపటి పని కాదు This is a *separate distinct* business and not the former business.

వేలం ***sub.*** వేలపు। వేలాలు. An auction; an outcry. వేలం వెయ్యడం To put up to *auction.*

వేలు ***sub.*** వేలి। వేళ్ళు. A finger. వేలికణుపు A *knuckle.* బొటమన వేలు The *thumb.* చిటికిన వేలు The *little finger.* నడిమి వేలు The *middle finger.*

వేషం ***sub.*** వేషపు। వేషాలు. A dress; a mask or a feigned character in a play or masquerade. వేషం వెయ్యడం To *put* on a *dress* in *character.* వేరే వేషం A change of *dress* or *character.* మారు వేషం Item.

వేసడం ***sub.*** వేసడపు। వేసడాలు. A mule.

వేసవి ***sub.*** వేసవి। వేసవులు. The summer. వేసవి కాలం *Summer* time.

వేసారడం *v. n.* వేసారుతూ। వేసారి. To fret; to get vexed.

వేళ ***sub.*** వేళ। వేళలు. Time; day; period. యీ వేళ వస్తాను I shall come this *day.* ప్రొద్దుటి వేళ *Morning time.* సంధ్య వేళ *Evening time.* నీవు యే వేళప్పుడు వచ్చినావు? At what *time* did you come?

వేళాకోళం ***sub.*** వేళాకోళపు। వేళాకోళాలు. Joke or humour.

# వై

వైఖరి *sub.* వైఖరి। వైఖరులు. Behaviour; conduct; manner.

వైడూర్యం *sub.* వైడూర్యపు। వైడూర్యాలు. The stone called the *cat's-eye.*

వైద్యం *sub.* వైద్యపు । వైద్యాలు. Medical aid; medical advice or prescription. వైద్యం చెయ్యడం To afford *medical aid* or to *prescribe* as a doctor. వైద్యుడు ఆ వూరిలో ఒక మనిషికి సంకటంగా వుండగా వెళ్ళి వైద్యంచేసి కుదిర్చినాడు The *doctor* went to that village where there was a man sick, whom he *prescribed* for and recovered.

వైద్యుడు *sub.* వైద్యుని। వైద్యులు. A medical man are physician. This word is frequently called వైదుగుడు but not properly so.

వైనం *sub.* వైనపు । వైనాలు. The particulars; a detail. ఆ లెక్క వైనం చూచుకో Examine the *particulars* of that account. జినస్సుల వైనం A *detail* of articles. అమ్మవలసిన జినస్సుల వైనం The *detail* or list of articles to be sold.

వైపు *sub.* వైపు। వైపులు. A direction. యీ వైపు In this *direction.* ఆ వైపు In that *direction.* అన్ని వైపులు In all *directions.* ఒక పెద్దవాడ యీ వైపుకు వస్తుంది అని చెప్పుతున్నారు The people say, that a large ship is coming *this way.*

వైరాను *sub.* వైరాను। వైరానులు. Distraction; ruin. వైరాను కావడం To be in *confusion.*

వైశాఖం *sub.* వైశాఖపు । వైశాఖాలు. One of the Telugu months, nearly answering to the *month* of *May.*

వైష్ణవం *sub.* వైష్ణవపు. (No plural.) This is the name given to the sect of Hindoos, who mark their foreheads length-ways, and are usually called the *long-marked,* in contradistinction of those with the *broad-mark.*

## వొ

వొడకడం *v. n.* వొడుకుతూ, వొడికి. To spin. నూలు వొడకడం To *spin* thread.

వొడ పొయ్యడం *v. a.* వొడ పోస్తూ, వొడపోసి. To strain; to filter; to clarify.

వొడ్డు *sub.* వొడ్డు, వొడ్లు. The water side. సముద్రపు వొడ్డు The *sea-shore.* యేటి వొడ్డు The *bank* of a river. చెరువు వొడ్డు The *edge* of a tank: that is, of the water in the tank. వొడ్డు also means, the *multiplicand* or *sum multiplied,* in arithmetic.

వొత్తడం *v. a.* వొత్తుతూ, వొత్తి. To press with the hand; to compress; to squeeze. నా చెయ్యి పట్టుకొని వొత్తి చాలా నొప్పించినాడు He laid hold of my hand, *squeezed* it and gave me a great deal of pain. పోకలు వొత్తడం To *break* the betel-nut: that is, when using it.

వొప్పడం *v. n.* వొప్పుతూ, వొప్పి. To agree; to consent. అతను చెప్పిన మాటలకు నేను వొప్పినాను I have *agreed* to his propositions. vide సమ్మతించడం.

వొప్పందం *sub.* వొప్పందపు, వొప్పందాలు. An agreement; a contract. వొప్పందం చెయ్యడం To *make* a *contract*; to *close* a *bargain.* ఆ కోమటిదగ్గిర యిరువై పుట్ల ధాన్యం వొప్పందం చేసినాను I have *closed a bargain* with that banian, for twenty candies of paddy. వర్తకులు తొగరు సరుకు నిమిత్తం వొప్పందపు కాకితాలు వ్రాసి యిచ్చినారు The merchants have *entered* into written *contracts,* for the provision of chay goods.

వొప్పుకోవడం *v. n.* వొప్పుకుంటూ, వొప్పుకుని. To agree; to consent. vide వొప్పడం.

వొరగడం *v. n.* వొరుగుతూ, వొరిగి. To lean back. vide ఒరుకు from which ఒరగడం Item.

వొరుసుకు పోవడం *v. a.* వొరుసుకు పోతూ। వొరుసుకు పోయి. To hurt; to touch lightly; to graze. అతనికి లడాయిలో ఫిరంగిగుండు చేతి మీదుగా వరుసుకు పోయినది A shot from a gun *grazed* that man's hand in the battle.

వొళ్ళు *sub.* వొళ్ళు। వొళ్ళులు. The body. vide శరీరం.

## వో

వోక చెట్టు *sub.* వోక చెట్టు। వోక చెట్లు. The *kalacka* tree. వోక కాయలు *Kalacka* fruit. This word should be written వాక చెట్టు.

వోకిలింత *sub.* వోకిలింత। వోకిలింతలు. Retching or vomiting. వోకిలింత చేసుకోవడం To *vomit.*

వోగు *sub.* వోగు। వోగులు. Detriment; injury; badness. వోగు బాగులు *Bad and good.* vide కీడు.

వోడచడం *sub.* వోడుస్తూ। వోడిచి. To pour out; to discharge.

వోడడం *v. n.* వోడుతూ। వోడి. To lose; to be deprived of. తగవులో వోడడం To *lose* an arbitration. ఆట వోడడం To *lose* at play. సొమ్ము వోడడం To *lose* property.

వోడిపోవడం *v. a.* వోడిపోతూ। వోడిపోయి. To *lose*; not to win. ఆ కుండలోనుంచి నీళ్ళు వోడిపోతూ వున్నవి The water is *running out* of that earthen vessel.

వోడుబిళ్ళ *sub.* వోడుబిళ్ళ. (No plural.) Pantiles. వోడుబిళ్ళ పెంకు Item.

వోటు *sub.* వోటి. Decay. వోటి కుండ A *decayed* vessel: that is, worn out by time. వోటి మాటలు Unsound words; words not to be depended on.

వోదార్చడం *v. a.* వోదార్చుతూ। వోదార్చి. To console; to comfort; also, to condole. అతని తమ్ముడు చచ్చినందున అతని దగ్గరకు వెళ్ళి వోదార్చినాను I went and *condoled* him, on the death of his younger brother.

ఓర్చడం *v. n.* ఓరుస్తూ। ఓర్చి. To suffer; to bear; to endure. నొప్పికి ఓర్చడం To *endure* pain. ఆ శిపాయిని ఐదునూరు దెబ్బలు కొట్టమన్నారు, గాని వాటి అన్నింటికీ ఓర్చినాడు That sepoy was ordered five hundred lashes, and he *bore* them all.

ఓర్వలేకపోవడం *v. n.* ఓర్వలేకపోతూ। ఓర్వలేకపోయి. To be envious; to envy.

ఓర్వలేనితనం *sub.* ఓర్వలేనితనపు। ఓర్వలేనితనములు. Envy; jealousy. మాకు భాగ్యం యెక్కువ కావడంచేత అతనికి ఓర్వలేనితనం విస్తరించినది His *envy* seems to have increased, in proportion to the increase of my good fortune.



శక్తి *sub.* శక్తి। శక్తులు. The name of the Goddess to whom devotion is paid by the Hindoos, to avert the calamity of the small pox. vide అమ్మవారు. This word also means, *strength* and *vigour.* ఆ మనిషికి మహాశక్తి వున్నది That man has a great deal of *strength.* Also means, *evil-spirits* or *demons.* శక్తి పట్టడం To be possessed by an *evil-spirit.* Ability; capacity.

శకునం *sub.* శకునపు। శకునాలు. An omen; a sign; a prognostic. నేను యిక్కడికి రావలెనని విచారించేవరకు, శకునం మంచిది అయినది కాదు గనక, రాకపోయినాను I was in the act of coming here, but observed a bad *omen* and therefore did not come.

శత్రుత్వం *sub.* శత్రుత్వపు। శత్రుత్వాలు. Enmity; opposition. vide పగ.

శత్రువుడు *sub.* శత్రువుని। శత్రువులు. An enemy. ఆ వూరిలో అంతా నాకు శత్రువులు వున్నారు They are all *enemies* to me in that town.

శబ్దం *sub.* శబ్దపు। శబ్దాలు. The sound of a *voice* or of the people speaking; also, words or speech. పాట శబ్దం The

